


# హోమియో వైద్య చింతామణి.




గ్రంథకర్త

డాక్టర్. రూపాకుల సూర్యనారాయణరావు,

ఎం. డి. [బకారాకమిక్]





మొదటి కూర్పు 1000 ప్రతులు.

తెనాలి, లలిత ముద్రాక్షరశాలయందు
పి. ఏ. శర్మ చే
ముద్రింపబడియె.

1927

 [వెల. రు 3-0-0]




ఓం.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# భూమిక

ఆంధ్రమహాజనులారా!

హోమియోపతీ వైద్యవిధానము మన ఆంధ్రదేశము నందింతవరకు వ్యాపించియుండలేదు. ఉత్తరహిందూస్థానమునందు కలకత్తా మొదలగు నగరములలో నీ వైద్యవిధానమును బాగుగ శ్లాఘించెదరు. ఆంధ్రదేశము నందు దీనిని జదివినవారు చాలతక్కువగ నుండుటచేతనున్ను, నిపుణులైన మహనీయులైనను దీని సాంద్రీకరించుటకు ప్రయత్నము చేయకపోవుటచేతను, నిది వ్యాపింపకపోవుటకు ముఖ్యకారణ మయ్యెను. ప్రస్తుత దేశపరిస్థితులనుబట్టి ప్రతివారికిని దేహారోగ్యము నిమిత్తమై, యీ వైద్యము నేర్చుకొనుట యత్యావశ్యకమైయున్నది. ఏలయనగా! పాశ్చాత్య నాగరికత మనదేశమునందు విస్తారముగ ప్రబలియుండుటచేత, అపాయకరములను అనారోగ్యకరములను నగు విదేశయాహారములను మన దేశస్థులు ఆచరించుచుండుటచే, రోగములేని మానవుడు మనదేశమున కనుపట్టడు. అదియునుంగాక ప్రస్తుత పరిస్థితులయందు వైద్యులు ప్రతి స్వల్పరోగమునకును, కొన్ని విషపదార్థములను సూదులతో శరీరమునందు జొనిపి (Injuctions) శీఘ్రకాలములో గుణమిచ్చెదమని ప్రజలను మోసపుచ్చి ధనమును గ్రహించుచున్నారు. జనులు రోగనివృత్తి బొందక తాత్కాలికముగ ఉపశమనంబు బొందించినను, పూర్తిగ నివృత్తింపజేయలేక పోవుచున్నారు.

విషప్రయోగము లేకుండగ వ్యాధుల నివారింపజేయుటకు మతియొక వైద్యవిధానము లోకమునందున్నదా లేదా యను సందేహము సంభవింపవచ్చు

పడవచ్చును. అట్లు సందేహింపబనిలేదు. కారణమేమన! మహాత్ముడగు హోమ్యోపతీ ధన్వంతరి సామ్యూల్ హానిమాన్ (Samuel Hahnemann) అను గొప్ప యూరోపియన్ వైద్యశాస్త్రజ్ఞుడు జర్మనీదేశమున శాక్సనీ (Saxony) పరగణాయందు మెస్సేను (Messsen) అను గ్రామమున 1775 సం॥ ఏప్రియల్ 10 వ తేదీన జన్మించెను. లీప్‌సిక్ (Leipsic) వియన్నా (Vianna) లయందు విద్యాభ్యాస మొనరించి ఎర్లాంజిన్ (Erlangen) యందు 1779 సం॥లో యం. డి. (M. D.) డిగ్రీని స్వీకరించెను. యూరోప్ ఖండములందలి పెద్ద పట్టణములందు పనిచేయుచు దాని వలన విరక్తికలిగి, ఈ వైద్య విధానమును కనిపెట్టియున్నాడు. ఈయన గొప్పరసవాదశాస్త్రజ్ఞుడు [Chemist.] ఈయన పారిస్ పట్టణమునందు గొప్పసాధకముచేసి యీ వైద్య విధానమును ప్రచారమునకు తెచ్చి 80 సం॥ జీవించి ప్యారిస్ పట్టణమునందే 1843 సం॥న కాలధర్మము నొందెను. కనుక అట్టి మహాశయునిచేత ప్రచారమునకు తేబడిన యీ వైద్య విధానమే దీనినే "హోమ్యోపతీవైద్య"మందురు. అట్టి మహానీయునిచే స్థాపింపబడి ఈ కొలది కాలములోనే ప్రపంచమునందంతటను వ్యాపించి సమస్తమైన ఔషధరాజములకంటె మిన్నయని గొప్ప వైద్యపండితులచే నింతవరకును నిర్వివాదాంశముగా అంగీకరింపబడుచుండుటయేగాక ఖండాంతరములందుగూడ ననేక కళాశాలలు స్థాపింపబడి పరిపాలనాధికారులచే పోషింపబడుచున్నవి. ఇట్టియున్నత విద్య సమస్త వాఙ్మయములయందు ప్రచురింపబడి యుండి మన యాంధ్ర భాషయందు లేకుండుటచే ఈ చిన్నపొత్తమును వ్రాయతలపెట్టితిని. ఈ వైద్య విధానమునందు వ్రాయబడిన ఔషధములను తెప్పించుకొని గృహమందుంచుకొని వ్యాధులు సంభవించిన ప్రారంభదశయందే ఔషధములను, ఈ క్రింది చెప్పబడు విధానములతో అతిజాగ్రత్తగా సేవించిన, అద్భుతముగ వ్యాధులంతరించుటయేగాక చెడిపోవుటకు సిద్ధముగానున్న ఆరోగ్యమును కాపాడుకొనుటకు మిగుల సహకారియగును. ఈ మందులు నిరపాయకరమైనవియు,



శీఘ్రకాలములోనే స్థిరమైన గుణమిచ్చునవియునై యున్నవి. వీనిని చంటిపిల్లలకును, గర్భవతులకును నిర్భయముగా వాడవచ్చును. వీనిని తోటివైద్యముచేయువారు వాడిన ద్విగుణీకృత గుణమునుపొందగలరు. ఎన్ని వైద్యములైనను చేయించి విసిగి వ్యాధికుదరదని ఆశవదలుకొనినవారు, ఈ మందులను సేవించి సుస్థిరమైన ఆరోగ్యమును పొందెదరని దృఢమైన నమ్మకముతో చెప్పుచున్నాను. కనుక ఈ "హోమ్యోపతీ" వైద్యమును ఆంధ్రదేశమునందున్న సమస్తజనులు నమ్మకముతో వాడెదరని నమ్మి యింతటితో విరమించుచున్నాడను. ఈ గ్రంథము వ్రాయునప్పుడును, ముద్రణకై యిచ్చినప్పుడును, నాకు దేహస్వస్థత సరిగాలేనందున గ్రంథము సంశోధించుటయందు గాని, వ్రాయుటయందుగాని, పెక్కుదోషములుండవచ్చును. చదువరులు అవి యన్నియు ఒకపాలుగా గ్రహించి, నన్ను మన్నింపవేడెదను. ఇది ప్రథమముద్రణమైనందున ఇందుండు లోపములను నాకు తెలియపరచిన వైద్య సోదరులకు వందనము లర్పించుచు ద్వితీయ ముద్రణమునందు వానిని సవరించెదను

వలివేరు,
1—11—27.

ఇట్లు విధేయుడు,
Dr. R. SURYANARAYANA RAO,
M. D. (Bieo.)
*VOLIVERU,*
*Guntur Dt.*

# చదువరులు గ్రహింపవలసిన విషయములు.

(౦)

1. ఔషధములను శుభ్రమగు గదులయందుంచవలెను.

2. సెంట్లు మొదలగు సువాసన ద్రవ్యముల చెంతను, మిరప, వెల్లుల్లి, ఇంగువ మొదలగు ఘాటువస్తువుల చెంత నౌషధముల నుంచరాదు. హోమియోపతిక్ ఘాబినీస్ క్యాంఫరునుగూడ ఔషధముల చెంతనుంచరాదు.

3. ఏపనిచేయుచున్నను ఔషధమును దీసి వాడుటకు చేతులను శుభ్రపరచుకొని ఔషధములను వాడుచుండవలయును.

4. రోగులు మాత్రలను చేతియందు చాలసేపుంచుకొన రాదు.

5. రోగులు మాత్రలను మ్రింగక నోటిలోవేసి చప్పరించుచుండ వలెను.

6. ద్రావకమును వాడవలసివచ్చి నప్పుడు హస్తమును శుభ్రపరచు కొని సీసాను కుదిపి పైమూతను సీసా మూతి తానించి ఒక చుక్కను అర ఔన్సు కాచి చల్లార్చిన నీటియందువేసి మోతాదుగా నీయవలెను.

7. వ్యాధి యెక్కువగానుండి, త్వరితముగా గుణము కనుబడ వలయునన్న ఒక అవున్సు వేడినీటియందు 12-15 మాత్రల వరకు వేసి కరిగిన తరువాత సీసానుకుదిపి చంచామోతాదుగా ప్రతి 5 లేక 10 నిమిషములకొకమారీయవలెను. ఉద్రేకము తగ్గిన కొలదిని మోతాదులను ఆలస్యముగా నిచ్చుచుండవలెను.

8 అవుషధము పుచ్చుకొనుటకు ముందుగాని వెనుకగాని నొకగంట వరకు ఆహారము తీసికొనగూడదు. దాహము కావలసియున్న త్రాగవచ్చును.

9. కాఫీ, పులుసు, కారము, ఆవ, నూనె, గుమ్మడి, అజీర్ణము చేయు పదార్థములను మానివేయవలె, మితాహారమును నియమితకాలమునందు పుచ్చుకొనవలెను.

10. నిద్రనుండి లేచి అవుషధము వెన్వెంటను రోగికి నీయరాదు.

11. రోగిపరుండు గదులను, పడకను శుభ్రముగానుంచి గాలివచ్చునట్లు కిటికీలను తెరచియుంచి, నిశ్శబ్దస్థలములందు పరుండబెట్టవలెను.

12. వ్యాధి భయంకరమైనదనియు, పెరుగుచున్నదనియు రోగికి చెప్పరాదు. వ్యాధి యెక్కువగా నున్నచో ప్రతి కొన్ని కాలములకును అనగా



ప్రతి 10-15 నిమిషములకు అవుషధమును వాడుచు నొక గంటలో గుణము కనుబడనిచో అవుషధమును మార్చుచుండవలయును. ఒకవేళ పొరపాటున 1-2 మాత్రలు యెక్కువ తక్కువలు రోగికిచ్చినను యెంత మాత్రము ప్రమాదములేదు

13 చికిత్సా విధానమునందు వ్యాధి పేర్ల నివారణచేయబడునని వ్రాయబడినది. ఈ వైద్యవిధానమునందు రోగ గుణములే ముఖ్యముగాని వ్యాధులపేర్లు ప్రధానముగావు. అందుచే నొక్కొక వ్యాధిపేరు వ్రాసి దానిక్రింద ముఖ్యమైన మందును, దానికెదురుగ ఆవ్యాధిలోని ముఖ్యలక్షణములును వ్రాయబడియున్నవి. ఇది మొదటకొంచెము కష్టముగ కనుబడినను చదువరులు చూచుచున్నకొలదిని సులభముగనుండును. మందు ప్రక్కను అంకెవేసి యుండునది మందు సత్తువని గ్రహింపవలయును. ఉదాహరణము:— ప్లాంటాగో Q; ఆకోనైటు 3; నక్సువామిక 30; బెసిలనం 200. Q అని వ్రాసి యుండుమందును ధీటాయునియు లేక వాడుక పదమునందు మదర్ టించెర్ (Mother Tincture) అనియు అందురు. ఒక్కొకమందును మీరు 1, 2 డ్రాములకన్న యెక్కువ తెప్పించుకొన వలసినంత పనిలేదు. కారణమేమన? ప్లాంటాగో Q అను మందును అవుషధసేవకొరకై తెప్పించెదరనుకొనుడు. ఒక అవున్సు గ్లాసునందు 60°/. స్పిరిట్ ఆఫ్ వైనును (60°/. Spirit of Wine) వేసి, ఒక డ్రాము బుడ్డిలో ఆస్పిరిటును 15 లేక 20 చుక్కలు ఖాళీయుండునట్లుగాపోసి, అందు ప్లాంటాగో Q అనుమందుసీసాను 4, 5 సార్లు కుదిపి బిరడాను తీసి పైవక డ్రాము బుడ్డియందుండు స్పిరిట్ ఆఫ్ వైనులో 10 చుక్కలువేసి సీసాకు మూతయుంచి 20 సెకండులు సీసాను కుదిపిన నది 1వ సత్తువగలమందు యగును. 2వ సత్తువను చేయవలయునన్న, ఒక డ్రాము బుడ్డియందు స్పిరిట్ ఆఫ్ వైనును 20 చుక్కలు ఖాళీయుండునట్లుగాపోసి, అందు 1వ సత్తువగలమందు సీసాను కుదిపి 10 చుక్కలువేసి మూతయుంచి 20 సెకండులు సీసాను గూడ కుదిపిన అప్పుడది 2వ సత్తువగల మందు యగును. ఈవిధముగనే 20 చుక్కలను కలుపుచు, కుదుపుచు 2 డ్రాముల ఔషధమునుగూడ తయారుచేసికొనవచ్చును. అటుల 12వ సత్తువగలమందు వరకును తయారుచేసికొన [illegible] 3వ సత్తువగల అవుషధమైన తరువాత మరల Q ను గాని, 1వ సత్తువనుగాని, 2వ సత్తువునుగాని, 3వ సత్తువును

గాని కంపెనీనుండి తెప్పించి పైనవిధముగా 12వ సత్తువమందువరకు తయారు చేసికొనుచుండిన మందును త్వరలో తెప్పించుకొనునంతయు, యెక్కువ తెప్పించుకొనునంతయు లేక యెక్కువతయారుచేసికొనునంతయు అగత్యము పట్టకయుండును. 30వ సత్తువని వ్రాయబడినచోటుమట్టుకు మీరు 29వ సత్తువగల అవుషధమును తెప్పించుకొనవలయును. 29వ సత్తువ అయిపోవుచున్నప్పుడు ఒక డ్రాము బుడ్డియందుగాని, రెండుడ్రాముల బుడ్డియందుగాని స్పిరిట్ అఫ్ వైనును 7, 8 చుక్కలు కాళీయుండునట్లుగా వేసి అందు 29 సత్తువుగల సీసాను కుదిపి 2 చుక్కలువేసి, మరల వానీసీసానుగూడ 20 కుదుపులు కుదిపిన అప్పుడది 30 వ సత్తువుగల మందాయగును. 31వ సత్తువ మందు నీవిధముగ తయారుచేసి అది అయిపోయిన తరువాత కంపెనీ నుండి మరల 29 సత్తును తెప్పించుకొనవలెను. 200వ సత్తువని వ్రాయబడినచోట 199వ సత్తువును తెప్పించుకొనవలెను. ఈవిధముగనే 201వ సత్తువరకు 2 చుక్కలను కలిపి అది అయిపోవుచున్నప్పుడు 199వ సత్తువుగల అవుషధమును తెప్పించుకొనవలయును.

14 పిల్యూల్సునుగాని, గ్లోబ్యూల్సునుగాని తెప్పించి దగ్గరనుంచుకొని రెండు డ్రాముల సీసాలకు చీటీలనంటించి సత్తువు మందు పేరును వ్రాసి అందు గ్లోబ్యూల్సు అను పంచదార మాత్రలను వేసి, ఆ పేరుగల అవుషధ అరకును కుదిపి 5,8 చుక్కలవరకు మాత్రలందు వేసి కుదుపవలయును. అటుల కుదిపినచో సీసాలోని మాత్రల కన్నిటికిని అరకు అంటుకొనును. అప్పుడవి వాడుటకు ఉపయోగముగనుండును. ఈమాత్రలనే మోతాదునకొక మాత్ర చొప్పున వాడుచుండవలెను. సీసాలోనుండు మాత్రలైన తరువాత మరల ఆసత్తువుగల మందును కలుపవలయునుగాని, వేరొకమందును వేరొక్కసత్తువును కలిపిన సీసాలో తక్కువసత్తువును కలిపిన సరిగ పనిచేయవు వేసేదు? ఒక అవుషధమాత్రను పట్టుకొని ఆచేతితో మరియొక అవుషధ మాత్రను పట్టుకొనినచో అది సరిగ పనిచేయదు. కనుక అవుషధమును సాధ్యమైనంతవరకు ముట్టుకొనక కాగితమును గొట్టముగ నేర్పరచుకొని అందు మాత్రలను వేసి యివ్వవలెను. ఒకవేళ నోటియందు 1,2 మాత్రలు యెక్కువగా పడి, చేతితో ముట్టుకొని సీసాలో మాత్రలు వేయుట తటస్థించినయెడల నోటిని శుభ్రముగా కడుగుకొని మరియొక మందును వాడవలయును.

# ఈ గ్రంథమునందుగల ఔషధములు.

1 ఆసిడ్ ఆసిటిక్ 2 ఆసిడ్ బెంజాయిక్ 3 ఆసిడ్ హైడ్రోకియానికం 4 ఆసిడ్ లాక్టిక్ 5 ఆసిడ్ మ్యూర్ 6 ఆసిడ్ నైట్రిక్ 6 ఎ. ఆసిడ్ ఆక్జాలిక్ 7 ఆసిడ్ ఫాస్ 8 ఆసిడ్ పిక్రిక్ 9 ఆసిడ్ సల్ఫ్యూరిక్

10 ఎబిస్నిగ్ర 11 అకోనైటు 12 యాక్టియా రేసిమోస 13 యాగ్నస్ కాస్టస్ 14 ఏగేరికస్ మస్కేరియస్ 15 వైమెసెక్యులసుహిప్ 16 వైయెథ్యూజకినాపియం 17 ఎలియం సీపా 18 ఎలియం శాటైవా 19 ఆలోసు 20 ఎలట్రిసుఫారినోజ 21 అల్యూమినా 21 (ఎ) అల్యూమెన్ 22 యాంబ్రగ్రీషియ 23 అమ్మోనియంకార్బ 24 అమ్మోనియం కాస్టికం 25 అమ్మోనియం మ్యూర్ 26 అమిల్ నైట్రేటు 27 ఎనకార్డియంఓరియంటేల్ 28 యాంటిమోనియం క్రూడం 29 యాంటిమోనియంటార్టారికం 30 ఎపిస్ మెల్లిఫికా 31 ఎపొమార్ఫియా 32 ఎపోసైనం కెనాబినం 33 అర్జంటం మెటాలికం 34 అర్జంటం నైట్రికం 35 అర్నిక 36 అర్సెనిక్ఆల్బం 37 ఆర్టిమేసియవల్గరిస్ 38 ఎసఫోయిటిడా 39 ఆరం మెటాలికం

40 బార్యటకార్బ 41 బాప్టీషియా 42 బెసిలినం 43 బెర్బెరిస్ 44 బెల్లడోన 45 బ్లాటాఓరియంటలిస్ 46 బెల్లిస్పెరెనిస్ 47 బోరాక్సు 48 బోవిష్ట 49 బొత్రాప్సు 50 బ్రయోనియ 51 కాల్కేరియకార్బొనిక 52 కాల్కే

173 ఫిసాస్టిగ్మా 174 ఫైటొలక్క 175 ప్లాంటాగో 176 ప్లాటినా 177 ప్లంబం మెటాలికం 178 పొడోఫిలం 179 సోరైనం 180 పల్సటిల్లా 181 పైరోజెన

182 రానాబ్యూఫో లేక బ్యూఫో 183 రానన్క్యులస్ బల్బోజ 184 రేడియం బ్రోమాటం 185 రాటన్హియ 186 రోడోడెండ్రన్ 187 రుహస్ ఆరోమాటిక 188 రుహస్ టాక్సికోడెండ్రన్ 189 రిసినస్ కామ్ 190 రొమెక్సు 191 రోబినియ 192 రూటాగ్రావొలెన్సు

193 శాబిన 194 శాంబ్యూకస్ 195 శాంగ్యునేరియ 196 శాంటొనైను 197 సిల్లా 198 సెకెల్ కర్ 199 సెలినియం 200 సెనిసియో 201 సెనెగ 202 సెపియ 203 సైలీషియ 204 సొలిడాగోవర్గ 205 స్పైజిలియ 206 స్పాంజియ 207 స్టానం 208 స్టాఫిసాగ్రియ 209 స్ట్రామోనియం 210 సల్ఫర్ 211 సిఫిలినం 212 సింఫొరికార్పసు రేసిమోజ 213 సింఫైటం 214 సిజిజియం జాంబొలికం

215 టారెంట్యుల 216 టెల్లూరియం 217 టెరెబింథిన 218 థలాస్పి బర్సాపాస్టొరిస 219 థూజ 220 టబాకం 221 ట్రిల్లియం 222 ట్యూబర్క్యులినం 223 [illegible]

224 యురానియం నైట్రికం 225 యుర్టికా యురెన్సు 226 వాక్సినినం 227 వేరియోలినం 228 వలేరియాన 229 వెరాట్రం ఆల్బం 230 వెరాట్రం విరిడె 231 వైబర్నం ఒపుల్యలస్ 232 విపెరా టొర్వాటు 233 విస్కం ఆల్బం 234 జాంథాక్సైలం 235 జింకం మెటాలికం 236 జింకం ఫాస్ఫారికం

# విషయసూచిక.

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 20 | పిత్తాశ్శయమునందు | పిత్తాశయమునందు |
| 86 | 4 | సత్తువగలదానికి | సత్తువగలదానిని |
| 88 | 10 | కళ్ళు | కీళ్లు |
| 89 | 12 | వేసవివాలము | వేసవికాలము |
| 90 | 11 | లెగబాకు | లెగ్రబాకు |
| 118 | 13 | దీనినివలన | దీనివలన |
| 119 | 9 | రక్తస్రావములనను | రక్తస్రావములవలనను |
| 122 | 1 | ఆటుల | అటుల |
| 125 | 13 | పురుగాలుయున్న | పురుగులుయున్న |
| 128 | 9 | ఆటులచేసినది | అటులచేసిననది |
| 129 | 19 | అంగమీద | అంగముమీద |
| 131 | 3 | వ్యాసులైనను | వ్యాసులైను |
| 1?2 | 6 | పవర్ణము | పూర్ణిమ |
| 133 | 13 | స్వప్వమందు | స్వప్నమందు |
| 134 | 11 | ఛారలమాదిరిగా | చారలమాదిరిగా |
| 141 | 3 | సుగుణముబాగానున్న | సుగుణముగానున్న |
| 141 | 8 | రోజూను | రోజును |
| 150 | 7 | యోనిని | యోని |
| 151 | 2 | మగునొప్పులు | మంతనొప్పులు |
| 151 | 10 | వామేహము | సవామేహము |
| 157 | 13 | కండెలుకట్టినట్లుగానొప్పి గర్భమునందును | పిరుదులయందును, గర్భము నందును, కండెలు కట్టి నట్లుగానొప్పి |
| 160 | 22 | మూత్రముకోశము | మూత్రకోశము |

ఓమ్

శ్రీరామకృష్ణ పరబ్రహ్మణేనమః

# హోమ్యోవైద్యచింతామణి.

## చికిత్సా విధానము.



### 1. సామాన్య జ్వరము. (Simple Fever)

అకోనైటు 6 (Aconite 6) :— ఇది జ్వరములలో ప్రధానౌషధమనిచెప్పవచ్చును. జ్వరముతో చెమట; ముఖము వేడిగాను, ఎరుపుగాను, వెలవెలబోవుచునుండి, ఎక్కువ చల్లనినీళ్ళు త్రాగుటయందభిలాష, నాడి పుద్రేకముగానుండి, రోగికి అవిశ్రాంతి ఆవేదన వుండి, రోగి తను జీవించననే భయముతో వైద్యునితోను చుట్టుప్రక్కవారితోను కను పరుచుచుండి, జ్వరము సాయంతనమునను, రాత్రి నిద్రపోవు సమయమున హెచ్చుగానుండిన దీనిని రోజకు 4 మోతాదులను వాడవలయును.

బెల్లడోన 30. (Belladona 3?) :— చెమటగుడ్డ కప్పుకున్న భాగములంటుపోయుచు, అడిగినదానికి జవాబు సగము కళ్లుమూసుకొని పరాకుగా చెప్పుచుండి, కండ్లుఎరుపు, తలనొప్పి, భయంకరమగు జంతువులను వింతముఖములను

చూచుచున్నట్లు కలలుగనుచు పులిక్కిపడుచు, దగ్గరనున్న వారిని కరవబోవుటయున్న దీనిని రోజుకు 4 మోతాదులను వాడవలయును.

N. B. జ్వరము 102°, 103°, 104° (డిగ్రీలు) దాటు చుండిన గోరువెచ్చని నీటిలో పరిశుభ్రమగు తెల్లని గుడ్డను తడిపి, కొద్దిగాపిండి, రోగియొక్క శరీరమునంతయు తుడిచి వెంటనే పొడిగుడ్డచే ఆరునట్లుగా తుడవవలయును. రెండవది సమశీతోష్ణజలము రెండు వెడల్పు గిన్నెలయందుంచి, ఒక గిన్నె మంచముక్రిందనుంచి రోగిని కూర్చుండబెట్టి పాదముల నందు ముంచమని చెప్పవలెను. రెండవగిన్నెను వడియం దుంచి చేతులను అందు ముంచవలసినట్లు చేయవలెను. ఇటుల 5 నిమిషముల మొదలు 10 నిమిషములవరకు చేసిన చాలును పై రెండువిధములలో నేది సులువనితోచినను లేక రెండువిధములుగను ఏజ్వరమునందైనను రోజుకు 8-10 మార్లు చేయవచ్చును. అటులచేసిన శరీరము శుభ్రముగానుండు టయేగాక ఎక్కువగా దురవస్థకు రానున్నజ్వరమును కాపాడు కొనుటకు మిగుల సహాయకారియగును. తలనొప్పి, మాగన్ను ప్రాముఖ్యముగానున్న ఉడుకులాము ఒకడ్రామును 6 ఔన్సుల చల్లనినీటియందుంచి, రెండుగుడ్డలను అందుతడిపి, ఒకదానిని రెండుపార్శ్వములకును వ్రేలాడునట్లుగా ముఖముమీదకప్పి,



రెండవ దానిని షుమారు బెత్తెడు గుడ్డగా బొడ్డుమీద వేయ వలయును.

ఆహారము:—బియ్యపునూకలు వేయించి విసిరినవిగాని, గోధుమనూకలుగాని ఆవుపాలతో జావకాచి ఇవ్వవలెను. చిట్టుడుకునీళ్ళనుగాని, బార్లేగింజల జావగాని కాచి ఇయ్య వచ్చును. పైనుదహరించిన నూకలను షుమారు మూడువేళ్లకు వచ్చినంతపొడినే వేయవలయునుగాని అంతకంటె మిక్కుట ముగావేసి జావకాచి యిచ్చినచో పక్కుటుచేయును.

## 2. విడిచివిడిచి వచ్చెడు జ్వరము.

## (Ague or Intermittent Fever).

దీనినే మన్యపుజ్వరమనియు, పాళీజ్వరమనియు, చలి జ్వరమనియు అందురు. ఇది ప్రతిదినమునగాని, దినమువిడచి దినమునగాని, రెండు రోజులకొకమారుగాని వచ్చుచుండును.

ఎపిస్‌మెల్లిఫికా 3 (Apis Mellifica 3):— జ్వరము, ఎక్కువ చలిన్ని, దాహమును కలిగి, వేడిపదార్థములను వేడి గానుండుగదులను భరింపలేక, చల్లనినీటివల్ల, చల్లనిగాలివల్ల సుగుణముగానుండి, తెల్లవారుఝామున 3 గం॥ గాని సాయం కాలము 3 గంటలకుగాని వచ్చుచుండిన రోజుకు 4 మో॥ వాడవలసినది.

ఛినినం సల్ఫ్యూరికం. 200 (Chininum Sulphuricum 200) :- చలిజ్వరమువలన పీడింపబడువారలు రోజుకు 2 మాత్రలను లేక మోతాదులను సేవించుచుండిన నీజ్వరమును రాకుండ కాపాడును.

చైనా లేక సింకోన 12 (China 12):-జ్వరము సాధారణముగా ప్రతి 7 రోజులకువచ్చి 2, 3గంటలుండును. జ్వరమున్నప్పుడు గుడ్డకప్పినభాగము అతిచెమటయు, నిద్రబోవుచున్నప్పుడు అతిచెమటయు, ఉన్న దీనిని రోజుకు 4 మో॥ వాడవలెను.

అర్సెనిక్ ఆల్బు 30 (Arsenic Album 30) :- జ్వరము రాత్రి 1,2 గం॥ వేళవచ్చుచుండి, ఒడలంతయు మంటగానుండి, వేడిగానుండు గదివల్లను, వేడినీళ్లవల్లను సుగుణముగానుండి, చలిగాలి, చన్నీళ్లు రోగికి యిష్టముగాకున్న దీనిని రోజుకు 4 మోతాదులను వాడవలెను.

నక్సువామిక. 30 (Nux Vomica 30):- అజీర్ణమువలన కలిగి చలి,వేడి, మారుచుండివచ్చినను, వేడితో చమటయుండి రోగి శరీరమంతా గుడ్డకప్పుకొనుచుండిన రోజుకు 4 మో॥ వాడవలెను. దీనివలనసుగుణములేనిచో పల్సటిల్లా 30 (Pulsatilla 30)ను వాడవలయును.

సైనోథస్ అమెరికాన Q (Ceonothus Americana. Q):- చలిజ్వరమువలనగాని, చాలరోజులు క్వైనాను వుపయోగించుటవలనగాని మరి యే యితర కారణములవలననైనను ప్లీహాజబ్బు ఏర్పడిన ఈ ఔషధమును 2-5 చుక్కలవరకు ఒక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు కలిపి మోతాదుగ నిచ్చుచు దినమునకు 3 మో॥ నీయవలెను. ఆముందునే ప్లీహాముమీద వాపునకుగూడ పూయుచుండిన చాలయుపయోగముగ నుండును.



ప్రతి దినము, చలి, జ్వరముతోగాని మారుచుగాని, 24 గం॥ కొకమారు వచ్చుచుండిన ఇపికాకు 6 (Ipecacuanha 6) నక్సువామిక 30 (Nux Vomica 30.) పల్సటిల్లా 30 (Pulsatilla 30) లను గుణగతములనుబట్టి వాడవలెను.

ప్రతి 48 గం॥లకు అనగా దినమువిడచి దినము తగులుచుండిన ఛమోమిల్లా 6 ను (Chamomilla 6) కాల్ కేరియ 6 ను (Calcarea 6) లైకపోడియం 30 ను (Lycopodium 30) గుణగతములనుబట్టి వాడవలయును.

ప్రతి 72 గం॥లకు అనగా మూడుదినములకొకమారు వచ్చుచుండిన అర్సెనిక్ 6 (Arsenic 6) లైకపోడియం 30 (Lycopodium 30) ను వాడవలయును.

చలిజ్వరము రోజుకు 2 సార్లు వచ్చుచుండిన చైనా 6ను, (China 6.) పల్సటిల్లా 30 ను (Pulsatilla 30.) వాడవలయును.

ప్రతి 3 దినములకును చలిజ్వరము 2 సార్లు వచ్చుచుండిన, నక్సువామిక 30 ను (Nux Vomica 30.) రుహస్ టాక్సు 30 ను (Rhus Tox 30) వాడవలయును.

చలితోజ్వరము నిశరాత్రి 1, 2 గం॥లకు తగిలిన అర్సీనిక్ 6 ను, (Arsenic 6); తెల్లవారుఝామున 3 గం॥ తగిలిన థ్యూజ 30 ను, (Thuja 30); 4 గం॥ తగిలిన, సీడ్రన్ 6 ను, (Cedron 6); ఉదయం 5, 6 గం॥ తగిలిన బొవిష్ట 30 ను, (Bovista 30); 7,9 గం॥ లోపుగా తగిలిన యుపటోరియం పర్ఫ 3ను (Eupotorium Perf 3.); 10,11 గంటల లోపుగా తగిలిన నాట్రంమూర్ 3 ను, (Natrum Mur 3); మధ్యాహ్నం 12,2 గం॥ లోపుగా తగిలిన అర్సీనిక్ 6ను, (Arsenic 6); 3,4 గం॥ లోపుగా తగిలిన ఛినినంసల్ఫు 30 ను, (Chininum Sulph 30); సాయింకాలము 5 గం॥ తగిలిన కెలికార్బు 3 ను, (Kai Carb 3); 6 గం॥ తగిలిన యాంటిమోనియం టార్టారికం 30 ను, (Ant. Tar. 30); రాత్రి 7,8గం॥ తగిలిన రుహస్టాక్సు 6ను, (Rhus. Tox 6), సల్ఫర్ 30 ను, (Sulphur 30); 9,10 గం॥ తగిలిన బొవిష్ట 30 ను (Bovista 30); నిశరాత్రి 11,12 గం॥ తగిలిన అర్సీనిక్ 6 ను (Arsenic 6) వాడవలయును.

చలిలేకుండగ జ్వరము రాత్రి 12, 4 గం॥ లోపుగా తగులుచుండిన అర్సీనిక్ 6ను (Arsenic 6.); ఉదయం 6,9గం॥



లోపుగా వచ్చుచుండిన రుహస్టాక్సు30ను (Rhus Tox 30) 10,11 గం॥ లోపుగావచ్చుచుండిన నాట్రంమూర్ 3ను (Nat. Mur 3) మధ్యాహ్నం12,1గం॥కు తగులుచుండిన సైలీషియా 3,6 ను (Silicea 3,6) మధ్యాహ్నం 1,2 గం॥కు తగులుచుండిన అర్సీనిక్ 6 ను (Arsenic 6) 3,4 గంటలకు తగులుచుండిన ఎపిస్ 30 ను (Apis 30) సాయంకాలము 5 గంటలకు తగులుచుండిన కోనియం 6 ను (Conium 6), 6 గం॥కు తగులుచుండిన నక్సువామిక 30 ను (Nux Vomica 30) రాత్రి 7,12 గం॥ లోపుగా వచ్చుచుండిన హైసెక్యులస్ 6ను (Aesculus Hip 6) వాడవలయును.

ఎక్కువ చెమటయున్న ఆసిడ్ ఫాసు 30 ను (Acid Phos 30), ఎక్కువ ఒడలు నొప్పులున్న జెల్సీమియం 6 ను (Gelsemium 6), ఎక్కువ పైత్యాధిక్యతవున్న పల్సటిల్లా 30 ను (Puls. 30) వాడవలయును.

ప్రతిదినమునగాని, దినమువిడచి దినమునగాని, రెండు రోజులకొకమారుగాని జ్వరము తగిలినగంటకే తగిలిన సీడ్రన్ 6 ను (Cedron 6) వాడవలయును.

పైవానివలన సుగుణము లేనిచో ఈక్రింది ఔషధమును 4 గం॥ కొక మోతాదు చొప్పున రోజుకు 4 మోతాదులను వాడవలయును:—

Quininae Sulph. gr. 8 to 20.
Acid Sulph. dil. m. 20 to 40.
Aqua Destillata ... ... 4 oz.

ఎక్కువ జ్వరముతో మైకము, తలనొప్పియున్న 4 గం॥ కొక మోతాదు చొప్పున రోజుకు 4 మో॥ లను ఈ క్రింది ఔషధమును వాడవలయును:—

Quininae Hydrobrom. gr. 4 to 20.
Acid Hydrobromic. dil. m. 20 to 40
Spt. Rectified m. 40.
Aqua ... ... 4 oz.

N. B. Quinine should not be given when the stomach is over-loaded.

### 3. దద్దులతోకూడిన జ్వరము.

బెల్లడోన 30 (Belladona 30):— సామాన్యమైన దద్దులుగల జ్వరముతో నోటియందు నీరెక్కువ వూరుచున్న దీనిని రోజుకు 4 మో॥ లు వాడవలయును. దీనివలన సుగుణము లేనిచో మెర్క్యూరియస్ కరోసివస్ 30 ను (Mer. Cor. 30) వాడవలయును.

బెల్లడోన 30 (Bell. 30) లేక వెరాట్రంఆల్బు 30 (Verat Alb 30):— గొంతుయందు నొప్పియుండి, దద్దులతో జ్వరమున్న పైరెండు మందులలో నొక దానిని రోజుకు 4 మో॥ వాడవలయును.



యుర్టికాయురెన్సు 3 (Urtica Urens 3):— జ్వరము లేకుండగ పైత్యాధిక్యతవలన దాగురులు కనుబడిన దీనిని రోజుకు 4 మో॥ వాడవలసినది.

### 4. విషపడిసెము. (Influenza).

ఇన్ఫ్లుయెంజినం 30 (Influezinum 30):— ఇన్ఫ్లుయంజా జ్వరమునకిది ప్రధానౌషధమైయున్నది. 1,2 మోతాదులను ఇచ్చిన వెంటనే తగ్గిపోవును. ఇన్ఫ్లుయంజా జ్వరములు ఎక్కువగానుండు దినములందు దీనిని ఆరోగ్యరక్షణకు గాను రోజుకు 1 మో॥ తినుచుండవలయును.

అకోనైటు 6 (Aconite 6):— జ్వర మెక్కువగానుండి, దాహము, భయము, అవిశ్రాంతియుండిన రోజుకు 4 మో॥ వాడవలయును.

N. B:— ప్రతిజబ్బునందును అకోనైటు (Aconite) వల్ల 48 గం॥ లో సుగుణము కనుబడనిచో ఔషధమును మార్చవలయును. అటుల మానివేయనిచో అకోనైటు (Aconite) నందు ధాతువును, హృదయమును రక్తనాళములను కొట్టుకొనుటను తగ్గించు స్వభావముకలదు.

యూపుటోరియంపర్ఫు 1,3 (Eup. Perf. 1,3):—కీళ్ళయందు నొప్పులు ఎక్కువ ప్రాముఖ్యముగానున్న దీనిని వాడవలయును.

వెరియోలినం 30 (Variolinum 30):— జ్వరముతో బాటు నడుము నొప్పి ప్రధానలక్షణముగానున్న దీనిని వాడవలయును.

ఇపికాకు 3 (Ipecacu 3):— వికారము, వాంతియున్న దీనిని వాడవలయును.

రుహాస్‌టాక్సు 30 (Rhus Tox 30):— నడుము, కీళ్లు నొప్పులుగానుండి, సన్నిపాతముతో కూడియున్న దీనిని వాడవలయును.

యాంటిమోనియం టార్‌టారికం (లేక) టార్‌టార్ ఎమిటిక్ 6. (Ant. Tar or Tart emit 6):— ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఎక్కువగానుండి దగ్గు, కళ్లె, గొంతులో గురక, నడుము, తల నొప్పియున్న దీనిని వాడవలయును.

ఫాస్పరస్ 6 (Phos. 6):— ఎగరొప్పుతో గూడిన పచ్చని లేక తెల్లని తీగలవంటి కళ్లె, దగ్గువున్న దీనిని వాడవలయును

మెలిలోటస్ 3, 6 (Melilotus 3,6):— జ్వరముతో తలనొప్పి ప్రధానలక్షణముగానున్న దీనిని వాడవలయును.

N. B:— జ్వరమున్నంతసేపును మోతాదులను రోజుకు 4 మొదలు 6 వరకు ఇచ్చుచుండిన చాలును.



## 5. దోషజ్వరము. (Typhus Fever),

ఇది సంగమ దోషమువల్ల జ్వరము బయలుదేరును. ఇది అతి తపనతోను, ఉద్రేకముగల నాడితోను, తలనొప్పితోను బయలుదేరి షుమారు 103° మొదలు 105° (డిగ్రీల) వరకు వేడిహెచ్చును. ఇది సాధారణముగ 14 రోజులుండును. ఇందులో సన్నిపాతము, ఎగరొప్పు, దగ్గు మొదలగు దుర్లక్షణములు కలుగవచ్చును. సామాన్యజ్వరమునందు N. B. లో వ్రాసిన పద్ధతిగా శరీరమును తడిగుడ్డతో గంట గంటకు తుడుచుచుండిన, జ్వరమును యుద్రేకముగ రానీయకుండుటయేగాక సులువుగ 14 రోజులు గడచి, రోగికి నెమ్మదించును.

బాప్టీషియ 1 (Bapt. 1):— జ్వరముకు ప్రారంభమున దీనిని వాడవలయును.

బ్రయోనియ 12 (Bry. 12):— నాడి గట్టిగాను తొందరగాను, నడచుచు దగ్గుచున్నప్పుడు రొమ్ములయందు నొప్పి, పొడిదగ్గు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు బుస్సుమను ధ్వనిగా ఇతరులకు వినపడుచుండుట, తలనొప్పి, సంధి, విరేచన బద్ధము, శరీర నొప్పులున్న దీనిని వాడవలయును.

రుహాస్‌టాక్సు 30 (Rhus Tox 30):— చలి, తలనొప్పి, మోకాలు మోచేతులు, నడుము నొప్పి, ఎక్కువదాహము, ముంజేతులు అరకాళ్లు చల్లదనము, కొద్ది కడుపునొప్పితో

విరేచనములు, వాంతి, రాత్రియందెక్కువ బాధతోనున్న దీనిని వాడవలయును.

అర్సెనిక్ 30 (Ars. 30):— నాలుకమీద చెమ్మలేక యుండి అతిదాహము, ఒడలుమంటలు, అవిశ్రాంతి, సంధి యున్న దీనిని వాడవలయును.

ఫాస్ఫరస్ 30 (Phos. 30):— ఎగరొప్పు, దగ్గుతో తెల్లని తీగెలవంటి కళ్లెయున్న రోజుకు 4 మో॥ వాడవలెను.

N. B:- గుణము హెచ్చుగానుండు సమయమందు ప్రతికొద్దికాలమునకును అనగా 15, 20, 30 నిమిషములకొక డోసు నీయవలయును. ఉద్రేకము తగ్గిన తరువాత యథాప్రకారముగ రోజుకు 4 మొదలు 6 సార్లవరకు మోతాదులు లేక డోసుల నీయవలయును. కొంచెము తొందరగా గుణము కనుపడవలయునన్న 12 మొదలు 15 మాత్రలవరకు ఒక ఔన్సు వేడినీళ్లలో నీమాత్రలు వేసి కరిగిన తరువాత తడవ కొక చంచా మోతాదు చొప్పున ఔషధమును కుదిపి వాడవలసినది.

6. సన్నిపాత జ్వరము. (Typhoid Fever).

సన్నిపాత జ్వరము షుమారు 45 సం॥ ప్రాయములోపు వారలకు వచ్చును. దోషజ్వరము (Typhus Fever) ఏప్రాయ



మునందైనను రావచ్చును. ఇదియొక అంటువ్యాధి యనియు, నుమ్మియందును, మలమూత్రములయందును క్రిములుపుట్టి ఆహారమునుండిగాని, త్రాగునీటినుండిగాని శరీరము లోనికి ప్రవేశించి 10, 15 రోజులకు జ్వరమును దానికి సంబంధించు గుణములును బయలుదేరును. ఇది 21 దినములుండు జ్వరము. దీనిలో రక్తవిరేచనములు, ఎగరొప్పు, సంధి, రక్త పిత్తము, అతిసారము, మూత్రబంధము మొదలగు గుణములు బయలు దేరును. ఇదియొక భయంకర వ్యాధియని చెప్పుదురు. కాని విషప్రయోగములచే (Injuctions) నిది భయంకర రూపమును దాల్చుచున్నది గాని దీనివలన భయపడవలసినంత అవసర మేమియు గనుపడదు. కాన హోమియోపతిమందులను ఉపయోగించుచుండిన, త్వరలో వ్యాధి తగ్గి రోగికి నీరసమెక్కువగాకుండ కాపాడును.

టైఫాయిడినం 200 (Typhoidinum 200):— ఇది జ్వరములో మొదటినుండియు రోజుకు నొక మాత్ర యిచ్చుచుండిన 21 రోజులుండక 15, 16 రోజులలో నెమ్మదించును. రోగియొద్దకు వెళ్లువారు రోజుకు వక మోతాదు పుచ్చుకొనవలసినది.

బాప్టీషియా 1, 3 (Baptisia 1, 3):— దీనిని గూడ మొదటినుండియు రోజుకు 4 మో॥ వాడుచుండిన వ్యాధిని

పరిమితి దినములకు ముందుగనే నివారణజేయును. రాత్రులందు చలి, యుష్ణముతోవచ్చి చీకాకు, పడక కుదరకయుండుట, రక్తపిత్తము, ఒడలు నొప్పులు,మనోవైకల్యము,పరాకు, దుస్స్వప్నములు, చెమట, విరేచనములు, నెత్తురుబాక పసుచు వాసనయున్న దీనిని వాడవలయును. ఇది మొదటివారము నందు మాత్రమే చాల నుపయోగముగనుండును. రెండవ వారమునగాని, తరువాతగాని పైలక్షణములు కనుబడినచో అర్నిక 30 (Arnica 30) ను రో॥ 4 మో॥ వాడవలసినది.

అర్సెనిక్ 6 (Arsenic 6) :—నాడి తీవ్రముగా కొట్టుకొనుట, స్థిరముగా నొకప్రక్క పరుండలేకుండి అవిశ్రాంతి, ఆవేదనయుండుట, నాలుకయెరుపుగానుండుట, దాహమెక్కువగానుండి వుండివుండి కొద్దికొద్దినీరును త్రాగుట, అతిసారము ప్రక్కబట్టలు పీకికొనుట మొదలగు గుణములుండిన రోజుకు 6 మో॥ నీయవలసినది. మరియు 3వ వారము దాటిన తరువాత గుణములెవ్వియును కనుబడక జ్వరము తగ్గని సమయమందు అర్సెనిక్ 6 (Arsenic 6) ను, పైరోజిన్ 6, 30 (Pyrogen 6, 30) లను వాడవలయును.

బెల్లడోన 30 (Belladona 30):—కొంచెము సేపు జ్వరము, కొంచెముసేపు చలి మారుచు, ముఖము యెరుపుగాను వేడిగానుండి చిత్తభ్రమ, భయమును కలిగించు కలలు,



దగ్గరవున్నవారిని కరవబోవుట, తలనొప్పి, లేవ ప్రయత్నించుట, గుడ్లు ఓంచుట, శరీరము బహుయుష్ణముగానుండి దాహమెక్కువగుట, మూత్రము కొద్దిగానగుట, నాడి తీవ్రముగా కొట్టుకొనుట, తల అటు నిటు తిరుగుట, కళ్లు సగము మూతబడియుండుట, శరీరము పైభాగము వేడిగానుండి క్రింది భాగము సమశీతోష్ణముగా నుండుట మొదలగు గుణములుండిన నిది వెంటనే తగ్గించును. రోజుకు 6 మో॥ వాడవలసినది.

స్ట్రామోనియం 30 (Stram. 30):—(అతితీవ్ర సంధి) పారిపోవ ప్రయత్నించుట, నోటికి వచ్చినట్లుగా వెఱ్ఱివాగుడు లేక చూపరులకు భయము కలిగించునటుల పిశాచములతో మాటలాడుట, నవ్వుట, పాడుట, కరచుట, మత్తుగా పరుండుట, నీరు యెక్కువగా త్రాగుట, నల్లని విరేచనము మొదలగు దుర్గుణములుండిన రోజుకు 4 మో॥ వాడవలసినది.

హైసామస్ 3, 6 (Hyos. 3, 6):— ముఖము వేడిగనుండుట, శరీరమచ్చటచ్చట కండరములదరుట, సంధి బెల్లడోనాలో వ్రాసినదానికన్న తక్కువ కనుబడియున్న రోజుకు 6 మో॥ వాడవలసినది.

ఓపియం 200,1000 (Opium 200,1000):—ముఖము ఎరుపుగానుండి సగము కన్నులు తెరచియుండుట లేక పెద్దవి చేసి నిలకడగా చూచుట, పిశాచములను కనుచు వానితో

మాటలాడుట, తల నిటునటు త్రిప్పుచుండుట, చేతులవ్రేళ్ళను త్రిప్పుచుండుట, కండరములు అచ్చటచ్చట శరీరమున అదరుట, నిద్ర లేకయుండుట, చప్పుడు చేసినను, పిలచినను లేక గిల్లినను స్పృహలేకయుండుట; ఈవిధమగు గుణము లుండిన, 2 గం॥ కొక మోతాదు ఒక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటి యందు ఒక మందు చుక్కనుగాని లేక రెండు మాత్రలను గాని మోతాదుగా నీయవలయును. మందు మ్రింగని సమయమందు నీ అరఖుచుక్క నొకదానిని నోటిలో వేయవలెను.

N·B:- ఈ మందు కలరా, న్యుమోనియ, సన్నిపాత, సూతికాజ్వరముల అంత్యదశయందు పెద్దసత్తువగలమందును వాడిన, సుగుణమును బడయగలరు.

బ్రయోనియ 6, 12 (Bry 6, 12):— నాలుక గరుకుగానుండి నోరు వుప్పగను, తలనొప్పి, గుండెలయందు నొప్పి, చాల అలసటజెందినట్లు కనుబడుట, ఉన్న దినిని రోజుకు 4 మో॥ల నిచ్చునది. సన్నిపాతజ్వరమునందు విరేచనములగుచున్నప్పుడు నీమందు నీయరాదు. ఈమందు ప్రారంభమునందుగాని లేక గుణము లెవ్వియు లేనప్పుడుగాని యిచ్చుట చాల మంచిది, కార్బోవెజిటబిలిస్ 3, 30 (Carbo veg, 3, 30): మోకాలి క్రిందిభాగము చల్లగనుండుట, నాడి నీరసించియుండుట, విరేచనము లెక్కువగానగుట,సిలువుగ్రుడ్లతో ముఖము



శవాకారముగా కనబడుచు ప్రాణము పోవుచున్నట్లుగా కనబడుట మొదలగు లక్షణములుండిన గంటకొక మోతాదు నీయవలయును.

ఎపిస్ 3 (Apis 3):— కండరములు అచ్చటచ్చట శరీరమున అదరుట; జ్వరమెక్కువగానుండి శరీరమెండినట్లుగా అచ్చటచ్చట పగులుట, దాహముండియు నాలుక కొద్దిలావుగానుండినట్లు కనుబడుచుండిన [అనుకొనుచుండిన] రోజుకు 4 మో॥ వాడవలసినది.

హెమామెలిస్ 1, 3 (Hemamelis 1, 3):— విరేచనములందు రక్తము నల్లగాగాని లేక రక్తపిత్తమునందు నల్లగాగాని స్రవించుచుండిన గంటకొక మోతాదు నీయవలయును. ముక్కు వెంట రక్తము స్రవించునపుడు నీఔషధ ద్రావకముచే దూదినితడిపి ముక్కుయందు రెండు చుక్కలు పిండి వాసన చూపించుచుండవలసినది.

టర్బెంథిన 6 (Terbenthina 6):— నీరుడు బంధించుట, గర్భములో మంట, జిగట నెత్తురు విరేచనములు, ముక్కువెంట రక్తము మొదలగు గుణములుండిన రోజుకు 4 మో॥ నిచ్చుచు, గుడ్డను కర్పూరతైలమందు ముంచి పొట్టమీద వేయవలయును.

ఆసిడ్‌ఫాసు 6, 30 (Acid Phos 6, 30) :— సంధి గ్రహాణిమొదలగు గుణములు నెమ్మదించిన తరువాత బలము చేయుటకు దీనిని లేహ్యమువలె వాడవచ్చును. దీనివల్ల సుగుణము కనబడనిచో చైనా 6, 30 (China 6, 30) ను వాడవలయును.

లైకపోడియం 30 (Lycopodium 30):— కడుపుబ్బరముగానుండి గుడబిడలాడుట, విరేచనబద్ధము, మైమఱచిపరుండుట మొదలగు గుణములుండిన దీనిని 4 మో॥ వాడవలయును.

సినా 200 (Cina 200):— అంత్రములయందు, ఏడికపాములున్నవని తోచిన రోజుకు 2 మో॥ నీయవలెను.

శాంటొనైను 1 (Santonine 1 X Trit.):— ఏడికపాములవల్ల వాంతులగుచుండిన 3,4 గ్రైనులభస్మము నీయవలయును.

నక్సమొశ్చాట 3,12 (Nux Moschata 3, 12):— మత్తుగా పరుండుట, కడుపునందు గుడుగుడులాడుట, ఇరికిరికి విరేచనములు, నాలుక పెదవి తడిలేకయుండినను దాహము లేకయుండుట, యున్న దీనిని వాడవలయును.

కాస్టికం 6 (Caust 6):— సంధియందు ఎక్కువ మూత్రవిసర్జనయున్న దీనిని వాడవలయును.



వెరాట్రుంఆల్బు 6,30 (Verat. Alb 6,30):— వాంతి వచ్చినట్లుగానుండుట, లేక వాంతియగుట, తెల్లని విరేచనములు, కడుపునొప్పి, తల ముం జేతులు అరకాళ్లు చల్లదనము యుండిన దీనిని వాడవలెను.

ఆసిడ్‌ముర్ 6 (Acid Mur 6):— చలి, దాహము, సంధి, కడుపుయందు నులినొప్పి, మలమూత్రములు పక్కయందు మైమరచియగుచుండిన రోజుకు 6 మో॥ వాడవలెను.

N. B:— ఒక పర్యాయము ఆహారము అధికముగా నిచ్చుటకంటె, యెక్కువమారులు అల్పముగనిచ్చుటమంచిది.

## 7 సూతికాజ్వరము. (Puerperal Fever).

ప్రసవవేదనచే బాధనొందుచున్నప్పుడు మంత్రసానులు, వైద్యులు అపరిశుభ్రమగు హస్తశస్త్రములతో ఉపాయముగా శిశువును తీయునపుడు క్రిములులోనికి ప్రవేశించి జ్వరమును కలిగించును. దీనివలనగాని, మరియే యితర కారణములవలనగాని, పూతము ప్రకోపించి యోనిస్థానమునుండి ప్రసవానంతరం సాధారణముగా 2, 3 వారములవరకు వెడలుమైల, అకాత్తుగా ఆగిపోవును. అందుచేత జ్వరము, అతితీవ్రమగు నాడి, తలనొప్పి, ఒడలునొప్పులు, పొత్తికడుపుశూల, కంపము, దప్పి, భారము, దుఃఖము, క్షోభ, అతిచల్లదనము మొదలగు గుణములు కలుగును. కొందరకు సదరు మైలనెలల

పర్యంతరమగు చుండును. అటు లుండరాదు. తగు చికిత్స నొందవలెను.

అకోనైటు 6 (Aconite 6) :— ఎక్కువ జ్వరము, తీవ్రమగు నాడి, చలి, మైకము, కడుపుబ్బరము, యోనియందు నొప్పి, యెక్కువ దప్పియున్న రోజుకు 4 మో॥ వాడవలెను. ఎక్కువ మైకమే ప్రధానముగనున్న ½ గం॥ కొక మోతాదు నీయవలెను.

బెల్లడోన 30 (Belladona 30) :— ఎక్కువ కడుపు నొప్పి, పడకకుదరకయుండుట, చనుబాలు అకాత్తుగా నెండిపోవుట, తలనొప్పి, కన్నులు ముఖము పీకుకొనిపోయియుండుట, ఈ లక్షణములుండిన దీనిని వాడవలయును

కోలసైంథిస్ 6 (Colocynthis 6):— కడుపెక్కువగా నుబ్బరించి నొప్పియున్న దీనిని గంట కొక మో॥ వేయవలెను.

కాలిసియానాటస్ 30 (Kali Cyan. 30):— కడుపు నొప్పి కలిగినప్పుడేడ్చుటయున్న దీనిని వాడవలయును. (ఈ నొప్పి సాధారణముగ నుదయమున యెక్కువగానుండును)

మెర్క్యూరియస్ కరోసివస్ 30 (Merc. Cor 30) :— కడుపునందు చేయి వేయనీయకయుండి నొప్పిగానుండినను, ఎక్కువదాహముతో విరేచనమునందు బంక కండలు నెత్తురెక్కువయుండినను దీనిని వాడవలయును.



లాచెసిస్ 6 (Lachesis 6):— నిద్రలేచినప్పుడెల్లను నొప్పి తెరలుగా వచ్చుచున్న దీనిని వాడవలయును.

రుహస్టాక్సు 6 (Rhus Tox):— యోనిలోపలి భాగమునందు వాపు, మోకాలు, మోచేయి క్రిందుభాగములందు నొప్పి, మైల యెక్కువగా నగుటవలన స్మృతి తప్పి పరుండుట మొదలగు లక్షణములుండిన రోజుకు 6 మో॥ నీయవలెను.

కాలిఫాసు 3, 12 (Kali Phos 3, 12):— పిచ్చి ప్రధాన లక్షణముగా నున్న దీనిని వాడవలయును. దీని వలన సుగుణము కనబడనిచో స్ట్రామోనియం 30 ను (Stramonium 30) ఓపియం 1000 ను (Opium 1000) ఎగేరికస్ 30 ను (Agaricus 30) 2 గం॥ కొక మోతాదు వాడవలయును.

పైరోజెన్ 6 (Pyrogen 6):— యోనియందలి స్రావము తెలుపు, ఎరుపు మిశ్రమముగానున్న రోజుకు 6 మో॥ నీయవలెను.

అర్సినిక్ 30 (Arsenic 30) :— ఎక్కువగా జ్వరము, దాహము, అవిశ్రాంతి, ఆవేదనయున్న గంటకొక మోతాదు నీయవలయును. కొందరు లాచెసెస్ 6 ను (Lachesis 6) హైసామస్ 6ను (Hyos. 6) ఒకదానివెంట నొకదానిని ½ గం॥ కొకమారుగా నిచ్చుచుందురు.

బ్రయోనియ 12 (Bryonia 12) పల్సటిల్లా 30 (Pulsatilla 30) హెమామెలిస్ 3 (Hemamelis 3) చైనా 6 (China 6) ఎపిస్ 30 (Apis 30) లనుగూడ పరిస్థితులనుబట్టి వాడుటమంచిది.

N. B:— రోగికి మైకము వచ్చినప్పుడు అమిల్ నైట్రేటు ను (Amyl Nitrate) గాని క్యాంఫర్ ను (Camphor) గాని వాసన చూపించుచు పరిశుభ్రమగు పడక గుడ్డలను ధరించు వస్త్రములను యేర్పాటుచేయుట మంచిది.

హైసామస్ 6 (Hyos. 6):— వెఱ్ఱిగా నవ్వుచుండిన గంటకొక మోతాదు నీయవలెను.

స్ట్రామోనియం 3, 6 (Stramonium 3, 6) :—ఒంటరిగా నుండుటకుగాని, చీకటి గది యందుండుటకుగాని యిష్టపడుచు, మాటలాడుట కయిష్టముగానున్న దీనిని వాడవలెను. (సంధియున్నను నిది బాగుగపని జేయును)

కెనబస్ఇండిక 6 (Can. Ind. 6):— ఏడ్చుట, ఆత్మహత్యకు ప్రయత్నించుటయున్న దీనిని గంటకొక మోతాదు నీయవలెను. దీనివలన సుగుణము కనబడనిచో సిమిసిఫ్యూగ 6 ను (Cimicifuga 6) వాడవలయును.

ఆరంమెటాలికం 6 (Aur. Met. 6) ప్లాటినా 6 (Platina 6) పల్సటిల్లా 6, 30 (Puls 6,30) యాగ్నస్



కాస్టస్ 3. 6 (Agnus castus. 3, 6) లను పరిస్థితులను బట్టి వాడవలెను.

## 8. మశూచికము. (Small-pox)

ఇదియొక అంటువ్యాధి క్రిములు శరీరమునందు ప్రవేశించిన 15 రోజుల తరువాత అస్వస్థత కలుగును. ఈవ్యాధికి పరిమితి దినములు 10–12వరకైయున్నవి ఎక్కువగా జ్వరము $103^\circ$–$107^\circ$ వరకుండి, ఒడలు నొప్పులు ముఖ్యముగా నడుము నొప్పి, వికారముతో వాంతివచ్చినట్లుండుట లేక వాంతియగుట, కొద్దిదగ్గు, జలుబుతోను ప్రారంభమై 3,4 వ, నాటి నుండియు జ్వరము తగ్గి, ఎఱ్ఱని సూక్ష్మములగు పొక్కులు బయలు వెడలును. క్రమముగ నీసూక్ష్మములగు పొక్కులు దినదినాభివృద్ధి నొందుచు చీము, నీరు నిండి మరల జ్వరమున కారంభమయి ఎగరొప్పు, సంధి, అతిసారము మొదలగు గుణములతో బయలుదేరవచ్చును. ఇదియొక అమ్మవారనియు, ఔషధము వేసినచో ఆచల్లనితల్లికి కోపకువచ్చి చంపుననియు మన హిందువుల వుద్దేశ్యము. ఆలోచించి చూడగా అన్నిరోగములును అమ్మవారనియే చెప్పవచ్చును. కలరా అమ్మవారని చెప్పుచున్న మనవారు ఆవ్యాధికేల ఔషధసేవ చేయుచున్నారు? మశూచికమునకేల చేయరాదు? ఇందుకు కారణము లేకబోలేదు. విషసంబంధమగు నౌషధములు రోగమును శరీరమునందణచును గాని శరీరమునుండి నివృత్తిచేయ

సేరవు. ఈమశూచికమును శరీరమునందు విషప్రయోగము లచే అణచినచో రోగి తప్పక మరణించును. మశూచికమునకు మన ఆయుర్వేద శాస్త్రమునందు ఔషధములు లేకపోలేదుగాని సామాన్యులగు జనులకు తెలియకపోవుటచేతనే ఔషధసేవను నిషేధించియున్నారని చెప్పవచ్చును. కాన యీమందుల నుపయోగించి నీ భయంకరవ్యాధినుండి విముక్తులగుటకు ఆంధ్రులను కోరుచున్నాను.

వాక్సినినం 30 (Vaccininum 30) వెరియోలినం 30 (Variolinum 30) మెలాండ్రినం 30 (Melandrinum 30) యాంటిమోనియంటార్టారికం 6,12 (Ant. Tar· 6,12)ను ప్రధానౌషధములుగ ఆరోగ్యరక్షణకును రోగ నివారణకును రోజుకు 2, 3 మో॥ వాడవలయును.

తుయ్యాజ 30 (Thuja 30):—టీకాలు వేసిన తరువాత పొక్కులు కనుబడిన దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను. దీని వలన నుపయోగము లేనిచో సైలీషియ 6, 30 (Silicea 6,30) మెజీరియం 30 (Mezerium 30) కాలిమ్యుర్ 30 (Kalimur 30) ను గుణగతములనుబట్టి వాడవలెను.

యాంటిమోనియంటార్టారికం. దీనినే టార్టార్ ఎమిటిల్ 6, 12 అందురు (Ant Tar or Tar emit 6, 12):- జ్వరము, గొంతుయందు నొప్పి, వాంతి వచ్చినట్లుండుట గాని లేత వికారముతో వాంతి కలిగిన దీనిని వాడవలయును.



వెరాట్రం విరైడు 3 (Verat. Vir 3):— ఎక్కువ జ్వరము, నడుమునొప్పి, ఉద్రేకమగు నాడి, నీళ్ళ విరేచనములున్న గంటకొక మోతాదు నీయవలెను.

మెర్క్యూరియస్ సాలబిలిస్ 30 (Merc. Sol 30):— జ్వరము, పొక్కులయందుచీము, నోటిపూత, నెత్తురు తక్కువగానుండి బంకయెక్కువతో విరేచనములు కలిగిన రోజుకు 6 మో॥ నీయవలెను.

రుహస్టాక్సు 30 (Rhus Tox 30):— పొక్కులు బాగుగ తేలి జ్వరము తగ్గకయుండి, సంధియున్నను నిది పని చేయును. నీళ్ళ విరేచనములగు చున్న అర్శినిక్ 6 ను (Arsenic 6) ను వాడవలయును.

ఎపిస్ 30 (Apis 30):—ముఖము మీఁది పొక్కుల చుట్టుప్రక్కల చర్మము వాచియుండి రాత్రులందు దురద ఎక్కువగానున్న దీనిని రోజుకు 6 మో॥ వాడవలెను.

క్రొటాలస్ 6 (Crotalus 6):— పొక్కులు నల్లగానున్న రోజుకు 6 మోతాదులు వాడవలయును.

రూబినీస్ స్పిరిట్సు ఆఫ్ క్యాంఫర్ను (Rubini's Spts. of Camphor) జెల్సీమియం 3,6 (Gelsemium 3,6) జింకం 6 (Zincum 6) ను పొక్కులు అణగిపోవు చున్న

ప్పుడు ఒకటి తరువాత ఒకటిని రెండురోజులలో సుగుణము లేనిచో మార్చవలయును.

ఆహారము బహు తేలికగను స్వల్పముగను నిచ్చుచు మాంసము, చేప మొదలగువానిని పూర్తిగా మానివేయవలెను.

N. B:— స్ఫోటకమునకు 14, 15 సం॥ నుండియు విశేషానుభవముగల మహారాజశ్రీ ఖండ్రిగ సాంబయ్య (హోమ్యో) యల్. యమ్. యస్. తెనాలి, గుంటూరుజిల్లా వారిచే కనిపెట్టబడిన "స్ఫోటక నివారణి" యను మాత్రల నుపయోగించిన ఆరోగ్యరక్షణగానుండునని నా యనుభవములో నొక్కిచెప్పగలను. గాన ఆంధ్రజనులెల్లరు నీమందుల నుపయోగించి యీ భయంకరవ్యాధినుండి విముక్తులగుదురని దృఢమైన నమ్మకముతో చెప్పుట తటస్థించినది.

వెల 100 మాత్రల గల సీసా 1కి రు. 0-9-0.
12 సీసాలు ... ... 6-0-0.

12 సీసాలు కొనువారలకు 1 సీసాచార్జీ లేకయే యిచ్చుదురు. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

### 9. తడపర లేక చిన్నమ్మవారు. (Chicken-pox.)

ఇదియుకూడ నొక అమ్మవారనియే ఔషధసేవను నిషేధించుచున్నారు. ఇదియొక అంటువ్యాధి. ఇది చంటిబిడ్డల



కును, 16,18 సం॥ లోపు ప్రాయమువారలకును తరుచుగ వచ్చుచుండును. ఇది మశూచికమందలి జ్వరముకన్న తక్కువగానుండి, పొక్కులు సూక్ష్మమైనవిగానుండును.

అకోనైటు 3, 6 (Acon. 3,6):— జ్వరచిహ్నములు కనుబడగనే అనగా ఒడలునొప్పులు, ఉష్ణము, కొద్దిగ దగ్గుతో జలుబు, నేత్రములు ఎఱ్ఱబారి నీరు స్రవించుచు వెల్తురును చూచుట కయిష్టముగానున్న దీనిని వాడవలయును.

రుహస్‌టాక్సు 30 (Rhus Tox 30):-పొక్కులుచూపిన తరువాత జ్వరము తగ్గకయున్న దీనిని వాడవలయును. దీనివలన సుగుణము కనబడనిచో యాంటిమోనిటాక్‌టారికం 6,12 ను (Antimonium Tartaricum 6, 12) రోజుకు 6 మో॥ వాడవలయును.

పల్సటిల్లా 30 (Pulsatilla 30):— దాహాము లేక నోరు ఎండినట్లుగానుండి, దగ్గు, విరేచనములు, కడుపులో గుడగుడలాడుట, ముక్కువెంట చిక్కని, పచ్చని స్రావము, జ్వరము, నేత్రములు ఎఱ్ఱగానుండి నీరుకారుచున్న దీనిని రోజుకు 6 మో॥ నీయవలెను.

జెల్సీమియం 3,6 (Gelsemium 3,6) :— ప్రతిజబ్బునందును రోగికిశ్చింత భావముగానుండియున్న రోగముపేరు తెలిసికొనకయే దీనిని వాడవచ్చును.

N. B :—ఒక ఇంటియందు చిన్నమ్మనారున్న, తదితరులకు రాకుండ ఆరోగ్యరక్షణార్థమై పల్సటిల్లా 30 (Puls. 30) రోజుకు 3 మో॥ వాడుచుండవలయును.

## 10. విశూచి. (Cholera).

ఇది సాధారణముగా జనులు చెరువుల, నూతుల, కాలువలవద్ద వస్త్రములను వుతుకుటచే, మురికినీరు తిరిగి పరిశుభ్రమైన నీటితో చేరి మలినవంతముగ చేయుచుండును. ఇట్టి మలినయుక్తమైన నీటిని పానము చేయుటచేతను, అంగడుల యందు చీమ, దోమ, ఈగ ముసురుకొనియున్న ఆహారపదార్థములను సేవించుటచేతను, మితాహారమును భుజింపకపోవుటచేతను, అజీర్ణరోగము జనించి సూదులతో పొడచునట్లు వేదన, శరీరనొప్పులు, కొంగరలు, వణుకు, భారము, కడుపునొప్పి, ఉబ్బరము, మంట, నిద్రపట్టకయుండుట, కాలుచేతులు చల్లబడుట, వికారము, వాంతులు, అతిసారము, జ్వరము, నాడి నీరసించుట మొదలగు లక్షణములతో కూడి విశూచి జనించును. ఇది యొక అంటువ్యాధి కాన రోగి వద్దకు వెళ్ళి వచ్చినప్పుడు వస్త్రముల నూడదీసి, శరీరమును శుభ్రపరచుకొనవలెను. తల్లికి విశూచి తగిలినప్పుడు బిడ్డను చనుబాలు త్రాగనీయరాదు. మనము భుజించు ఆహారముల కన్నిటికిని



మూతలుంచి జాగ్రత్తపరుచుచుండవలెను. ఈ వ్యాధి సంభవించినయెడల 1 గంట మొదలు 3, 4 దినములవరకు గూడ నుండవచ్చును.

N. B. కలరా రోగియొద్దకు వెళ్లునప్పుడును, కలరా వ్యాపించియున్నప్పుడును దేహ సంరక్షణార్థమై క్యాంఫర్ (Camphor) ఒక మోతాదు ఉదయమునను, మధ్యాహ్నమొక మోతాదు కుప్రంమెటాలికం 30 (Cuprum Met 30) ను, సాయంకాలమొక మోతాదు సల్ఫర్ 30 (Sulphur 30) ను యుపయోగించవలెను.

రూబినీస్ స్పిరిట్సు ఆఫ్ క్యాంఫర్ (Rb. spts. of Camphor) :— ఇది విశూచికి ప్రధానౌషధమై యున్నది. తల తిరుగుట, కొంతసేపు వేడి, కొంతసేపు చల్లదనము, కాలుచేతులు ముడుచుకొనిపోవుట, తిమ్మిరులు, అపానవాయువులు, విరేచనములు తెల్లగానుండి పుసన, ఒక్కొక్కప్పుడు వాంతి కలుగుచున్న, కొద్ది పంచదారయందు దీనిని 3-5 చుక్కలవరకు వేసి 10 నిమిషములకొకమారిచ్చుచుండవలెను లేక రెండేసి మాత్రలనైనను చప్పరించి మ్రింగుచుండవలెను. దీని వలన సుగుణముగానున్నకొలదిని మోతాదులను తగ్గించవలెను. ఏమాత్రమనుమానమున్నను వెంటనే నీమాత్రలు వేసికొనినచో తప్పక కలరా ఆగిపోవును.

ఐరిస్ వర్సు 3 (Iris vers. 3):— విరేచనము లెక్కువగను పెద్దవిగను నగుచు నొక్కొక్కప్పుడు ఆకుపచ్చగా నగుట, ఆకుపచ్చని వాంతులు, విరేచనానంతరము ఆసనమునందు మంటయున్న ½ గంటకొక మోతాదు నీయవలెను.

రిసినస్ 3 (Recinus 3):— తెల్లని విరేచనములు, వాంతులు, కాలు సేతులు కొంగరలు, విచారముచే మనస్సు క్రుంగినట్లుగా నుండుట, హీనస్వరముగా మాటలాడుట, చల్లదనముయున్న ½ గంటకొక మోతాదునీయవలెను.

వెరాట్రం ఆల్బ 6, 12 (Verat. Alb 6, 12):— చల్లదనము, చెమట, పచ్చని నీళ్ళవంటి విరేచనములు, కాలు సేతులు కొంగరలు, దగ్గు, దాహమెక్కువగానుండి చల్లని నీటిని విస్తారముగ త్రాగుట, సొమ్మసిలబోయి పరుండుట, వాంతులెక్కువగానుండి విరేచనములు తక్కువగుట, కడుపు నొప్పియున్న 15 నిమిషములకొక మోతాదు నీయవలెను.

కుప్రం మెటాలికం 30 (Cup. Met. 30):— కొద్ది కడుపునొప్పి పొర్లుపొర్లుగా వచ్చుట, విరేచనములకన్న వాంతులు తక్కువగా నగుట, కాలుసేతులు కొంగరలుయున్న 15 నిమిషముల కొక మోతాదు నీయవలెను.

యాంటిమోనియం క్రూడం 3, 6 (Ant. crud 3,6):- వాంతి వచ్చునట్లుండుట, త్రేపులు, ఆకలి మందగింపుయున్న గంటకొక మోతాదు నీయవలెను.



ఆర్సెనిక్ ఆల్బ 6 (Ars. Alb 6):— దాహమెక్కువగానుండి కొద్దికొద్ది నీరును త్రాగుట, వాంతులు, విరేచనములు, ఒడలుచల్లదనము, తెరలుతెరలుగా పొత్తికడుపునందునొప్పి, అవిశ్రాంతి ఆవేదన, తను జీవించననే భయము, మూత్రబంధము, శరీరమంతయు మంటగానుండినను వస్త్రముచే కప్పుకొనుచుండిన ½ గంటకొక మోతాదునీయవలెను అవిశ్రాంతి, ఆవేదనభయము ప్రాముఖ్యముగానుండి దీనివల్ల గుణము లేనిచో అకోనైటు 3,6ను (Aconite 3, 6) వాడవలయును.

కాల్చికం 30 (Colchicum 30):— విశూచి తగిలిన వెంటనే స్మృతిలేకయుండుట, వాంతులు, తెల్లనివిరేచనములు, దాహము కడుపుయందుమంట లేక చల్లదనము నొప్పికలిగిన దీనిని ½ గంటకొక మోతాదు నీయవలెను.

ఆసిడ్ హైడ్రోకియానిక్ 30 (Acid Hydro. 30):- నాడిసరిసరించియుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు చాలతక్కువగానుండి యెగయూపిరి వినబడునట్లుగావిడుచుట, చల్లని చెమట, మత్తుగాపరుండి మలమూత్రముల విసర్జన, లేక, బంధన, వ్రేళ్ళునల్లగానుండి గుప్పెడపట్టియుండుట, తనలో తను గొణుగుకొనుట, కనుపాపవిస్తరింపబడి నిలుకడగా చూచుట మొదలగు గుణములకు క్యాంఫర్ (Camphor) ప్రయోజనము లేనిచో నీయుందును 10 నిమిషములకొక మోతాదు నీయవలెను.

సెకేల్‌కర్ 6,30 (Secale. Cor 6,30):— ఇది కొంగరులమీదగూడ పనిచేయును కుప్రంమెటాలికం (Cup. Met.) వల్ల ప్రయోజనము లేనిచో దీనిని వాడవలయును. శరీరము చలువకమ్మి వంగి లేక ముడుచుకొని కాలుసేతులు కొంగరలు, ముఖమునల్లగా కనుబడుట, బంక, విరేచనము నందుగాని, వాంతియందుగాని ఏడికపాములతోకూడి పడుచు వాంతియైన తక్షణమే శ్రమనివారణమైనట్లుగా కనుబడుట, పెద్దపెద్దవిరేచనములు, ఎక్కువగా దాహము, కడుపునందు మంట, నొప్పి, అరగాలు ముంజేతులు చల్లగనుండుట, మూత్రబంధము మొదలగు గుణములుండిన ½ గంటకొక మోతాదు వాడవలసినది.

జట్రోఫ 30 Jatropha 30:— చల్లదనము, కాలుసేతులు కొంగరలు, జిగటవిరేచనములు లేక గొట్టముతో చిమ్మినట్లుగా నీళ్ళవిరేచనములు లేక వాంతియైనవెంటనే విరేచనము, చల్లనిచమట, కడుపునందు గుడబిడయున్న 10 నిమిషములకొక మోతాదు నీయవలెను.

ఫాస్‌పరస్ 6,30 (Phospharus 6, 30):— అపాన వాయువులతో విరేచనములు, కడుపులో గుడగుడలాడుట, దాహముత్రాగినవెంటనే వాంతికలుగుచున్న ½ గంటకొక మోతాదు నీయనలెను.



ఇపికాకు 3, 30 (Ipecacuanha 3,30):— కొద్దిరక్తముతో వాంతి, రక్తయుక్తమైన విరేచనములు కలుగుచున్న 10 నిమిషములకొక మోతాదు నీయవలెను. విరేచనమునందు నెత్తురు తగ్గకయున్న మెర్క్యూరియస్ కరోసివస్ 30ను (Mer. cor 30) వాడవలయును.

క్రోటన్ 6, 30 (Croton 6, 30):— పసుపుపచ్చగను నీలివర్ణముగను వెంటవెంటనే గొట్టముతో చిమ్మినట్లుగా విరేచనములగుచు దాహము త్రాగినవెంటనే వాంతియగుచున్న ½ గంటకొక మోతాదు నీయవలెను.

కాలిఫాసు 3,30 (Kali Phos 3, 30):— తెల్లని విరేచనము కుళ్ళినట్లుగా వాసనయున్న దీనిని వాడవలయును.

కాలిమర్ 6,30 (Kali Mur 6,30):— వాంతి, విరేచనము రక్తముతోగాని, బంకతోగానికూడి పడుచున్న దీనిని వాడవలెను.

కాన్థరిస్ 6 (Cantharis 6):— మూత్రబంధనమె ప్రధానలక్షణముగనున్న దీనిని వాడవలయును. దీనివలన సుగుణమునుబడకున్నచో టర్‌బెంథినా 3 (Terbenthina 3) వాడవలయును.

ఓపియం 3,30 (Opium 3,30):— కడుపుబ్బరము, మూత్రబంధన, ఎగరొప్పుయుండిన దీనిని వాడవలయును.

చైనా 3,12 (China 3,12):— వ్యాధి నెమ్మదించిన తరువాత బలము చేయుటకు దీనిని రోజుకు 4మో॥ వాడవలెను.

సల్ఫర్ 30 (Sulpur 30):— పైన చెప్పబడిన లక్షణములకు ఆయా ఔషధములను వాడి సుగుణమును పొందనప్పుడు యీ ఔషధమును 15 నిమిషముల కొకతూరి నొక గంట వరకిచ్చి, నొక గంటసేపాగి పైన చెప్పబడిన లక్షణములనుబట్టి ఆయా ఔషధములనిచ్చిన మంచి సుగుణమును పొందగలరు.

కార్బో వెజిటబిలిస్ 6 (Carbo Veg. 6):— చేపలు మొదలగు మాంసపదార్థములు సేవించుటవలనగాని, సూర్యరశ్మిలోను, అగ్ని సమీపమును పనిచేయుకూలి, కంసల మొదలగు వారలకును, విశూచి తగిలి విరేచనము రక్తయుక్తముగాగాని లేక ఎఱుపు వర్ణముగాగాని యుండి, శరీరము చల్లగానున్న దీనిని 10 నిమిషముల కొక మోతాదీయవలెను.

ఈ వ్యాధియొక్క సుసాధ్యకమసాధ్య లక్షణములు:—

వాంతులు విరేచనములు తక్కువగను, శరీరము సమశీతోష్ణముగను, నాడి సరియగు స్థానమునను, ఉచ్ఛ్వాస నిశ్వాసములకు కష్టములేకను, కొంగరలునొప్పులు తక్కువగను, దాహము స్వల్పముగనుయున్న సులువుగా నీవ్యాధినివారణ యగునని తెలుసుకొనవలయును.



కలరా ప్రారంభదశయందే చల్లదనము, ఒడలు తెలియక మత్తు, నిద్ర లేకయుండుట, శరీరము అత్యుష్ణముగాగాని అతి శీతలముగాగానియుండుట, నాడి కలరాప్రారంభమునందే నీరసించుట, ఎగరొప్పు, నెత్తురు విరేచనములు లేక నెత్తురువాంతులు, మూత్రబంధన, సంధి, మింగుడు పడకయుండుట మొదలగు లక్షణములుండిన వ్యాధి కష్టతరమని తెలుసుకొనవలయును.

ఆహారము:— పైన వ్రాసిన లక్షణము లన్నియు శమించి మూత్రము అడ్డులేక సరిగా ప్రవర్తించునప్పుడు తేలిక ఆహారము నీయవలెను. పైలక్షణములు శమించని సమయమందు ఆహారమునిచ్చిన రోగియొక్క లక్షణములను బలపరుచుట కిచ్చుచున్నారని తెలుసికొనవలెను. దాహము కావలసిన వేడినీళ్ళు కాచి చల్లార్చి యియ్యవచ్చును. కొబ్బరికాయనీటిని 3-6 చంచాలవరకు గంటకొక మారియ్యవచ్చును. కొద్దిగా జలుబు చేసినట్లుగాయున్న హెలిబోరస్ 30 (Helleborus 30) ను 2, 3 మోతాదుల నీయవలెను. బార్లీనీళ్ళుగాని, చిట్టుకుకునీళ్లుగాని మధ్యమధ్య యిచ్చుచుండవలెను. వ్యాధినెమ్మదించిన తరువాత పైన వ్రాసిన ఆహారములనే బహుస్వల్పముగ నిచ్చుచుండవలెను.

## 11. అతిసారము. (Diarrhoea).

ఇది అజీర్ణమువల్లను, పైత్యాధిక్యమువల్లను, చేప మొదలగు అరుగని మాంసపదార్థములు సేవించుటవల్లను పుట్టి, విరేచనము పెద్దదిగను, నీళ్లగనునగుచు, నెత్తురుచీము కలియకయుండును.

కాంఫర్ (Camphor):— విరేచనములకు ప్రధానౌషధమైయున్నది. ఇది ఎట్టివిరేచనములనైనను వెంటనే తగ్గించును. విరేచనమైన వెంటనే రెండేసిమాత్రలను నోటిలో వేసి చప్పరించుకొనవలెను

ఛమోమిల్లా 12 (Chamomilla 12):— ఆకుపచ్చగా నీళ్ల విరేచనములు, తరుచునురుగు లేక బంక, లేక రక్తముకలియుచు వాసన, పైత్యాధిక్యముచే వాంతి, కడుపుబ్బరము శూల లేక ఆగిఆగివచ్చునొప్పి, చంటిబిడ్డలకు పండ్లురాబోవునప్పుడు విరేచనములతో కడుపుబ్బరము, పక్వమునకురాని ఫలాదులను గాని లేక బాగుగ నుడుకని కూరల నెక్కువగా తినుటవలన కలిగిన రోజుకు 6 మోతాదుల నీయవలెను.

ఎెథ్యూజ 30 (Aethusa 30):—వేసవికాలమునందు చంటిబిడ్డలకు ఆకుపచ్చగాగాని, నీళ్ళగాగాని వాసన లేక విరేచనముగుచుండిన రోజుకు 6 మోతాదుల నీయవలెను.



ఒయినోధిగాబెన్నిస్ 30 (Oenothera Bennis 30):- ఈ ఔషధమునుగూడ చంటిబిడ్డలకు వేసవికాలమునందు కలుగు విరేచనములకు వాడవచ్చును.

ఐరిస్‌వర్సు 30 (Iris Vers 30):— విరేచనములు వేసవికాలమునందును, సీతాకాలమునందును కలిగి, వాంతి వికారములేకయుండి, ఎక్కువగా కడుపుయందు నొప్పియున్న దీనిని వాడవలయును.

న్యూఫార్‌లూట్ 30 (Nuphar Lut 30):— ఉదయమున విరేచనములగుచుండి నొప్పిలేకయున్న దీనిని వాడవలయును.

జ్వరము, విరేచనములుయున్న ఎలాటేరియం 30 (Elaterium 30) ను వాడవలయును. జ్వరము, దాహము, చలియున్న అకోనైటు 6 (Aconite 6) ను వాడవలయును. బాప్టీషియ 6 (Baptisia 6) జెల్‌సీమియం 6 (Gelsemium 6) అర్సెనిక్ 6 (Arsenic 6) లను గూడ పరిస్థితులనుబట్టి వాడవలెను.

చైనా 30 (China 30):— జామ, అరటి మొదలగు పచ్చికాయలను, కూరలను తినుటవలన కలిగి నొప్పియుండినను దీనిని వాడవలయును. విరేచనములు రాత్రియందగుచున్న దీనిని వాడుటమంచిది.

సల్ఫర్ 30 (Sulphur 30) :— ఆకుపచ్చని, పసుపు పచ్చని, తెల్లని నీటివంటి విరేచనములు, బంకతోకూడియున్న ప్పటికినీ వాసనయుండి నిశరాత్రియందెక్కువగుచున్న రోజుకు 6 మో॥ వాడవలయును. దీనివలన సుగుణము కనబడనిచో కాల్ కేరియకార్బ 30 (Cal-Carb. 30) ను వాడవలయును.

కోలసైంథిస్ 6,30 (Colocynthis 6, 30):— విరేచనములతో ఎక్కువగా కడుపునొప్పియున్న నిది పనిచేయును. దీనివలన సుగుణములేనిచో మాగ్నీషియాఫాసు6 (Magnesia Phos 6) ను వాడవలయును. గర్భమునందు నొప్పి లేకుండినను దీనిని వాడవచ్చును.

పల్సటిల్లా 30 (Pulsatilla 30) :— పులుపు వస్తువులు మిక్కుటముగా తినుటవల్ల, పచ్చగాను, నీళ్ళగాను, విరేచనములు మారుచు, భోజన ఫలహారానంతరమున ఎక్కువగానగుచున్న దీనిని గంటకొక మోతాదు నీయవలెను.

ఇపికాకు 30 (Ipecacu 30):— ఆకుపచ్చని లేక నురుగు విరేచనములు గాని, అజీర్తి విరేచనములు గాని, అగుచు వికారముతో వాంతియున్న దీనిని రోజుకు 6 మో॥ నీయవలెను.

సీతాకాలమునందు జలుబువలన విరేచనములగుచుండిన క్యాంఫర్ (Camphor) అకోనైటు 3 (Aconite 3) బ్రయోనియ 6 (Bryonia 6) లను వాడవలయును.



వర్షాకాలమునందు జలుబువలన విరేచనము లగుచుండిన డల్కెమిర 6 (Dulcamera 6) రుహాస్టాక్సు 6 (Rhus Tox 6) ను వాడవలయును. చంటిపిల్లలకు పండ్లురాబోవునప్పుడు కలిగిన ఛమోమిల్లా 12 ను (Chamomilla 12) కాల్ కేరియకార్బ 6 (Cal. carb 6) ను వాడవలయును. భయమువలనగాని సంతోషమువలనగాని కలిగిన కాఫియ 6 (Coffea 6) ఓపియం 6 (Opium 6) ను వాడవలయును. గర్భవతికిగాని ప్రసూతియైన తరువాతగాని విరేచనములగుచుండిన యాంటిమోనియంక్రూడం 6 ను (Ant. crud 6) చైనా 6 ను (China 6) హైసామస్ 30 (Hyos 30) లను వాడవలసినది.

పురాణవ్యాధియైన సల్ఫర్ 30 ను (Sulphur 30) కాల్ కేరియకార్బ 6 (Cal. carb 6) లైకపోడియం 30 (Lycopodium 30) ఆలోసు 30 (Aloes 30) ఆసిడ్ ఫాసు 6 ను (Acid phos 6) రోజుకు 6 మో॥ చొప్పున వాడవలయును.

రొమెక్సు 3 (Romex 3):— నీలివర్ణపు నీళ్ళవిరేచనములు; ఉదయమునకు పూర్వమే నిద్రనుండి తొందరగా వెళ్ళునట్లు చేయుచున్న దీనిని వాడవలయును

పొడోఫిలం 6 (Podophyllum 6) కాల్చికం 30 (Colchicum 30):— విరేచనములు తెల్లగను, పచ్చగను మారుచుండి కడుపులోమంట, కడుపు చల్లదనము, వికారము వాంతియున్న నివి ప్రధానౌషధములుగా రోజుకు 6 మో॥ వాడవలయును.

## 12. గ్రహణి. (Dysentry).

ఉపవాసము లెక్కువగానుండుట, అనారోగ్యములగు ప్రదేశములందు నివసించుట, నెయ్యి, చేప, మాంసము మొదలగు బరువుపదార్థములను మిక్కుటముగా భుజించుట వలనను, పెద్దప్రేగులయందు పుండుపర్చడి, రక్తముతోగాని, చీముతోగాని, రక్తము చీము కలయుచుగాని, విరేచనములు, ఆహారమందిష్టత, జ్వరము, ఆసనమునందు తీపు మొదలగు లక్షణములతోకూడి యుండవచ్చును.

అకోనైటు 6 (Aconite 6) :— విరేచనములతో జ్వరము, దాహము, చలి కలిగిన దీనిని రోజుకు 4 మో॥ వాడవలయును.

బాప్టీషియా 3 (Bapt. 3): — ముసలివారలకుగాని చంటిపిల్లలకుగాని జ్వరముతో విరేచనములు కలిగి వాసనయున్న రోజుకు 6 మోతాదులను వాడవలయును.

జెల్సీమియం 6 (Gelsemium 6) :— అకోనైటు వలన ప్రయోజనము లేనిచో దీనిని వాడవలయును.

అర్సెనికంఆల్బ 6,30 (Arsenic Alb 6,30) :—వాసనతో చిక్కని విరేచనములు నల్లగను, ఆకుపచ్చగను, నెత్తురుగనుయుండి, అవిశ్రాంతి, జ్వరముయున్న దీనిని వాడవలయును.



బెల్లడోన 6 (Belladona 6):—నాలుకతడిలేక యుండి చివరభాగము ఎఱ్ఱగానుండి దాహమెక్కువగుట, మూత్రబంధన, లేక మూత్రముయెక్కువగానగుట, తలనొప్పి,జ్వరము, వేడిగానుండు చెమటయున్న దీనిని వాడవలయును.

కార్బోవెజిటబిలిస్ 30 (Carbo Veg. 30):— నాడి నీరశించుట, శరీరముచల్లగానుండి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు చల్లగనుండుట, వెంటవెంట విరేచనములు వాసనతో కలుగుచున్న గంటకొక మోతాదు నీయవలెను.

కాల్కేరియకార్బ 30 (Cal-Carb 30):— విరేచనముకు వెళ్ళవలసినట్లుగానుండి ఆసనముబరువు, మంటగనుండుట, రక్తముగగాని చీముగగాని, జ్వరముతో కూడియుండినను దీనిని రోజుకు 6 మో॥ వాడవలయును. దీనిని పురాణవ్యాధులందుగూడ వాడుటమంచిది.

ఇపికాకు 30 (Ipecacu 30):— ఆకుపచ్చగను, నల్లగను, చీముగను, రక్తముగను మారుచు విరేచనము లెక్కువగ నగుచు వికారము వాంతియున్న దీనిని గంటకొక మోతాదీయవలయును.

మెర్క్యూరియస్ కరోసివస్ 30 (Mer Cor 30):—విరేచనమునకు ముందును వెనుకను విరేచనమగుచున్నప్పుడును కడుపునొప్పిగానుండి, చీము రక్తము కలియుచు రక్తమెక్కు

వగానుండి, మూత్రబంధనయుండినను గంటకొక మోతా దీయవలెను.

మెర్క్యూరియస్ సాలబిలిస్ 30 (Mer. Sol. 30):— ఈ ఔషధము లేనప్పుడు మెర్క్యూరియస్‌వివస్ (Mercurius Vivus 30) ను ఈక్రింద నుదహరించు లక్షణములున్నను వాడవచ్చును. విరేచనము చీముతోను, చీమురక్తముతోను, ఆకుపచ్చగను మారుచుగాని లేక రక్తముకన్న చీమెక్కువగా నగుచు కడుపునొప్పియున్న దీనిని వాడవలయును.

కాలిఫాసు 3, 30 (Kali Phos 3,30) :— విరేచనముతో రక్తముప్రధానముగనున్న దీనిని వాడవలయును.

మాగ్నీషియాఫాసు 6 (Mag. Phos 6):— ఆగిఆగి వచ్చు కడుపులోనొప్పి, శరీరమువంగినట్లుండుట, పొత్తికడుపు నొక్కుటవల్ల నొప్పియుపశాంతిగనుండుట, ఆసనమునందెక్కువగాపోటు, విరేచనములు యున్న గంటకొక మోతాదీయవలయును.

కోలసైంథిస్ 30 (Colocynthis 30):— విరేచనమైన వెంటనే నొప్పి, ఆసనమునందు మంట, స్వల్పాహారమునుగాని దాహమునుగాని త్రాగినవెంటనే విరేచనము రక్తముతోగాని చీముతోగాని, వెంట వెంటనేఅగుచు, యెక్కువగా పొత్తికడుపునొప్పియున్న గంటకొక మోతాదీయవలెను.



కోనియం 30 (Conium 30):— ఉప్పుగానుండు పదార్ధములయందు రుచికలిగి తినవలయునను కోరికయుండుట, ఆహారమునందు హితవుతప్పుడ, పురాణ వ్యాధిగా నుండినప్పటికిని, రాత్రియందు విరేచనము లెక్కువగనగుచు రక్తముతోకూడియున్న దీనిని వాడవలయును.

ఫాస్ఫరస్ 30 (Phospharous 30):— నొప్పితోగాని లేకగాని విరేచనమునకు వెళ్ళవలయునని యుండుట; ఆసనము తెరచుకొనియుండియు రక్తము బంక పడుచున్న దీనిని వాడవలయును.

నక్సువామిక 30 (Nux-Vomica 30):— విరేచనమునకు వెళ్ళవలయునని బాధగానుండి, వెళ్ళినతరువాత బాధ తగ్గి విరేచనము కాకుండిన దీవిని వాడవలయును.

ఆలోసు 30 (Aloes 30):— చీము నల్లనిరక్తముతో విరేచనములు, నడుము పిరుదులు నొప్పులు, పొత్తికడుపుశూల నోరు తడిలేక ఎక్కువగా దాహమగుట, కడుపుబ్బరము, విరేచనమునకు వెళ్లి సొమ్మసిలబోవుటయున్న 2 గంటలకొక మో॥ నీయవలెను.

పల్సటిల్లా 30 (Pulsatilla 30):— విరేచనములు కలరా దినములందు ప్రారంభమయి ఆకుపచ్చగను, పసుపుపచ్చగను, యెరుపుగను, రక్తముతోమారుచు రాత్రియం

డెక్కువగుట; నాలుక అంటుకొనుచున్నట్లుగా నుండుట, ఊపిరి పీల్చుట కష్టముగా నుండుట, నడుము నొప్పులుయున్న రోజుకు 6 మో॥ నీయవలెను.

పొడోఫిలం 3, 12 (Podophyllum 3, 12):- నెత్తురు జిగటతో నడుమనడుమ విరేచనములు, రంగు రంగులుగా మారుచు నగుచుండి ఆసనము పొడుచుకొనివచ్చియున్న దీనిని వాడవలయును.

కాన్థరిస్ 3, 12 (Cantharis: 3,-12) అతికష్టముతో మూత్రము విడుచుచు మంట,చీము మాంసమువలె గట్టిగానుండుట, దాహముండియు నీరును త్రాగుట కయిష్టముగానుండుట, ఒడలు చల్లదనముయున్న గంటకొక మోతాదు నీయవలెను.

రుహస్టాక్సు 6,30 (Rhus Tox 6,30):— చీముగను, నెత్తురుగను, నీళ్ళగను విరేచనములు తెలియక ప్రక్కయందగుచు, జ్వరము, సంధి, కడుపునొప్పి, ఒడలు నొప్పులుయున్న దీనిని గంటకొకమోతాదు నీయవలెను. పురాణ వ్యాధియందుగూడ దీనిని రోజుకు 6 మో॥ వాడవలయును.

కాప్సికం 30 (Capsicum 30) :—చీము నల్లనిరక్తము యుండినను దీనినిగూడ వాడవచ్చును.



చైనా 30 (China 30) :— ఆహారముగాని దాహముగాని పుచ్చుకొనినవెంటనే డెక్కువగుచు, జ్వరము, కాలుసేతులు చల్లగనుండుట మొదలగు లక్షణములతోకూడి విరేచనములు రాత్రియందెక్కువగ నగుచుండిన దీనిని వాడవలయును. ఈ లక్షణములు అర్సినిక్ 6, (Arsenic 6) వలనను కాల్ కేరియకార్బ 6 (Cal. Carb 6) వలనను సుగుణమును బడయనిచో దీనిని వాడుటమంచిది.

లాచెసిస్, 30 (Lachesis 30):— చల్లదనము, దాహము, పగుళ్ళతో ఎఱ్ఱని నాలుక, నల్లని రక్తము లేక చీము రక్తముతో వాసనగల విరేచనములు, ఆసనమునందు తీపుయున్న 2 గంటలకొక మోతాదు నీయవలెను.

సల్ఫర్ 30 (Sulphur 30):— ఈ ఔషధమునుగూడ పురాణవ్యాధియందు వాడవచ్చును. పైనుదహరించిన లక్షణములకు ఆయా ఔషధములను వాడి సుగుణమును పొందనప్పుడు నీ మందును అరగంటకొక మోతాదు చొప్పున మూడు మోతాదులవరకు నిచ్చి నొకగంట సేపాగి పైనచెప్పబడిన లక్షణములనుబట్టి ఆయా ఔషధము నిచ్చిన మంచి గుణమును పొందగలరు.

## 13. మలబద్ధము. (Constipation.)

తరుచు విరేచనములకు ఔషధమును సేవించుటవల్లను, అజీర్ణమువల్లను, విరేచనమునకు వెళ్ళక బిగపట్టియుండుట

వలనను, సంభోగమువలనను, తిరుగుటవలనను కలిగి రక్తమూల, దగ్గు, తలనొప్పి, కడుపుబ్బరము, మంట, పొత్తికడుపు శూల, దడ, గుడగుడలాడుట, అపానవాయువులు, అరుచి మొదలగు లక్షణములతోకూడియుండును.

నక్సువామిక 30 (Nux Vom. 30):— మూలవ్యాధి యుండినను, జీర్ణముగాని పదార్థములు తినుటవలనను మల బద్ధము యేర్పడి, గర్భము నిండుగానుండినను విరేచనము కాకుండుట లేక గట్టిగా రాళ్లవంటి బహుకొద్ది విరేచనము, తలనొప్పి, భోజనానంతరమున 1,2 గం॥కు కడుపునొప్పి కలిగి వాంతిగాని విరేచనముగాని అయినచో బాధతగ్గునని తలచుట మొదలగు లక్షణములుండిన రాత్రి పరుండబోవు నప్పుడు 1 మోతాదును, ఉదయమున 1 మోతాదును వాడుచుండుట మంచిది. దీనివలన సుగుణము లేనిచో బ్రయోనియ 6 (Bry. 6) ను రోజుకు 4 మో॥ నీయవలెను.

అల్యూమెన్ 30 (Allumen 30):— కొన్నిరోజుల వరకు విరేచనమునకు వెళ్లవలెననే తలంపు లేక యుండిన రోజుకు 4 మో॥ నీయవలెను.

ఎనకార్డియం 3,6 (Anacardium 3,6):— విరేచనము తొందరగావచ్చినటులుండి వెళ్ళిన తరువాత కాకపోవుచున్న రోజుకు 4 మో॥ నీయవలెను.



ఓపియం 30 (Opium):- చచ్చువాతంవలన కలిగి ఆసనం బిగిసినట్లుండి, విరేచనము గట్టిగానగుచు, తలనొప్పి తలతిరుగుడు బద్ధకము, నోరు చెమ్మలేకయుండి దాహము కలిగిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఫాస్ఫరస్ 30 (Phos 30):- విరేచనమైనప్పుడు పొడుగుగాను, ఋక్కలి సన్నమైనదిగనుయున్న రోజుకు 4 మో॥ల నీయవలెను

ప్లంబం మెటాలికం 6 (Plumbum Met 6):- చచ్చువాతంవలన కలిగి ఆసనం బిగియునటులుండి, కడుపునొప్పి యున్న రోజుకు 4 మో॥ నీయవలెను.

ఆసిడ్ నైట్రిక్ 6, 30 (Acid Nitric 6, 30):— కొద్దిగా పొడిదగ్గు, విరేచనబద్ధముయున్న దీనిని వాడవలెను.

కొలిన్సోనియ 3,30 (Collinsonia 3, 30) —మలబద్ధముతో మూలశంఖ, దడయుండిన దీనిని రోజుకు 4 మో॥ వాడవలెను.

లైకపోడియం 30 (Lyco 30):- ఆసనమందు జిలబిగియునట్లుండుట, గర్భమందు గుడగుడ, అపాన వాయువులు, గుండెలలోమంట, పేగులయందు వెచ్చదనము, ఒడలుభారము యుండిన దీనిని వాడవలయును.

ప్లాటినా 30 (Platina 30):- మెత్తని విరేచనమవుచున్నను బయటికి వచ్చునప్పుడు బాధతో గిలగిలలాడుచున్న రోజుకు 4 మో॥ వాడవలయును.

మెర్క్యూరియస్ సాలబిలిస్ 30 (Mer Sol):—విరేచనబద్ధముతో నోరు అరుచియున్న దీనినివాడవలయును.

సల్ఫర్ 30 (Sulphur 30):- ఆసనము జిలమంట కలిగి నక్సువామిక (Nux Vom) వలన ప్రయోజనములేనిచో దీనిని వాడవలయును.

N. B :- నక్సువామిక (Nux Vom) సల్ఫర్ (Sulph) మలబద్ధమునకు ప్రధానౌషధములైయున్నవి. కనుక ఒక్కొక ఔషధమును 2 మోతాదుల చొప్పున 2 ఔషధములను 4 మార్లుగా పుచ్చుకొనవలెను. మలబద్ధము యున్నవారలు తరుచు విరేచనములకు ఔషధమును సేవించెదరు. అటుల సేవించిన మలబద్ధమెక్కువై, మరల సేవించుచుండిననేగాని విరేచనముకాదు. విరేచనమును బిగపట్టుటయును, అపానవాయువులను బిగబట్టుటయునుగూడ బద్ధమునకు ముఖ్యకారణములైయున్నవి. ప్రతిదినము ఉదయముననను, సాయంతనము పరుండబోవునప్పుడును ఒక అరసోలెడు చల్లని నీటిని త్రాగుచుండవలెను. పైనుదహరించిన ఔషధములను సేవించుచు కొబ్బరికాయనీటినిగూడ త్రాగుచు గోధుమ యన్నమును



తినుచుండవలెను; గోధుమరొట్టెను తినుచుండిన కొందరకు వేడిచేయుటయుగూడ తటస్థించును.

## 14. అజీర్ణము. (Dyspepsia).

ఈ వ్యాధి అకాలమున భుజించుటవలనను, మిక్కుటముగ ఆహారపదార్థములను భుజించుటవలనను, పగటియందు నిద్రించుట, మలమూత్రములను విసర్జించనిచ్ఛగలిగినప్పుడు బిగపట్టియుంచుట, మత్తుపదార్థములను సేవించుటవలనను, ఆకలిమందగించి తినినపదార్థము జీర్ణముగాక, మగత, గుండెలయందుమంట, త్రేపులు, దుర్వాసనగల మలము అపానవాయువులు బైలువెడలుట, పసరువాంతి, అరుచి, పేగులు అరచుట, కడుపుబ్బరము మొదలగు లక్షణములతోకూడియుండును.

నక్సువామిక 30 (Nux Vom. 30):— పనిపాటలు చేయనివారికిన్ని, మత్తుపదార్థములు త్రాగువారికిన్ని, అజీర్ణరోగముజనించి భోజనము చేసిన 1,2 గం॥కు కడుపునొప్పి, భోజనానంతరము గర్భము బరువు, గుండెలలోమంట, ప్రత్యూషమున తలనొప్పి, వి[illegible]మునకు వెళ్ళవలసినట్లుగా నుండుట మొదలగు లక్షణ[illegible]న్న దీనిని రోజుకు 4 మో॥ను వాడవలెను.

నాట్రంఫాస్ 3,12 (Nat. Phos 3,12) :—గుండెలలో మంట, నోటియందు పుల్లని రుచి, భోజనమైన వెంటనే పుల్లని త్రేపులతో కడుపునొప్పియున్న రోజుకు 4 మో॥ సీయవలెను.

బ్రయోనియ 6,12 (Bry. 6, 12) :— ఆకలి మందగించి అజీర్ణము గలిగి కదలికవల్ల బాధయుండిన రోజుకు 4 మో॥ సీయవలెను.

చైనా 3,12 (China 3,12):— నిస్సత్తువ, అన్నము తినగనే నిద్రవచ్చుట, చలిజ్వరమువలన పీడింపబడువారలకు అజీర్ణముయున్న నిది బాగుగ పనిచేయును.

పల్సటిల్లా 30 (Puls. 30):— అధికముగ తినుటవలనను, చేపమొదలగు ఒరుగని మాంసపదార్థములను సేవించుటవలనను, అజీర్ణము కలిగిన రోజుకు 4మో॥ సీయువలెను.

కార్బోవెజిటబిలిస్ 3,6 (Carbo Veg. 3,6):—అపానవాయువ్రులు, కడుపుబ్బరము, గుండెలలోమంట, తలనొప్పి, నీరసము, నోరుపుప్పగా గాని చేదుగా గాని యుండి అరుచి, కొన్నిరోజులు విరేచనముకాకుండుట, కొన్నిరోజులు విరేచనములగుచుండి వ్యాధి పురాణముగానున్న దీనిని రోజుకు 4 మోతాదుల సీయవలెను

ఎబిస్‌నిగ్ర 3,6 (Abis Nigra 3,6):—గర్భము యెప్పుడును నిండుగానుండినట్లుండిన రోజుకు 4 మో॥ల సీయువలెను.



నాట్రంమూర్ 3, 12 (Nat. Mur 3,12):— నోటియందు నీరూరుట, నాలుక తెల్లని పూతగానుండుట లేక పచ్చని పూతగలిగియుండుట, కడుపునొప్పియుండి దీర్ఘకాలపు జీర్ణకోశ రోగముగానుండిన దీనిని వాడవలెను. దీనివలన గుణము కనబడనిచో కాలిసల్ఫు 6 (Kali Sulph 6) ను రోజుకు 4 మో॥ సీయవలెను.

కాల్‌కేరియఫాసు 3, 12 (Cali. Phos 3,12):— జీర్ణపదార్థమందలి రసమును రక్తము గ్రహించలేక పోవుటచే అజీర్ణము కలిగిన రోజుకు 4 మో॥ సీయవలెను. ఇది యెముకల నీరసమునకును, రక్తహీనులకు మంచి జీర్ణశక్తిని యిచ్చును.

యాంటిమోనియంక్రూడం 6 (Ant. Crud. 6) :— నాలుక తెల్లనిపూతకలిగియుండుట; అరుచి, నురుగుగాగాని, పసరుగాగాని లేక చీముగాగాని వాంతియుండుట, గర్భము బరువుగానుండుట, వాసనగలవాంతి, ఒక్కొకప్పుడు విరేచనబద్ధము ఒక్కొకప్పుడు విరేచనములగుచున్న రోజుకు 4మో॥ సీయవలెను.

మెర్క్యూరియస్‌సాలబిలిస్ 30 (Mer. Sol 30) :— ఉదయమున లేచునప్పటికి నోరు అరుచిగానుండి, చల్లని పదార్థములు తినవలయుననియున్న రోజుకు 4 మో॥ సీయవలెను.

లైకపోడియం 6,30 (Lycopodium 6.30):— ఆకలి గానుండి కొద్ది ఆహారమును తినగనే మిక్కుటముగా కనుబడుట, గర్భమునిండుగానుండుట, అపానవాయువులు, విరేచనబద్ధము, పేగులలో యెడమభాగమున గుడగుడలాడుట యున్న రోజుకు 4 మో॥ నీయవలెను.

ఇపికాకు 6,30 (Ipecacu 6,30):— నీరసము, భోజనానంతరం గర్భము వట్టిదిగా కనుబడుచుండిన దీనిని వాడవలయును.

ఇగ్నీషియ 30 (Ignetia 30):— దుఃఖమువలన అజీర్ణము యేర్పడిన దీనిని వాడవలయును.

ఫాస్ఫరస్ 30 (Phos. 30):— దీర్ఘకాలపు అజీర్ణము, వాంతులు, తెల్లనిపూతగల నాలుక, అతి ఆకలియున్న దీనిని వాడవలయును.

హీపార్ సల్ఫ్ 6,30 (Hepar Sulph 6,30):— దీర్ఘకాలపు వ్యాధిగానుండి స్వల్పాహారమును భుజించినను అరుగుదలగాకయుండిన దీనిని వాడవలయును

సల్ఫర్ 30 (Sulphur 30):— గర్భము బరువుగానుండుట, భోజనానంతరం మత్తు, ముఖముమీదను పెదవుల మీదను పుండ్లుయుండి వాచుచుండిన రోజుకు 4 మో॥ల నీయవలెను. సల్ఫర్ (Sulphur) యుదయమునను,



నక్సువామిక (Nux Vom.) రాత్రి పరుండబోవు నప్పుడును సేవించుచుండిన అజీర్ణము నివారణయగును.

N. B:— ఉదయమునసే లేచి మలవిసర్జనమైన తరువాత కొద్ది కసరత్తును చేసికొనుచుండవలెను. ఆహారము బాగుగ నమలిమ్రింగుట మంచిది భోజనానంతరం 5 నిమిషములు ఇంటియందే పచారుచేసి మంచముమీదగాని చాప మీదగాని ఎడమప్రక్కన యెడమచేయి దిండుగా నేర్పరచుకొని పరుండవలెను. అటుల పరుండుటవలన కుడినాసికా రంధ్రమునుండి గాలి వచ్చుచుండును. అటుల వచ్చుచుండిన తినిన ఆహారమంతయు బాగుగ జీర్ణమగును. అటుల 15 నిమిషముల వరకు పరుండిన చాలును.

## 15. మూలవ్యాధి (Piles.)

ఈవ్యాధి ఉష్ణకరమగుపదార్థములను సేవించుటచేతను, అగ్ని సమీపమున చేయుపనులవల్లను, ఎండ వేడిమిలో తిరుగుటవలనను, అతిగా సంభోగము వలనను, మద్యపానము చేయుటవలనను, కోపము ఓర్వలేమివల్లను వాతాదిదోషములు ప్రకోపించి, చర్మము, మాంసము క్రొవ్వ యనునీమూటిని చెరచి, ఆసనమునందు సన్నని మాంసమొలకలు జనింపచేసి, రక్తము అధికముగా స్రవించుచు, మలబద్ధము, ఆసనము మంట తీపు, తొడలు, పిక్కలు, నడుము నొప్పి, జఠరాగ్ని తగ్గియుండి,

చర్మము, కన్నులు, గోరులు, మలమూత్రము అనునివి పచ్చగాను, నల్లగాను, యెఱ్ఱగాను, తెల్లగానుయుండి మలము స్వల్పముగా వెడలుచు త్రేపులు, శరీరముకృశించి యుండుట అను నిట్టి లక్షణములతో వ్యాధి కూడియుండును.

నక్సు వామిక 30 (Nux vom. 30); సల్ఫర్ 30 (Sulpher 30):— మలబద్ధముతో ఆసనము మంట, తీపు, నడుము నొప్పులు, భోజనానంతరమునగాని లేక ఆలోచనానంతరమునగాని విరేచనమునందు రక్తము పడుచుండిన పైరెండు మందులను నొకటి తరువాత నొకటి రోజునకు 4 మో॥ల నీయవలెను.

బెల్లడోన 6, 30 (Belladona 6, 30):— ఆసనము పోడువుగా బిగియునట్లుగనుండి విరేచనము పెద్దదిగనగుచున్న రోజునకు 4 మో॥ ల నీయవలెను.

యాంటిమోనియం క్రూడం 6 (Ant. crud. 6):- నెత్తురుతో యెక్కువగా చీముయున్న రోజునకు 6 మో॥ ల నీయవలెను.

రాటన్‌హియ 3, 6 (Ratanhia 3, 6):— గుదస్థానమునందు దురద ప్రాముఖ్యముగనున్న దీనిని వాడవలెను.

యైసెక్యులస్ హిప్ 6, 12 (Aesculus Hip 6, 12):- ఆసనమునందు పుండిపుండి పోటు, నడుమునొప్పి, రక్తము



యెక్కువగా పడుటయున్న దీనిని వాడవలయును హేమామిలిస్ Q ను గుడ్డను లోషనునందు తడిపి ఆసనమునందుంచు రీతిగా యైసెక్యులస్ Q ను గూడ నుపయోగించవలసినది.

వ్యాధి దీర్ఘకాలమునుండియున్న కార్బోవెజిటబిలిస్ 30 (Carbo, Veg. 30) ఆసిడ్ ఫాసు 30 (Acid Phos. 30) చైనా 6 (China 6) థూజ 30 (Thuja 30) ఆసిడ్ నైట్రిక్ 30 (Acid Nit. 30) ఫాస్పరస్ 6 (Phospharus 6) కాస్టికం 30 (Caust. 30) ఆసిడ్ మూర్ 3 (Acid Muriatic 3)ను గూడ లక్షణములను బట్టి వాడవలయును.

16. వమనము వచ్చినట్లుండుట, వాంతి (Nausea, Vomiting,

మిక్కుటముగ భుజించుట వలనను, అపేక్ష లేనప్పుడు భుజించుట వలనను, శిరస్సునకు దెబ్బ తగులుటవలనను, మూత్రాశయ జబ్బులవలనను, పిత్తాశయజబ్బుల వలనను జంతువాతంవలనను, మూర్ఛవలనను, పార్శ్వనొప్పులవల్లను మద్యపానము వలనను, సముద్రము మొదలగు వాటిమీద నావ ప్రయాణము చేయుటవలనను వమనము వచ్చినట్లుండుట గాని, వాంతి యగుట గాని సంభవించును.

ఇపికాకు 3, 30 (Ipecacu 3, 30):— ఎప్పుడును వమనము వచ్చినట్లుండుటగాని, వికారముతో వాంతిగాని కలిగి, అధికముగా ఉమ్మి పూరుట, గర్భము వట్టిదిగానుండుట

పసరుగాగాని, నల్లగాగాని లేక చీముగాగాని వాంతియగుచున్న దీనిని వాడవలయును. దీనిని గర్భవతులకు వికారముతో వాంతియున్నను వాడవచ్చును.

రోబినియ 3, 6 (Robinia 3, 6):— వాంతి వచ్చినట్లుండుట, పుల్లని త్రేపులతోగాని, పుల్లని నీటితో గాని వాంతికలిగిన దీనిని వాడవలయును.

అర్సినిక్ 30 (Arsenic 30):— పెద్ద ప్రేగులయందు పుండు యేర్పడుటవలన వాంతి; ఒడలు వేడిగా నుండిగాని లేకగాని గర్భమున మంట, భోజనానంతరము పుల్లని వాంతి, అప్పుడప్పుడు వాంతివచ్చినట్లుండి విచారముచే మనస్సు క్రుంగినట్లుగా కనుబడుచున్న దీనిని వాడవలయును.

యాంటిమోనియం క్రూడం 6 (Ant. crud. 6):— గర్భము బరువుగా నుండుట, నాలుక తెల్లని వర్ణముగానుండి ఆహారమునందిష్టము లేకపోవుట, వాంతి వచ్చినట్లుండుట లేక వికారముయున్న దీనిని వాడవలయును.

ఎపొమార్ఫియ 1, 3 ట్రిట్యురేషన్ (Apomorphia 1, 3 Trit):— వాంతి వచ్చునట్లు తెలియకుండగనే తొందరగా వాంతి కలుగుచున్న దీనిని వాడవలయును. ఇది త్రాగుడు వలన, నల్లమందు వలన వాంతులు కలిగిన నిది పని చేయును.



ఐరిస్ వర్స 6 (Iris vers 6):— ఆహారమును గాని పసరునుగాని వెళ్ళపోసికొనుచు, తలనొప్పి, త్రేపులు యున్న దీని నిచ్చుట మంచిది.

క్రియోసోటం 6 (Kreosote 6):— శ్వాసకృచ్ఛ్రము అనగా క్షయరోగము వలనగాని, పిత్తాశయజబ్బు వలనగాని, మూత్రపిండజబ్బువలనగాని వాంతియగుచుండిన దీనిని వాడవలెను. ఇది గర్భవతుల వాంతులకుగూడ పనిచేయును.

అర్నికా 3, 30 (Arnica 3, 30):— శిరస్సునకు దెబ్బ తగులుటవలన వాంతులు కలుగుచున్న దీనిని వాడవలెను.

కాక్యులస్ 6 (Cocculus 6) పెట్రోలియం 6 (Petroleum 6) కాలిఫాసు 6 (Kali Phos 6) నాట్రం ఫాసు 6 (Nat. Phos. 6):— పడవ ప్రయాణమువలన వాంతులు కలిగిన వీనిని వాడవలయును. వక ఔషధము వలన నొక అరగంటలో సుగుణము లేనిచో మరియొక ఔషధమును మార్చవలయును. ఉద్రేకము తగ్గిన కొలదిని డోసుల నాలస్యముగా నిచ్చుచుండవలెను.

ఇపికాకు 6 (Ipecacu 6) మెల్లిఫోలియం 3 (Millifolium 3) హెమామెలిస్ 3 (Hemamelis 3) క్రియోసోటు 6 (Kreosote 6) లను నెత్తురు వాంతులగుచుండిన వాడవలయును.

ఐరిస్ వర్సు 3 (Iris vers 3) పోడోఫిలం 6 (Podophyllum 6) బ్రియోనియ 6 (Bryonia 6) మెర్క్యూరియస్ సాలబిలిస్ 6 (Mer. sol, 6) వీనిని పైత్యాధిక్యమువలన వాంతులు కలిగిన వాడవలయును.

యాంటిమోనియం టార్టారికం 6 (Ant. Tar. 6):- వాంతియైన వెంటనే వికారముతగ్గి మరల కాబోవునప్పుడు వికారము హెచ్చి వాంతియైన తక్షణమే వికారము తగ్గుచుండిన దీనిని వాడవలయును.

N. B. వాంతులు యుద్రేకముగానుండిన 5 లేక 10 నిమిషములకొక మోతాదు నీయవలెను.

## 17. పచ్చకామెర్లు (Jaundice)

ఈవ్యాధి అతిమైథునమువలనను, మద్యపానము వలనను, ఉప్పు పులుసు, కారము మొదలగు పదార్థముల నెక్కువగ నుపయోగించుటచేతను, మరి యేవిధమగు నుష్ణకరపదార్థములు సేవించినను, శరీరమునందుష్ణమధికమయి రక్తమాంసములను దహించి, నేత్రములు, చర్మము, మలమూత్రములనువివి పసుపువర్ణముగనుండి అరుచి, బడలిక, దుర్బలత్వము, మంటలు, ఆయాసము అనునిట్టి లక్షణములతోకూడియుండును.

చైనా 6, 12 (China 6, 12):— ముఖము పచ్చగాను, పిత్తాశయమునందు చురుకు చురుకుమను నొప్పులు,



చేదు, అరుచి, ఆయాసము, పచ్చనీళ్ళవంటి విరేచనము, యితరవైద్యములచే రసమునిచ్చి సుగుణమును బడయనిచో దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

మెర్క్యూరియస్ సాలబిలిస్ 6, 30(Mer. Sol 6, 30):- తెల్లగాగాని లేక పసుపు వర్ణముగాగాని మూత్రము, నాడి మందగించియుండుట, మలబద్ధముకలిగి అకోనైటు 3, 6 (Acon. 3, 6) వలన మంటలుతగ్గి పైలక్షణములుండిన రో॥ 4 మోతాదుల నీయవలెను.

ఛమోమిల్లా 6, 12 (Chomomilla 6, 12):-కోపము వలనగాని భయమువలనగాని కలిగిన దీనిని వాడవలయును. చంటిపిల్లల కేవ్యాధియైనను నిర్ధారణలేకుండగనే దీనిని వాడి సుగుణములేనిచో మరియొక ఔషధమును మార్చవలెను.

ఫాస్పరస్ 6 (Phospharus 6):-చర్మము పచ్చగానుండుట; బూడిదవర్ణముగల మూత్రము, దగ్గు, హీనస్వరముయున్న దీనిని రోజుకు 4 మోతాదుల నీయవలెను.

బ్రయోనియ 6, 30 (Bry. 6, 30):— కుడివైపున పండుకొనియుండునప్పుడు పిత్తాశయమున నొప్పియున్న దీనిని వాడవలయును.

చెలిడోనియం మేజస్ Q,6(Chelidonium Majus Q, 6): పసుపువర్ణపు విరేచనములు, కుడిభుజము నొప్పియున్న దీనిని 4 మో॥ల నీయవలెను.

క్రొటాలస్ హార్ 3, 12 (Crotalus Horridus 3, 12)— రక్తమలినముండుటవలన కామెర్లుకలిగిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

లెప్టాండ్ర Q,6 (Leptandra Q,6):— పిత్తాశమునందు వాపు పోటుకలిగి, విరేచనము నల్లగానగుచున్న దీనిని వాడవలయును.

ఛియరాంథస్‌వర్జినిక Q 3 (Cheiranthus Vur. Q,3):— పిచ్చితలనొప్పి, చేమ, బూడిదవర్ణపుమలము, నల్లని మూత్రమునగుచున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

నక్సువామిక 6, 30 (Nux Vom 6, 30):— పని పాటలు చేయనివారికి బరువు పదార్థములు సేవించుటవలన కలిగిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

## 18. పాండురోగము. (Anaemia).

చలిజ్వరము, అతిసారము, అజీర్ణము, ఇంద్రియనష్టము మొదలగు వ్యాధులు జీర్ణించుటవల్లను, ఋతుస్రావమెక్కువగుటవల్లను లేక ఆగుటవల్లను, మూలవ్యాధియందు రక్తమెక్కువగ స్రవించుటవలనను, క్వాయినా, రసము, ఉక్కు మొదలగు భస్మములనుగాని లేక ద్రావకములను చాలకాలముపయోగించుట వలనను, శరీరము ముఖము పాలిపోయి, ఆయాసము, బడలిక, రక్తహీనత, ఆకలి మందగించుట మొదలగు లక్షణములతో వ్యాధివ్యక్తపడును.



కాల్ కేరియఫాసు 3, 12 (Cal, Phos. 3, 12):— ఈ వ్యాధికిది ప్రధానౌషధమైయున్నది. ముఖము తెల్లగనుండి, జీర్ణపదార్థమందలి రసమును రక్తము గ్రహించలేక ఒడలు శుష్కించి అతిసీరసముయున్న దీనిని రోజుకు 4 మో॥ల వాడవలయుచు. దీనివల్లనుగుణములేనిచో ఫెర్రం మెటాలికం 3 ను (Fer. Met. 3) వాడవలయుచు

కాలిముర్ 3 (Kali Mur 3):—రక్తహీనతతో బాటు చర్మరోగములున్న దీనిని వాడవలయును.

నాట్రంముర్ 3, 12 (Not Mur 3, 12):-చలిజ్వరమువలన కలిగిన దీనిని వాడవలయుచు. లేక చైనానైనను వాడవచ్చును. యుక్తవయస్సుగల స్త్రీలరక్తము పలుచబడుటచే కలిగిన నాట్రంముర్ 3,12 ను కాల్ కేరియఫాసు 3,12 ను ఔషధమును 3 మో॥ల చొప్పున 2 ఔషధములను దినమునకు 6 మో॥ల నీయవలెను.

పల్సటిల్లా 6 (Puls 6):- ఫెర్రం మెటాలికం 6 (Fer Met. 6):-ఋతుస్రావజబ్బులవలన కలిగిన నేదోయొక యౌషధమును రోజుకు 4 మో॥ నీయవలెను.

చైనా 6 (China 6) ఆసిడ్ ఫాస్ఫోరిక్ 6 (Acid Phos6):- కుసుమవ్యాధివలనను, ఇంద్రియనష్టమువలనను, అతిసారమువలనను, రక్తస్రావములవలనను కలిగిన నొక ఔషధమును

వాడి గుణమును పొందనప్పుడు మరియొక ఔషధమును వాడవలెను.

నక్సువామిక 30 (Nux Vom 30) :— పని పాటలు చేయనివారికి బరువు పదార్థములు సేవించుటవలన కలిగిన రోజుకు 4 మో॥ నీయవలెను.

నైట్రిక్ ఆసిడ్ 6 (Acid Nit 6) ఆరం మెటాలికం 6 (Aur. Met 6):— రసమెక్కువగ నుపయోగించుటవలన కలిగినచో నేదో యొక ఔషధమును వాడవలయును.

పల్సటిల్లా 30 (Puls 30):— క్వయినా, ఉక్కు ఔషధముల నెక్కువగా నుపయోగించుటవలన కలిగి, కొద్ది చలియున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.

నాట్రంసల్ఫ 3,12 (Nat. Sulph 3,12):— పై వాటి వలన సుగుణమును పొందనప్పుడు దీనిని వాడుటమంచిది.

ఆహారము :— అతి శీఘ్రముగ నరుగు స్వల్పాహారమును భుజించుచు, గోరువెచ్చని నీటిని యుదయమున స్నానము చేయవలెను.

## 19. ఉబ్బురోగము. (Dropsy).

యోనిస్థానమునుండి ప్రసవానంతరమునగాని, ఋతుస్రావమునగాని రక్తమెక్కువగా స్రవించుటవలనను, చలి



జ్వరము, అజీర్ణము, అతిసారము, అతిమూత్రము మొదలగు వ్యాధుల ప్రారంభదశయందు తగు చికిత్స నందని వలన, శరీరమందలి రక్తము నీరగును. గుండెజబ్బువలన ప్రారంభమున కాళ్ళుబ్బరించును. పిత్తాశయజబ్బువలన ఉదరమునందు నీరు చేరును. దీనినే జలోదరమనిగూడ నందురు. మూత్రపిండ జబ్బువలన ప్రారంభమున ముఖముబ్బరించును. ముదిరిన కొలదిని శరీరమంతయు నీరుజేరును.

ఎపొసైనం కెనాబినం Q (Apocynum-can. Q) :— తలబరువుగా నుండునట్లుండుట, నిస్సత్తువ, అనిద్ర, నాడి సీరసించియుండుట, విరేచనబద్ధముండియు చిక్కని కొద్ది విరేచనము, ప్రయత్నము లేక మూత్రము బట్టయుండగుట, జలోదరము, ఎముకబొమ్మలందు నొప్పి మొదలగు లక్షణము లుండిన 15-20 మినిమములు (Minimums) వరకు ఒక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు కలిపి మోతాదుగా నీయవలెను. అటుల దినమునకు 2 మో॥ నిచ్చిన చాలును.

అర్సెనిక్ 6, 30 (Ars 6, 30):— పిత్తాశయజబ్బువల్లగాని, ఉదరమునందు కాళ్ళయందు వ్రిథమమున కనుబడి శరీరమంతయు వ్యాపించి నిస్సత్తువ, ఉద్రేకమగు నాడి, నాలుక ఎఱ్ఱని పూతగనుండుట, కాలుచేతులు చల్లదనము, పరుండినను ఆయాసముగ నుండుట, శరీరము పచ్చగ గనుబడుట, దాహముయున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఎపిస్ మెల్లిఫికా 3, 6 (Apis. Mel. 3, 6):- మూత్రపిండ జబ్బు వలన కలిగి, ముఖ్యముగా గర్భవతులకు అరకాళ్లు చేతులు, యుబ్బరము, కాలికపు ఉబ్బురోగముగనుండి దాహము లేక యుండుట, సంధి, మూత్రము అరుదుగనగుచు మెఱుపుగాను, మబ్బువర్ణముగా గాని పొగవర్ణముగాగాని యగుట, నొసటియందు చెమట, జ్వరముయున్న దీనిని రోజుకు 4 మో॥ ల నీయవలెను. N. B, పెద్ద సత్తువుగల మందును గర్భవతుల కిచ్చినచో గర్భపాతమును కలిగించును.

డిజిటలిస్ 6, 30 (Digitalis 6, 30) :- నాడి నిమ్మదిగను, నీరసముగను నుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కష్టముగా పీల్చుట, ఎల్లికిల పరుండుట కయిష్టముగా గాని, కష్టముగా గాని యుండుట, మూత్రపిండ జబ్బువలనగాని గుండె జబ్బువలనగాని కలిగిన రోజుకు 4 మో॥ ల నీయవలెను.

ఆసిడ్ ఆసిటిక్ 2, 6 (Acid Acetic 2, 6):— పాదములుబ్బరముగానుండి దాహమున్న దీనిని వాడవలెను.

టర్బెంథిన 3, 6 (Terbenthina 3, 6) :—మూత్రము రక్తయుక్తముగానున్న దీనిని వాడవలయును.

హెలిబోరస్ 12, 30 (Hell. 12, 30):— పిల్లలకు తలలో నీరు చేరి తల పెద్దదిగనుండినను, గుండె జబ్బువలన గాని, మూత్రపిండ జబ్బువలనగాని నీరు కనుబడిన రోజుకు 4 మో॥ ల నీయవలెను.



బ్రయోనియ 3, 30 (Bry. 3, 30):— మలబద్ధము వలనను పిత్తాశయ జబ్బు వలనను గర్భవతులకు పాదములుబ్బరించిన దీనిని వాడవలెను. కీళ్ళ యుబ్బరము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కష్టముగా పీల్చుట, దగ్గు, హృదయమునందు నొప్పి, చర్మవ్యాధులు అణగియుండుటవలనను కలిగిన రో॥ 4 మో॥ ల నీయవలెను.

పల్సటిల్లా 30 (Puls. 30):— ఋతు సంబంధమగు జబ్బువలన కలిగిన దీనివాడవలయును.

సల్ఫర్ 30 (Sulph. 30):— బ్రియోనియ వలన సుగుణము లేనిచో దీనిని వాడవలయును.

ఫెర్రం మెటాలికం 3, 6 (Ferrum Met. 3, 6):— శరీరము పసుపు పచ్చగానుండి, విరేచన బద్ధము, భోజనానంతరమున వికారము, ఋతుస్రావమాగుటవలన కనుబడినను దీనినివాడవలెను. చైనా 6 (China 6) లాచెసెస్ 6 (Lachesis 6) కాల్చికం 6 (Colch. 6) లైకపోడియం 30(Lyco. 30) అకోనైటు 6 (Acon. 6) లను గూడ పరిస్థితులనుబట్టి వాడుట మంచిది.

థలాస్పిబుర్సపాస్టోరిస్ (Thalaspi Bursa Pastoris):— ఉబ్బురోగమున ముఖ్యముగా జలోదరమున నిది బాగుగ పని చేయును. మూత్రము జాస్తిగనగునట్లు చేయుచు నీరును తగ్గించును.

**N. B:—** అయోడియం Q ను (Iodium Q) ఉబ్బు రోగమునందు నొప్పియున్న భాగములకును, వాపుయున్న భాగములకును 2 రో॥ ల కొకమారు పూయుచుండవలెను. ఈ వ్యాధికి నీరు డెక్కువగనగునటుల చేయుట మంచిదిగాని, విరేచనము లెక్కువగా నగునటుల చేసినచో రోగికి నీరస మెక్కువయి అపాయము చేయవచ్చును ప్రతి దినము రోగికి చీకటి గదియందు ఆవిరిపట్టుచు (Steam bathe) చెమట ఆరు నంతవరకు గదియుందే తలుపులు మూసియుంచవలెను. ఉడుకు లామును చల్లని నీటియందు కలిపి శిరస్సును మధ్య మధ్య ఆనీటితో తడుపుట మంచిది

ఆహారము:— ఉప్పుతినినంతకాలమీ వ్యాధి కుదురుట చాలకష్టము. రోగికి త్వరగ జీర్ణమునకువచ్చు ఆహారములను అనగా పండ్లు, పాలు, జావ మొదలగు ఆహారములనే యిచ్చు చుండవలెను

### 20. ప్లీహము. (Enlargement of Spleen.)

ఇది ఎడమ వైపున ప్రక్కయెముకలక్రింద నుండును. ప్లీహము వాచియుండి నొక్కినచో బాధ కలుగును. దీనిని మనవారు బల్ల పెరుగుట యందురు. దీనికి తగుచికిత్స నంద నిచో పాతము లుబ్బరించుటయేగాక జలోదరముగూడ కలుగ వచ్చును. ముఖము వెలవెలబోవుచు కాలు సేతులు చల్లగ నుండును.



సైనోథస్ అమెరికాన Q. (Ceonothus Americana Q.):- ప్లీహ వాపు నేకారణమువలన కలిగినను 5 చుక్కలు ఒక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు కలిపి మోతాదుగ నీయవలెను. అటుల రోజుకు 3 మో॥ల నిచ్చుచు ప్లీహము మీద వాపునకుగూడ దీనిని పూయుచుండవలెను.

ఆర్నికా 6,30 (Arnica 6,30):—కుట్టుచున్నట్టి నొప్పి లేకపోటు, నొక్కినచో నొప్పి, నెత్తురువాంతి కలుగుచున్న దీనిని 6 మో॥ నీయవలెను.

ఆర్సెనిక్ ఆల్బు 30 (Ars. Alb 30):— జ్వరము విడు వకయుండి ప్లీహము వాపుతో కఠినముగానుండి, ఎడమపార్శ్వ మున పరుండలేక యుండుట, ముఖముదూసుకొని బలహీన తగా కనుబడుచున్న రోజుకు 6 మో॥ నీయవలెను.

కార్బోవెజిటబిలిస్ 3 (Carbo Veg 3) లేక నాట్రం మూర్ 6,30 (Nat-Mur 6,30):—ప్లీహమునందు ఒక విధ మగు గురగుర వినబడుచుండిన పైరెండు మందులలో నొక దానిని రోజుకు 4 మో॥ నీయవలెను.

చైనా 6 (China 6) నక్సువామిక 30 (Nux-Vom30) పొడోఫిలం 6 (Podophyllum 6) మెర్కుబిన్ అయోడైడు 3 (Merc. Bin. Iodide 3) ఫాస్పరస్ 6 (Phos. 6) ఆసిడ్ నైట్రిక్ 6 (Acid Nit. 6) లెప్టాండ్ర 6 (Leptandra 6)

లైకపోడియం 6 (Lycopodium 6) మొదలగు ఔషధము లనుగూడ గుణగతములనుబట్టి వాడుచు, సైనోథస్ అమెరికానా Q (Cenothus Americana Q) ను గూడ వాపునకు పూయుచుండవలెను.

21. చెవిబాధలు. (Diseases of the Ear,)

అకోనైటు 3 (Aconite 3):—చెవివాపుతో మంటలున్న దీనిని వాడవలయును జ్వరము చెవియందు పోటుయున్నను దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఛమోమిల్లా 12 (Cham. 12):— లేక మెర్క్యూరియస్‌సాలబిలస్ 6 (Mer. Sol. 6):— చెవిపోటుతో పళ్లనొప్పి యున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

పల్సటిల్లా 30 (Puls 30):—జలుబువల్లనొప్పి కలిగిన దీనిని వాడవలయును. చించుచున్నట్టి నొప్పి, వాపు, చెవి మూసికొనిపోయినట్లుండుట, ఆకుపచ్చని పసుపుపచ్చని చీము కారుచు నొప్పి సాయంతనమునందును, యుష్ణగదులయందును యెక్కువగానుండి చల్లనినీటిచే ఉపశాంతిగానున్న దీనిని వాడవలయును. పడిశమువల్ల చెవియందు ధ్వనితో చెముడు కలిగినను దీనిని వాడవచ్చును.

ఆర్సీనిక్ 3, 6 (Ars. 3, 6):—చెవియందు మంటలున్న రోజుకు 4 మో॥ల నీయవలయును.



మెర్క్యూరియస్ సాలబిలస్ 6 (Mer. Sol. 6):— చెవిలో పోటు, క్రిందిభాగమున బిళ్ళలుయున్న దీనిని వాడవలయును. చెవినుండి రక్తముగాని వాసనతోగూడిన చీము గాని స్రవించుచు, తడపర, మసూచికము మొదలగు వ్యాధులలో కలిగిన చీమునకు దీనిని వాడవచ్చును. దీనివలన సుగుణము కనబడనిచో ఆర్సినిక్ 6 (Ars. 6):— కాల్కేరియా కార్బ 30 (Cal. Carb. 30):-లను వాడవలయును.

ఆర్నిక 30 (Arnica 30):— దెబ్బ తగులుటవలన చెవి అదరి పోటుగానున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

బెల్లడోన 3 (Bell. 3):- కురుపువలన వాపు, పోటు, మంటలుయున్న దీనిని వాడుచు Q ను చెవియందు 2 చుక్కలు వేయవలయును. దీనివలన సుగుణము లేనిచో హీపార్ సల్ఫ (Hepar Sulph 6) సల్ఫర్ 30 (Sulph 30) ను రోజుకు 4 మో॥ నీయవలెను

ఆసిడ్‌ఫాసు 30 (Acid phos 30) :— చెవియందు గుయ్యిమనుచున్నట్లుగాని, టక్‌టక్‌మను ధ్వనిగాని, వినబడుచున్న రోజుకు 4 మో॥ నీయవలెను.

నక్సువామికా 30 (Nux 30) :— ఉదయమున చెవియందు గుయ్యుమను ధ్వనియుండి, దురదగానుండిన దీనిని వాడవలయును.

ఆసిడ్ నైట్రిక్ 6 లేక చైనా 200 (Acid Nit 6 or China 200):— క్వైనా విస్తారముగ వాడుటవలన చెవియందు ఘోరమను ధ్వనికలిగిన దీనిని వాడవలయును.

వెరాట్రంఆల్బ 30 (Verat-Alb 30):— చెవియందు ధ్వనితో వాంతియున్న దీనిని వాడవలయును.

డిజిటలిస్ 6,30 (Digitalis 6,30):— బుస్సుకొట్టు చున్నట్లు ధ్వనియున్న దీనిని వాడవలయును.

ఆసిడ్ నైట్రిక్ 6 (Acid Nit 6):— ఆహారమును భుజించుచున్నప్పుడే చెవియందు ధ్వనిగానుండి వినబడుటకు కొద్దికష్టముగానున్న దీనిని వాడవలయును.

యాంటిమోనియంక్రూడం 6, గ్రాఫిటిస్ 6 (Ant. Crud 6, Graphitis 6):— చెవిమీదను చుట్టుప్రక్కలను కురుపులు మొదలగునవియున్న రోజుకు 4 మో॥ నీయవలెను.

బార్యటకార్బ 6 (Baryata carb 6):— వినబడుట కష్టముగానుండి, చెవిచుట్టుప్రక్కలి భాగమున బిళ్ళలుబ్బరించి యున్న రోజుకు 4 మో॥ నీయవలెను.

కాల్కేరియకార్బ 6 (Cal. Carb 6):— చెవినుండి చీముగాని రక్తముగాని కారుచువాపుతో బిళ్లలున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.



కలిబైక్రోమికం 6, లేక హీపార్సల్ఫ 6 (Kali Bich 6 or Hepar Sulph 6):— గొంతుపూత, చెవియందు ధ్వనియున్న నేదోయొక దానిని వాడవలయును.

లాచెసిస్ 6 (Lachesis 6):— నములుచున్నప్పుడు చెవియందు నొప్పి కలుగుచున్న దీనిని వాడవలయును.

కాప్సికం 6, 30 (Caps. 6, 30):—చెవినుండి రక్తము చీము కలియుచు స్రవించుచున్న రోజుకు 4 మో॥నీయవలెను.

ఛమోమిల్లా 6, 30 (Chamomilla 6, 30):— చంటి పిల్లలకు చీము పోటు కలిగి, వేడి పదార్థములుగాని వేడిగా నుండు సమయమందుగాని బాధహెచ్చుచు, తీపులు మొదలగునవియున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

హీపార్ సల్ఫ 6 (Hepar Sulph. 6):— రస సంబంధమగు నౌషధములు సేవించుటవలన చెవియందు కురుపు కలిగి, చిట్లి చీముగాని రక్తముగాని స్రవించుచున్న రోజుకు 4 మో॥ ల నీయవలెను.

మెర్క్యూరియస్ కరోసివస్ 30 (Mer cor. 30):— జలుబువలన ముక్కునుండి చెవినుండి కారుచు, అకస్మాత్తుగా నాగుటచే కలిగిన చెముడునకు రోజుకు 4 మో॥ నీయవలెను.

ఆసిడ్ ఫాసు 6, 30 (Acid Phos. 6, 30):— నరముల బలహీనతచే కలిగిన చెముడు అనగా సన్నిపాత,

సూతికాజ్వరములు నెమ్మదించి నీరసముగానుండి కొద్ది చెముడు యున్న దీనిని వాడవలయును. దీనివలన 2 రోజులలో సుగుణము లేనిచో చైనా 6 (China 6) ను రోజుకు 4 మో॥ లు వాడవలయును.

N. B. చెవి బాధలకు అనగా పోటునకు, చీమునకు రక్తమునకు ముల్లిన్ ఆయిల్ ను (Mullen Oil.) చెవియందు 2 చుక్కలు వేయుచు దూదిని మూతగా నుంచవలెను. (ఈ వ్యాధులకిది బాగుగ పనిచేయును.)

22. <u>పళ్లజబ్బులు.</u> (Diseases of the Teeth).

మెర్క్యూరియస్ వివస్ 6,30 (Mer. Vivus 6,30):- ముసలివారలకు పన్నులు కదలుచు నొప్పి కలిగినను, చల్లని నీళ్లు త్రాగుచున్నప్పుడుగాని, పుక్కిలించినప్పుడుగాని బాధ హెచ్చుగానుండినను నోరు వాసనగానుండి, చిగుళ్ళనుండి రక్తముగాని చీముగాని కారుచున్నను దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను. దీనివలన సుగుణము కనబడనిచో లాచెసెస్ 30 (Lachesis 30) ను వాడవలయును.

బెల్లడోన 3, 6, 30 (Bell. 3, 6, 30):— చిగుళ్లు వేడిగానుండి రాత్రియందు యెక్కువ పోటుగానున్న గంటకొక మోతాదు నీయవలెను.



ఛమోమిల్లా 6, 12 (Chamomilla 6, 12):- వేడి పదార్థములవలన తీపు హెచ్చుగానుండిన గంటకొక మో॥ నీయవలెను.

కాఫియక్రూడ 3, 30 (Coffea cruda 3, 30):— చల్లని నీళ్లు పుక్కిలించుటవలని యుపశాంతిగానున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాల్కేరియ కార్బ 6 (Cal. carb. 6):— చల్లనిగాలి వలన నొప్పి కలిగిన దీనిని వాడవలెను. దీనివలన సుగుణము లేనిచో డల్కెమీర 30 ను వాడవలయుచు.

సల్ఫర్ 30 (Sulph. 30):— ఆగిఆగివచ్చు పోటు తీపునకు నిది పనిచేయును. దీని వలన సుగుణము లేనిచో మాగ్నిషియాఫాసు 3, 6 (Mag. Phos 3, 6) ను చంచా వేడి నీటియందు నొకమాత్రవేసి కరిగిన తరువాత డోసుగా నీయవలెను. నొప్పి యెక్కువగానున్న 10 నిమిషముల కొక మోతాదు పుచ్చుకొనవలయును.

క్రియోసోటం 3, 12 (Kreosote 3, 12):— పళ్లు నడివయసునందే కదలుచు, చిగుళ్లు నల్లబడుచున్న దీనిని రోజుకు 4 మో॥ ల నీయవలెను.

సైలీషియ 30 (Silicea 30):— చిగుళ్ళయందు కురుపులు లేచుచు మానుచున్న దీనిని రెండుమాసములు సేవించవలయును. రోజుకు 4 మోతాదులు పుచ్చుకొనేది.

ప్లాంటాగో 3, 6 (Plantago 3, 6):— పళ్ళనొప్పుల కిది ప్రధానౌషధమైయున్నది. యేవిధమైన నొప్పులను, తీపు ననుకూడనిది తగ్గించును.

N. B: చిగురు యుబ్బరించి నొప్పి, తీపుయున్న రెక్కి పైను స్పిరిట్సునుగాని రూబిసిస్ క్యాంఫరునుగాని దూదినందు ముంచి చిగురుమీద నుంచవలసినది.

## 23. కండ్లబాధలు. (Diseases of the Eye.)

సక్కస్ సెనిరేరియ మెరిటిమా (Succuss Cenireria-meritima):— ను పాపయందు పువ్వు, పొరకలిగిన రోజుకు 2 సార్లు తడవకొకచుక్క చొప్పున 4, 3 మాసములు కంటి యందు వేసిన తప్పక కుదురును. కాల్ కేరియఫ్లోరాట 3, 12 (Cal. Flo. 3, 12) రోజుకు 4 మోతాదులను వాడుచుండ వలయును. పైమందును కంటియందు వేయుచు లోపలికి తిను ఔషధమువలన మాసమురోజులలో సుగుణము లేనిచో కెనబస్ ఇండిక 3, 30 (Can. Ind. 3, 30) ఫ్లోరిక్ ఆడ్సి 6 (Acid Floric 6) ను రోజుకు 4 మోతాదుల నీయవలెను.

బెల్లడోన 6,30 (Bella 6, 30):— నొప్పి, ఎఱుపు, వాపుకలిగి, వెల్తురును చూడనీయకయున్న రోజుకు 4 మో॥ నీయవలెను.



అర్నిక 3, 30 (Arnica 3, 30):- కన్నులలో మంటలు కలిగి నీరుకారుచున్న దీనిని వాడవలయును.

బెల్లడోనా 6 (Belladona 6):— అర్నికా 3, 30 (Arnica 3, 30) వలన సుగుణము లేనిచో, పల్సటిల్లా 30, (Puls 30) సల్ఫర్ 30 (Sulphur 30) సైలీషియ 30 (Silicea 30) కాల్ కేరియ కార్బ 3,12 (Cal. Carb 3, 12) గుణగతములనుబట్టి రోజుకు 4 మో॥ నీయవలెను.

అకోనైటు 6 (Aconite 6):— చల్లనిగాలివలన కను రెప్పలుబ్బరించిన దీనిని వాడవలయును. కండ్లకలకవలని కన్నులుబ్బరించి సంచీలవలెనుండిన ఎపిస్ 30 (Apis 30) ను వాడవలయును.

రుహస్టాక్సు 6,30 (Rhus Tox 6,30):—వాపుతో నీరుకారుచున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను. నీరెక్కువగా కారుచున్న యుఫ్రేషియ Q ను ఒక ఔన్సు ఆవిరి నీటి యందు 10 చుక్కలను కలిపి సీసాలో జాగ్రత్తపరుచుచు, వాడబోవునప్పుడు సీసాను కుదిపి కంటియందు రోజుకు 3 మార్లు వేయుచు యుఫ్రేషియ 3,12 (Euphrasia 3,12) లను రోజుకు 4 మో॥లను గూడ నీయవలయును. దీనివలన నీరు తగ్గనియెడల అర్నికా (Arnica) ను పై విధముగా వాడవలెను.

మెర్క్యూరియస్‌కరోసివస్ 6 (Mer-Cor 6):— కండ్ల పుసులు, ఉదయమున లేచునప్పటికి కండ్లు అంటుకొనుచుండిన దీనిని వాడవలయును. దీనివలన సుగుణము లేనిచో అర్జెంటం నైట్రికం 6 (Arg. Nit 6) ను రోజుకు 4 మో॥ నీయవలెను.

యాక్టియరేసిమోాస 3 (Actaea Racimosa 3) :— కన్నులు విస్తారముగ దృష్టియుంచి చూచుటవలన నొప్పి కలిగిన దీనిని వాడవలయును. ఎక్కువగా చూచుటవలన అలికినట్లుగా కనుబడుచుండిన రూటగ్రావోలెన్సు 6 Ruta. Gravolens 6) ను రోజుకు 4 మో॥ల నీయవలెను.

గ్రాఫిటిస్ 6 (GraPhites 6):— కనుకొలికి వాచియుండి దురదగానుండిన దీనిని వాడవలయును. అర్జెంటం నైట్రికం Q ( Arg. Nit Q ) ను వకఔన్సు ఆవిరినీటియందు 10 చుక్కలను వేశి జాగ్రత్తపరుచుచు కంటిలో వేయుచుండవలయును. కండ్లకలకను రాకుండ కాపాడుకొనుటకు అర్జెంటంనైట్రికం 30 (Arg. Nit 30) ను రోజుకు 3 మో॥ల నుపయోగించవలసినది.

కండ్లు మంటలుగానుండిన బెల్లడోన 4 (Bella 3):— అర్సెనిక్ 6 (Ars 6) సల్ఫర్ 30 (Sulph. 30) లను వక ఔషధమువలన 1,2 రోజులలో సుగుణము లేనిచో మరియొక ఔషధమును మార్చుచుండవలెను.



జెల్‌సీమియం 3,6 (Gelse. 3,6):— కనురెప్పలు బరువుగానుండి తెరుచుట కష్టముగానున్న దీనిని వాడవలయును.

కనుగ్రుడ్లు ప్రయత్నము లేకయే తిరుగుచుండిన ఎగేరికస్ 6 ను (Agricus 6) పల్సటిల్లా 3,30 ను (Puls. 3,30) రోజుకు 4 మో॥ చొప్పున 3,4 మాసములు సేవించవలెను.

కండ్లయందు యిసుగ యుండునట్లుగా మెరమెరలాడుచుండిన సల్ఫర్ 30 ను (Sulph. 30) పల్సటిల్లా 3,30 ను (Puls 3, 30) రోజుకు 4 మో॥ల చొప్పున నొక ఔషధము పనిచేయనిచో మరియొక దానిని మార్చవలెను.

అర్సెనిక్ 3,30 (Ars. 3,30):—కండ్లనుండి వేడిగా నీరు కారుచుండిన దీనిని వాడవలయును.

కనుగ్రుడ్లు నొప్పిగానుండిన నాట్రంమూర్ 12 ను (Nat. Mur. 12) బ్రయోనియ 6 ను (Bry. 6) హీపార్‌సల్ఫ 6 ను (Hepar Sulph 6) బెల్లడోన 3, 12 ను (Bell. 3.12) వాడుచుండవలయును.

కనుగ్రుడ్లు అమర్చియుండు గుంట, కన్ను, పార్శ్వపు నొప్పులవలన నొప్పిగానున్న శాంగ్యునేరియ 30 (Sanguneria 30) అర్సెనిక్ 30 (Ars. 30) జెల్సిమియం 6,30 (Gelse, 6,30) స్పిజెలియ6 (Spigelia 6)లను వక దానివలన సుగుణము కనుబడనిచో మరియొక దానిని వాడవలెను. బిగ

దీయుచున్నట్లినొప్పి లేక లాగుచున్నట్లినొప్పికలిగిన కాస్టికం 30 (Caust. 30) ఆసిడ్ ఫాసు 6 (Acid Phos 6) క్రోటన్ 6 (Croton 6) లను గుణము కనబడనిచో మరియొక దానిని మార్చుచుండవలెను. పోటుచున్నట్లి నొప్పికలుగుచున్న బ్రయోనియ 6 (Bry. 6) మాగ్నీషియాఫాసు 6 (Mag. Phos) 6) లైకపోడియం 6,12 (Lycopodium 6,12) లను వాడవలయును.

వెలుతురును, ఎండను చూడలేకయుండిన బొత్రాప్సు 6 (Bothrops 6) సైలీషియ 6 (Silicea 6) ఫాస్పరస్ 6 (Phos 6) సల్ఫ్యూరిక్ ఆసిడ్ 6 [Acid Sulph 6) బెల్లడోన 30 (Belladona 30) ను వకఔషధము పనిచేయనిచో మరియొక దానిని వాడవలయును.

అల్యూమిన 6 (Allumina 6) :— ఏకారణమువలన నైనను మెల్లకన్ను కలిగిన దీనిని రోజుకు 4 మో॥ల సీయవలెను. దీర్ఘకాలమునుండియున్న కొన్నిమాసములు సేవించవలెను జంతువాతంవలన మెల్లకన్ను కలిగిన స్పిజెలియ 3ను (Spigelia 3) గాని సినా 3 ను (Cina 3) గాని వాడవలయును. సినా, స్పిజెలియవల్ల ప్రయోజనము లేనిచో బెల్లడోన 3, 6 (Belladona 3, 6) హైసామస్ 30 (Hyos 30) జెల్సీమియం 6 (Gelsemium 6) సిక్లమెన్ 6 (Cyclamen6)



స్ట్రామోనియం 3, 6 (Stram 3, 6) లను పరిస్థితులనుబట్టి వాడవలెను.

రేజీకటి కలిగిన బెల్లడోన 3,30 (Bell. 3,30) నక్సువామిక 30 (Nux. Vom. 30) ఫిసోస్టిగ్మా 3,6 (Phisostigma 3,6) లను లక్షణములనుబట్టి రోజుకు 4మో॥సీయవలెను.

దగ్గరచూపు కనుబడకయున్న ఫాస్పరస్30 (Phos 30) కాస్టికం 6,30 (Caust. 6,30) టబాకం 6 (Tobaccum 6) లను వకఔషధమువలన ప్రయోజనము లేనిచో మరియొక ఔషధమును వాడవలయును. కండ్లు అలికినట్లుగాయున్న నివి పనిచేయును.

ప్రతివస్తువు పచ్చగా కనుబడుచుండిన శాంటోనైను I× (Trit) భస్మమును రోజుకు 3 మో॥ల సీయవలెను.

చదువుటవలన అలసటజెందినట్లుండి చదువలేకయున్న జబొరాండి 3 (Jaborandi 3) నాట్రంఆర్సు 3, 6 (Nat. Ars. 3. 6) లను పరిస్థితులనుబట్టి వాడవలయును.

చదువుచున్నప్పుడు అక్షరములు పరుగెత్తుచున్నట్లుగా గాని అలికినట్లుగాగాని యుండిన నాట్రంముర్ 3, 30 (Nat. Mur 3, 30) సికూట 3, 30 (Cicuta 3, 30) లను నొక దానివలన ప్రయోజనము లేనిచో మరియొక దానిని వాడవలయును.

## 24. శూలనొప్పి. (Colic.)

కోలసైంథిస్ 6, 30 (Colocy6, 30):— బొడ్డుచుట్టు ప్రక్కలభాగమున మెక్కువగా నొప్పకలిగి నొక్కుచుండుటవలని వుపశాంతిగా నుండుట, మలబద్ధకముయున్న లైకపోడియం 30 (LycoPodium 30) ను గూడ మార్చుచు నొకదానివెంట నొకదానిని 15 నిమిషములకొకమారు మోతాదు నిచ్చుచుండవలెను.

నక్సువామిక 30 (Nux. Vom. 30)— కడుపుబ్బరము, గర్భము కండెలుగట్టినట్టుగను బిగతీయుచున్నట్టుగను యుండి, మలబద్ధము మూత్రాశమున నొప్పి కలిగిన ప్రీతి ½ గంటకొక మోతాదు నీయవలెను.

ఛమోమిల్లా 3, 12 (Chamomilla 3, 12):—బొడ్డుచుట్టు ప్రక్కలిభాగమునందు నొప్పి, విరేచనములు రాత్రియందెక్కువగుట, చంటిబిడ్డలకు పల్లు రాబోవు నప్పుడు నొప్పితో విరేచనములు, కడుపుబ్బరముయున్న దీనిని గంటకొకమోతాదు నీయవలెను. దీనివలన సుగుణము లేనిచో మాగ్నీషియాఫాసు 3, 12 (Mag. Phos 3, 12) ను వక ఔన్సు వేడినీటియందు 12–15 మాత్రలవరకు వేసి కరిగిన తరువాత కుదుపుచు తడవకొక చంచా మోతాదు చొప్పున 10 నిమిషములకొకమారు నీయవలెను.



డయస్కోరియ 3, 30 (Dios. 3, 30):— కోలసైంథిస్ (Colocynthis) వలన ప్రయోజనము లేనిచో దీనిని వాడవలయును.

ఐరిస్‌వర్సు 3, 6 (Iris Vers 3, 6):— ఎక్కువగా కడుపుబ్బరము, గర్భము పైభాగమున మంట పసరు వాంతియుండిన దీనిని ½ గంటకొక మోతాదు నీయవలెను.

వెరాట్రంఆల్బ 6, 30 (Verat. Alb 6, 30):—రాత్రియందునగాని, భోజనానంతరమునగాని నొప్పితో యుబ్బరము గుడబిడలాడుట, ముఖము కాలుసేతులు చల్లదనముయున్న ½ గంటకొక మోతాదు నీయవలెను.

అచ్చుఆఫీసునందు పనిచేయు వారలకును, సత్తుపని చేయువారలకును గోటియందు సత్తు వుండుటవలన ఆహారముతో లోనికిప్రవేశించి కడుపు నొప్పికలిగిన, ఓపియం 3, 30 (Opium 3, 30) అల్యూమెన్ 3, 30 (Allumen 3, 30) ప్లాటినా 6 (Platina 6) ను వకదానివెంట నొకదానిని సుగుణముకనబడనిచో మార్చుచుండవలెను.

ఆహారము :— నొప్పి యుండునంతసేపును ఆహారము నీయరాదు. దాహము కావలసియున్న త్రాగవచ్చును. జావనుగాని, ఫలాదులనుగాని లేక పాలయందు నిమ్మరసమునుపిండి, విరిగిన తరువాత, [illegible] వడబోసి స్వల్పముగ నిచ్చుట మంచిది.

## 25. తలనొప్పి. (Head-ache.)

ఆకోనైటు 6, 30 (Aconite 6, 30):—జలుబుచేయుటవలనగాని, వేడిచేయుట వలనగాని తలకు రక్తమెక్కి వక పార్శ్వమున నొప్పి కలిగియుండుట, వంగినను, కదల్చినను నొప్పి యెక్కువగానున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

బెల్లడోన 3, 30 (Bell. 3, 30) :— తలకు రక్తాధిక్యమువలననొప్పితో ముఖము, కన్నులు ఎఱ్ఱబారియుండుట, నొప్పి వెంటవెంటనే వచ్చి తగ్గుచుండినను, వెల్తురు వలనను, చప్పుడు వలనను బాధహెచ్చినను దీనిని రోజకు 6 మో॥ల నీయవలెను.

మెల్లిలోటస్ 3,30 (Mellilotus 3,30 :—నొప్పియెక్కువగానుండి తలగోడకు కొట్టుకొనుచు, వెఱ్ఱిగాప్రయత్నము చేయుచుండి బాధతగ్గుననితలచుట ; నొప్పితలయందుగాని, గుండెలయందుగాని, గర్భమునందుగాని కలిగినను దీనిని వాడవచ్చును. ½ గంటకొక మోతాదు నీయవలెను.

జెల్సీమియం 3, 6 (Gelse 3,6):— వాదుగానుండి నొప్పితో దృష్టిచీకటులు పడినట్టుగా కనుబడుచున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఇగ్నీషియ 6,30 (Ignetia 6,30):—దుఃఖమువలనగాని, సంతోషమువలనగాని, కలిగిన దీనిని గంటకొక మో॥ నీయవలెను.



ఆసిడ్ నైట్రిక్ 6,30 (Acid. Nit 6,30):—తలవెనుక భాగమున నొప్పిగాయున్న దీనిని వాడవలయును.

ఆర్నికా 3, 30 (Arnica 3,30):— శ్రమపడుటవలన కలిగిన గంటకొక మోతాదు నీయవలెను.

బ్రయోనియ 6,30 (Bry. 6,30):— నొప్పిగానుండి తలబరువుగానుండుట, నొసటియందు పగులగొట్టుచున్నట్లుగా నొప్పికలిగి పిసుకుటవలన శాంతిగానుండుట, పసరువాంతి, రక్తపిత్తమువలన తలనొప్పి, భోజనానంతరమునను, కదలికవలనను బాధహెచ్చి, మేహవాతతలనొప్పి అయివున్న గంటకొక మోతాదు నీయవలెను.

కాల్కేరియకార్బ 30 (Cal. Carb 30):— ముఖ్యముగా పనిపాటలుచేయువారికి వక పార్శ్వపునొప్పి కలిగి, రాత్రియందు శరీరమునకు పైభాగమున చెమటయున్న దీనిని వాడవలయును.

చైనా 6, 30 (China 6,30) :— చెవియందుధ్వని, నీరసము, తరుచుగా ఆవలింతలు నొప్పియున్న దీనిని వాడవలయును.

లిలియంటిగ్ 6,12 (Lilium-Tig 6, 12):— రెండు పార్శ్వములందును తల పైభాగముననునొప్పి ; లేక యెడమ పార్శ్వమునుండి తలవెనుకభాగమువరకును నొప్పికలిగి పిసు

కుటవలన హృదయశాంతి; లేక హృదయమున విరేచనములగుచు
తలతిరుగుడు లేక బరువుగానుండుట; లేక ఋతురక్తము
శాకపోవుటవలన తలనొప్పికల్గుట మొదలగు నీపైనుదహరించి
యున్న నొప్పులకును, చల్లనిగాలికి యెక్కువగానుండి, సూ
ర్యాస్తమయమైన వెంటనే తగ్గునొప్పులకును దీనిని వాడవలెను.

నక్సువామిక 30 (Nux-vom. 30):— సుకుమారుల
కును, బరువు పదార్థములు భుజించువారికిని కలిగిన దీనిని
వాడవలయును.

పల్సటిల్లా 30 (Puls. 30):— బరువు పదార్థముల
వలనను, ఋతుస్రావమాగుటవలనను నొప్పికల్గుట చెవి
వెనుకభాగమున మేకుతో పొడుచునట్లుగా నొప్పియున్న దీనిని
గంటకొక మోతాదు నీయవలెను.

ఆసిడ్ ఫాసు 6,30 (Acid phos 6,30):— ఎక్కువ
సంభోగమువలన నరములబలహీనతతో జ్ఞాపకశక్తి తగ్గుచుం
డుట, బలహీనతవలన మాట్లవినబడక, కొద్దిగా కనుదృష్టితగ్గి
తలనొప్పియున్న దీనిని వాడవలెను.

శెపియ 6,30 (Sepia 6,30):— తల బరువుగానుండి,
నొప్పితోవమనము వచ్చినట్లుండుటగాని, లేక వాంతిగాని,
యగుట; కనుబొమలు నొప్పి, విరేచనబద్ధము, ఋతుస్రావ
మెక్కువగ నగుటవలనగాని, ఆగుటవలనగాని, నొప్పికలిగిన
దీనిని వాడవలయును.



సిమిసిఫ్యూగ 3,6 (Cimicifuga 3,6):— నరముల
నిస్సత్తువవలనగాని, ఋతుసంబంధమగు జబ్బులవలనగాని,
తలనొప్పితో కనుగ్రుడ్లుకూడ నొప్పిగానుండుట. లేక నొసటి
నుండి నొప్పి మెడవరకు వ్యాపించియుండుట, తలవంచినను
యెత్తినను నొప్పి యెక్కువగానుండుట, నిద్రపట్టకయుండుట,
బడిపిల్లలకు విస్తారముగ చదువుటవలన తలనొప్పి కలిగినను
దీనిని వాడవలయును.

ఐరిస్‌వర్సు 3,6 (Iris Vers 3,6):— వికారముతోను
లేక వమనముతోను కుడిపార్శ్వమున నొప్పియుండి, పిత్తా
శయ జబ్బువలనగాని లేక ఎక్కువగా చదువుటవలనగాని
కలిగిన దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.

కలిబైక్రోమికం 6 (Kali Bich. 6):— తలనొప్పితో
కుడికంటియందు నొప్పియున్న దీనిని వాడవలయును.

ఛియరాంథస్‌వర్జీనిక 1,3 (Cheiranthus Vur. 1,3):-
పైత్యాధిక్యముగలవారలకు వికారముతోనొప్పి, ఆగుచు,
మరలమరల వచ్చుచుండిన గంటకొక మోతాదునీయవలెను.

స్పిజెలియ 3, 6 (Spigelia 3, 6):— నొప్పి యుద
యమున ప్రారంభమై ప్రొద్దు యెక్కినకొలదిని హెచ్చుచు
ప్రొద్దు వాటవాలిన కొలదిని తగ్గుచుండిన రోజుకు 4 మో॥ల
నీయవలెను.

గ్లోనోయిన్ 200 (Glonoine 200):— ఎండలోను నిప్పువద్దను పనిచేయుటవలన కలిగిన గంటకొక మోతాదు నీయవలెను.

N. B. ఈమందును తక్కువ సత్తువగలదానికి ప్రతి దినమును వాడుచుండిన, భయంకరమైన తలపోట్లు, నొప్పులు కలుగునట్లుగా చేయును.

సల్ఫర్ 6, 30 (Sulphur 6, 30)-- చెవి ప్రక్కనను నొసటియందును నొప్పికల్గుట, తల పైభాగమున వేడిగానుండుట, ఉదయమున లేచిన తరువాత విరేచనములగుచున్న దీనిని వాడవలెను.

దీర్ఘకాలపు తలనొప్పులైయున్న సల్ఫర్ (Sulph.) కాల్కేరియకార్బ (Cal carb) నాట్రంమూర్ (Nat. Mur) ఛినినంసల్ఫ (Chinin Sulph) శెపియ (Sepia) కెలిబైక్రోమికం (Kali Bichr) కెలికార్బ (Kali carb) శాంగ్వ్యనేరియ (Sanguneria) నక్సువామిక (Nux, vom) ఆర్సెనిక్ ఆల్బ (Ars Alb) జింకంమెటాలికం (Zincum Met) కాక్యులస్ (Cocculus) మొదలగు ఔషధములను, 6-30 సత్తువరకు వాడవలయును.



## 26. మేహవాతపునొప్పులు. (Rheumatism.)

అకోనైటు 3,6 (Acon. 3,6):— జబ్బుప్రారంభమున కండరములుగాని లేక కీళ్లుగాని యెఱ్ఱగానుండి వాచి తాకుట వలన నొప్పినికల్గించుట, జ్వరమెక్కువగానుండి అవిశ్రాంతి, ఆవేదన, ఎఱ్ఱనిమూత్రము, సీతాకాలపుచల్లనిగాలివలన జ్వరముతో కీళ్ళనొప్పులున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.

కాలిఫాసు 3,6 (Kali Phos 3,6):— దీనిని కాలికపు దీర్ఘరోగములకు వాడవచ్చును. నొప్పులు, లేచునప్పుడధికమై నడుచుచున్న కొలదిని తగ్గుచుండిన రోజుకు 4 మో॥ నీయవలెను.

కాల్కేరియఫాసు 3, 6 (Cal. Phos 3,6):— తిమ్మురులతోపాటు మోకాలియందు నీరుండి, శరీరమునందలి రక్తము శుభ్రముగానుండినను బలముచేయుటకు దీనిని వాడవలెను.

రుహస్టాక్సు 30 (Rhus Tox 30):— నొప్పులు విశ్రాంతి సమయమునను చల్లనిగాలికిని హెచ్చుగానుండి కదలికవలన శాంతిగానున్న దీనిని వాడవలయును. నొప్పులు కాలికముగనున్నను దీర్ఘకాలమునుండియున్నను రోజుకు 4 మో॥ నిచ్చేది. నడుమునొప్పులు రాత్రియందెక్కువగా కండెలుకట్టినట్లుగానుండి పతుండుటవలన యెక్కువబాధగానున్న దీనిని వాడవలయును. జ్వరముండియు దీనివలన సుగుణములేనిచో అకోనైటును (Acon) వాడవలెను.

ఆసిడ్ బెంజాయిక్ 6 (Acid Ben. 6):—తాకుటవలన గాని నొక్కుటవలనగాని యెక్కువ నొప్పిగానుండి, కీళ్లువాచి యెఱుపుగానున్న దీనిని రోజుకు 4 మో॥ల ఈయవలెను.

సిమిసిఫ్యూగ 3, 12 (Cimicifuga 3, 12):—కండర ములయందు నెప్పులున్న రోజుకు 6 మో॥ల నీయవలెను.

కాల్మియలాట్ 3, 6 (Kalmia Lat 3, 6):— నొప్పులు పైభాగమున ప్రారంభమై, క్రిందుకీళ్ళకు దిగుచుండు స్వభావముండిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

లెడం 6 (Ledum 6):—కాలికముగగాని దీర్ఘకాలము నుండిగాని నొప్పులుండి, క్రిందుకీళ్లనుండి పైభాగపుకీళ్ళకు నొప్పులెగబాకు స్వభావమున్న రోజుకు 4 మో॥ల నీయ వలెను.

రూటగ్రావొలెన్సు 3,12 (Ruta Gravolens 3,12):- నడుమునొప్పులలో దీనిని వాడవలయును.

లాచ్నాన్థిస్ 3,30 (Lachnanthis 3,30):— మెడ నొప్పిగానుండుటవలన కుడిభాగమునకు వంగియెక్కువ చెమట యున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

బెల్లడోన Q, 6 (Belladona Q, 6):— నెప్పులు కలుగుచు అతిశీఘ్రముగ ఔషధసేవలేకుండగనే కనుబడక యుండు స్వభావముండిన రోజుకు 4 మో॥ల నీయవలెను.



సిమిసిఫ్యూగ (Cimicifuga) బ్రయోనియ (Bryonia):- ఈ రెండును మెడనొప్పులకు ప్రధానౌషధములైయున్నవి. నొప్పిగానుండుచోట్ల నొక్కినచో బాధ తగ్గినట్లుగానున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

మాగ్నీషియాఫాసు 3,12 (Mag. Phos 3,12) :— కీళ్లనొప్పులు చురుకు చురుకు మనుచుగాని, పొడుచుచున్న ట్లుగాగాని యుండిన దీనిని వక ఔన్సు వేడినీటియందు 12 మాత్రలనువేసి కరిగిన తరువాత, తడవకొక చెంచాడోసు చొప్పున నీయవలెను. ఈ విధముగ కాలికపువ్యాధులందు డోసును లేక మోతాదును నీయవలెను. దీర్ఘకాలపువ్యాధు లందు రోజుకు 4 మో॥ నీయవలెను.

శాంగ్యునేరియ 6 (Sanguneria 6):— చేతుల కండ రములయందు నొప్పులుండి, పనిచేయుటకుగాని, ఎత్తుటకు గాని కష్టముగానుండి కుడిపైపునందలి మెడకండరములు నొప్పులుయున్న దీనిని వాడవలెను. [ఇది ముఖ్యముగ కుడి పార్శ్వపుకండరముల నెప్పులకు బాగుగ పనిచేయును.]

రానన్క్యులస్ బల్బోజ3, 30 (Rananculus Bul-bosa 3,30):— మెడ నెప్పులకును, నడుము నొప్పులకును, ఎదురురొమ్ములందు ఎముకలవిూది కండరములలో నొప్పు లు కలిగి, కదలికవలనను, దగ్గుటవలనను, నిట్టూర్పులవలనను బాధహెచ్చిన రోజుకు 6 మో॥ల నీయవలెను.

అర్నికా 30 Arinica 30:— దీనిని జ్వరముండినను వాడవచ్చును. రుహస్‌టాక్సు (Rhus Tox) ఆకోనైటు (Aconite) వలన ప్రయోజనములేనిచో దీనిని వాడవలయును. దెబ్బలుతగులుటచేతను, ఎత్తుప్రదేశమునుండి క్రిందపడుటచేతను నొప్పులు కలిగిన దీనిని రోజుకు 4 మో॥ నియవలెను. సన్నిపాత, సూతికాజ్వరములందు చాలరోజులు పరుండుటవలన ఒడలు నొప్పులున్న దీనిని వాడవలెను.

యాన్‌టిమోనియం టార్‌టారికం 3, 12 (Ant. Tar. 3,12):— భోజనానంతరమునగాని, ఆలోచనానంతరమునగాని లేచునప్పుడు నొప్పులుకలిగి, చల్లనిచెమట, వాంతిగాని, లేక వికారముగానియున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

సల్ఫర్ 30 (Sulphur 30) :— వ్యాధి దీర్ఘకాలమునుండియున్న వారమునకొక మోతాదు నిచ్చుచు గుణగతములనుబట్టి తదితర ఔషధములను వాడుటమంచిది. ఈ ఔషధమును అతి పెద్ద సత్తువనుగాని, అతిచిన్న సత్తువనుగాని వాడరాదు. 30 వ సత్తువనే వాడుచుండవలెను.

బెర్‌బెరిస్ Q, 12 (Berberis Q, 12):— ఎదురురొమ్ములయందలి కండరములు నొప్పిగానుండి, పిత్తాశమున నొప్పి, మూత్రాశయములో రాళ్లువుండుటవలన బాధయున్న రోజుకు 6 మో॥ నీయవలెను.



అమ్మోనియంమ్యుర్ 3 (Ammonium Mur 3) :— కూర్చుండబోవునప్పుడు తొంటియందునొప్పి నిద్రించునప్పుడును, నడుచునప్పుడును, నొప్పి కనుబడకయుండి, శరీర పైభాగము వేడిగానున్నను దీనిని వాడవలయును.

గ్నాఫలియం 3,30 (Gnaphalium 3,30) :— తొంటి కొంతసేపు నమలుచున్నట్లుగను, కొంతసేపు తిమ్మురులుగను యున్న రోజుకు 6 మో॥ నీయవలెను.

కార్బోనియంసల్ఫ 3,12 (Carbonium Sulph 3,12):- నొప్పులు కాలికముగగాని, దీర్ఘకాలమునుండిగాని, కలిగియుండి, తదితర ఔషధములవలన సుగుణములేనిచో దీనిని వాడవలయును.

నాట్రంసల్ఫ 3, 12 (Nat. S. 3,12):— లేచుచున్నప్పుడు తొంటియందునొప్పి; పైత్యాధిక్యతగల మనుజులకు కాలికముగగాని, దీర్ఘకాలమునుండిగానియున్న నొప్పులకు దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాలిహైడ్రియాటికం (Kali Hydro) రోడోడెన్‌డ్రన్ (Rhododendron) గల్‌థీరియ (Gultheria) యుర్టికయురెన్సు (Urtica-urens) డల్‌కెమెర (Dulc) విస్కం ఆల్బ (Viscum Alb) 3-30 లను గూడ గుణగతములనుబట్టి వాడవలయును.

N. B:- ఈ వ్యాధివలన బాధనొందువారలు కర్పూర తైలమును నెప్పియున్న భాగములందు పూయుచు, పైనగుడ్డ కప్పి, చల్లనిగాలిని తగులకుండచేయవలెను. దారుణపదార్థములను తీపిపదార్థములను పూర్తిగ మానివేయవలెను.

## 27. ఎక్కిళ్లు. (Hiccup).

జిన్‌సెన్‌గు Q. 3 (Ginseng Q. 3) :— ఎక్కిళ్ళ కిది ప్రధానౌషధమైయున్నది ఏకారణమువలన కలిగినను నీ ఔషధమును సేవించినవెంటనే తగ్గించును. ఒకమందు చుక్కను ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు కలిపి ప్రతి 15 నిమిషములకొకమారు మోతాదుగా నీయవలెను. దీని వలన సుగుణములేనిచో నక్సువామిక 3, 30 (Nux Vom. 3,30) ను పై విధముగా వాడవలయును. భోజన ఫలహారములకు పూర్వమువచ్చినను (Nux Vom.) నక్సు వామికాను వాడుటమంచిది.

సిక్లమెన్ 3 (Cyclamen 3) కుప్రంమెటాలికం 6 (Cup. Met. 6) అర్సెనిక్ 6 (Arsenic 6):—ఉచ్ఛ్వాస నిశ్వాసములకు కష్టముగనుండి, వికారముగాని లేక వమనముగాని నగుచు, దాహము త్రాగినవెంటనే ఎక్కిళ్ళు తగ్గుస్వభావముండిన, పైమూడుమందులలో నేదో యొక దానిని 15 నిమిషములకొక మోతాదు నీయవలెను.



కోక్యులస్ 6 (Cocculus 6) :— వాంతి, ఎక్కిళ్ళు కలుగుచున్నప్పుడు గొంతుయందు నెప్పియున్న దీనిని వాడవలయును.

ఇగ్నిషియ 6,30 (Ignetia 6,30) :—భోజనముచేయుచున్నప్పుడును, దాహముత్రాగుచున్నప్పుడును, చుట్టత్రాగుచున్నప్పుడును వచ్చుచుండిన రోజుకు 6 మో॥ నీయవలెను.

నాట్రంమ్యుర్ 6 Nat. Mur 6):— చలిజ్వరమున్న వారలకు ఎక్కిళ్ళు కలిగిన దీనిని రోజుకు 6మో॥ నీయవలెను.

సికూటా 6 (Cicuta 6) :— పెద్దపెద్ద ఎక్కిళ్ళు, శబ్దముతో చాలదూరము వినబడుచుండిన దీనిని వాడవలయును.

కార్బోవెజిటబిలిస్ 30 (Carbo Veg. 30) :— చదువుచున్నప్పుడును, నడుచుచున్నప్పుడును ఎక్కిళ్ళు కలిగిన దీనిని వాడవలెను.

మెర్క్యూరియస్ కరోసివస్ 6 (Mer. Cor. 6):— కొద్ది ఆహారమునుగాని, కొద్ది నీరునుగాని త్రాగుచున్నప్పుడు కలిగిన రోజుకు 6 మో॥ల నీయవలెను.

పై వానివల్ల సుగుణములేనిచో మాగ్నీషియా ఫాసు 3,12 (Magnesia phos 3, 12) ను వేడినీటియందు 12-15మాత్రల వరకు వేసి కరిగిన తరువాత 15 నిమిషముల కొక చంచా మోతాదుగా నీయవలెను.

కలరాయందు ఎక్కిళ్లుకలిగిన బెల్లడోన (Belladona) సికూట (Cicuta) హైసామస్ (Hyos) కార్బో వెజిటబిలిస్ (Carb. Veg) యాగ్నస్ కాస్టస్ (Agnus Castus) పల్సటిల్లా (Puls.) స్టాఫిశాగ్రియ (Staphy.) ఫాస్పరస్ (Phos.) ఇగ్నీషియ (Ignotia) సల్ఫర్ (Sulph.) 6-30 లనూ పరిస్థితులను బట్టి వాడవలెను.

## 28. పడిశెము. (Catarrh).

అకోనైటు 3,6 (Aconite 3,6) :— జలుబువస్తువులు భుజించుటవలన పడిశెముకలిగి, జ్వరము, ఒడలునొప్పులు, దాహము, ఆవేదనయున్న దీనిని రోజుకు 4మో॥ నీయవలెను.

స్పిరిట్సు ఆఫ్ రూబినీస్ క్యాంఫర్ (Spts of Rubini's Camhor):— కొద్దిచలి, ఉష్ణము, శరీరమును విరుచుకొనుచుండుట, కంటినుండి నీరుకారుచు మంట, వేడినిట్టూర్పు, తలనొప్పి, ఎక్కువగ దాహము, చల్లనిగాలి వల్లముక్కువెంట పడిశెము కలిగినను దీనిని ప్రారంభమున, రోజుకు 4 మో॥ల నీయవలెను.

అమ్మోనియంకాస్టు లేక కార్బ 6 (Ammo. Caust or Carb 6):— ముక్కులు బిగించియుండి శ్వాసపీల్చుటకు కష్టముగానున్న దీనిని వాడుచు మధ్యమధ్య ఆమాత్రలనే వాసన చూచుచుండవలసినది.



నక్సువామికా 30 (Nux Vom. 30):— సాయంకాలమునందును, రాత్రియందును, ముక్కులు బిగియుచున్న దీనిని వాడవలయును.

జెల్సెమియం 3, 6 (Gelse. 3, 6):— జ్వరము, ముఖము దూసుకొనివచ్చుచుండుట, చలివెన్నుముకనుండి బయలుదేరుట, దాహము, తల వేడిగానుండి నొప్పిగానుండుట కంటినుండి నీరుగారుట, తీవ్రమగు నాడి, దగ్గు, గొంతునొప్పి, బొంగురు గొంతుక, రోగి నిశ్చింతభావముగ నుండుటయున్న రోజుకు 4 మో॥ల నీయవలెను.

అర్సెనిక్ ఆల్బ 6, 30 (Ars. Alb 6, 30):—ఎక్కువ పడిశెముగానుండిపలుచగను, వేడిగనుస్రవించుచు, తుమ్ములు, ముక్కుయందు నొప్పి, ఎక్కువ నిద్రలేక బద్ధకము, కొంతసేపు ముక్కువెంట కొంతసేపు నోటివెంట, కొంతసేపు కంటినుండి నీరు కారుచున్న దీనిని వాడవలయును.

పల్సటిల్లా 30 (Puls 30):— పడిశెము పచ్చగానుండి తీగలుగను, చెవియందుపోటు, వంటికణతనొప్పి, తలబరువుగానుండుట, వేడి నిట్టూర్పు, రాత్రియందెక్కువగా పడిశెము, నోరు వాసనగానుండి రుచి తెలియకయున్న దీనిని వాడవలయును.

కాలిబైక్రోమికం 30 (Kali Bich. 30):— పడిశెము ఆగినప్పుడు ముక్కులందు తలయందు నొప్పికలిగి, తీగెలవంటి పడిశెముయుండి పల్సటిల్లా (Puls) వలన సుగుణము లేనిచో దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను.

మెర్క్యూరియస్ సాలబిలస్ 30 (Mer. Sol. 30):— ముక్కు లోపలిభాగమున పుండు; గొంతుయందును, ముక్కుయందునునొప్పి; తుమ్ములు, చిక్కని తీగలవంటి పడిశెము, వేడి చలి మారుచుండుట, కనురెప్పలు వుబ్బరముగానుండి రాత్రియందుజలుబు యెక్కువగానున్న దీనిని వాడవలయును.

## 29 దగ్గు. (Cough.)

అకోనైటు 3, 12 (Aconite 3, 12):— కొద్దిపొడి దగ్గు, రాత్రియందు యెక్కువగనుండి, చల్లని వస్తువులు భుజించుటవలన కలిగినను దీనిని వాడవచ్చును.

ఇపికాకు 30 (Ipeac 30):— వాంతియైన వెంటనే తెరలు తగ్గుచు, ఊపిరి తిత్తులయందు బరువుగానున్న దీనిని వాడవలెను.

బెల్లడోన 6, 30 (Belladona 6, 30):— దగ్గురాత్రులందు యెక్కువగనుండి గొంతుయందు దురద, ముఖము యెఱ్ఱబారి తలనొప్పియున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.



డల్కెమెరా 6, 12 (Dulc. 6, 12):— చెమ్మ ప్రదేశములందు నివసించుటచే దగ్గు కలిగి, రొమ్మునందు నొప్పియున్న దీనిని వాడవలయును.

బ్రయోనియ 6, 12 (Bry. 6, 12):— దగ్గుచున్నప్పుడు ప్రక్కటెముకలయందును, గర్భమునందును, తలయందును నొప్పికలిగిన దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

సినా 200 (Cina 200):— పొడిదగ్గు, నొక్కొకసమయమందు కళ్ళెపడుచుండుట, ముక్కులయందుదురద, జంతువాతంవలన కలిగెననితోచిన దీనిని రోజుకు 2 మో॥ల నీయవలెను.

ఎలియం శెటైవా 3, 30 (Allium Sat. 3, 30):— దీర్ఘకాలపు దగ్గుగానుండి, యెక్కువగా నురుగువంటి యుమ్మివున్న దీనిని వాడవలయును.

యంటిమోనియంటార్టారికం 30 (Ant Tar. 30):- పొడిదగ్గు, గొంతు బొంగురుబోవుట, పిల్లకూతలు, నురుగువంటికళ్ళె, భోజనానంతరం దగ్గువచ్చిన వెంటనే వాంతికలుగుచున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాల్కేరియకార్బ 6 (Cal. carb):— పరుండబోవునప్పుడు పొడిదగ్గువచ్చుచున్న దీనిని రోజుకు 6 మోతాదుల నీయవలెను.

లాచెసిస్ 6, 30 (Lach. 6, 30):— మెలికువ వచ్చుచున్నప్పుడు యెక్కువగానున్న దీనిని రోజుకు 6 మోతాదుల నీయవలెను.

శాంగ్వ్యునేరియా నైట్రేటు 6 (Sanguneria Nit. 6):— పెద్దపెద్ద దగ్గుతెరలు, ముక్కుయందు పురుగుదొలుచునట్లుగా గులగులలాడుచున్న దీనిని రోజుకు 6 మోII ల నీయవలెను.

జెల్సీమియం 6, 30. (Gelse. 6, 30):— కొద్దిదగ్గు, గొంతుయందుగాని, గుండెయందుగాని నొప్పి, బొంగురుగొంతుకగాని లేక స్వరము పూడిపోవుటగానియున్న దీనిని వాడవలయును.

ఆసిడ్ నైట్రిక్ 6, 30 (Acid Nit. 6, 30):— దీర్ఘకాలపు పొడిదగ్గు, నిస్సత్తువ, మతిమరుపు, తలనొప్పి, ఆకలి మందగించుట, భోజనానంతరం కడుపు బరువుగానుండుట, రాత్రులందు యుష్ణమెక్కువగనుండుటయున్న దీనిని రోజుకు 4 మోII ల నీయవలెను.

మేంగనం ఆసెటికం 6, 30 (Manganum Acet 6, 30):- పండుకొనిన దగ్గుతగ్గుట, బొంగురు గొంతుకయున్న దీనిని వాడవలెను.

ఆర్నికా 3, 30 (Arnica 3, 30):— దగ్గు, ఉమ్మివెంట రక్తము, గుండెయందు సూదులతో పొడచునట్లుగా



నొప్పి కలిగిన దీనిని వాడవలెను. ఉమ్మివెంట రక్తమునకు నిది పనిచేయనిచో ఇపికాకు (Ipecacu) కోక్యులస్ (Coccu lus) లనుగూడ పరిస్థితులనుబట్టి వాడవలెను.

ఆర్సెనిక్ ఆల్బ 6,30 (Ars. Alb. 6, 30):—ఉచ్ఛ్వాస నిశ్వాసములు బిగియుచు గాలిని కష్టముగా పీల్చుచుండుట, రాత్రియందు నిద్రనుండి లేచి, దగ్గినవెంటనే కొద్దిగా కళ్లెపడి బాధతగ్గినట్లుగా కనుబడుచున్న దీనిని వాడవలయును.

కాస్టికం 6,30 (Caust. 6, 30):— కళ్ళెయుండక పొడి దగ్గుగానుండి, ఒక్కొక సమయమం దుక్కిరిబిక్కిరై మాటాడలేకపోవుట, వేడిగానుండు గదులయందును, ఎండ వేడిమివలనను, వేడిపదార్థములవలనను హెచ్చి చల్లని పదార్థములచేతను, ఉదయమునను, రాత్రియందును తగ్గి, దగ్గుచున్నప్పుడు మూత్రము బట్టయందు పడుచుండిన రోజుకు 6 మోII ల నీయవలెను.

కాలిబైక్రోమికం 6, 30 (Kali. Bich. 6, 30):—కళ్లె తెల్లగా తీగలవలెగాని, పచ్చగాగాని పడుచున్న దీనిని వాడవలయును. కోకస్ కాక్టై 6, 30 (Coccus Cacti 6, 30) ను గూడ కళ్ళెబాగుగ తెగిపడుటకు దీనిని వాడవచ్చును.

స్పాంజియా 3, 12 (Spongia 3, 12):— పెద్దగా చాల దూరము వినబడునట్లుగా దగ్గుట, గుండెలయందు నొప్పి

అయోడియం 6, ఫాస్ఫరస్ 6 (Iod. 6) (Phos 6):- ఎక్కువ బలహీనతవలన కలిగిన దీనిని వాడవలయును.

జెల్సీమియం 3,12 (Gelsemium 3,12) స్త్రీల రజో సమయమందు దగ్గుత్తిక కలుగుచున్న రోజుకు 6 మో॥ల నీయవలెను.

ఇగ్నేషియ 3, 12 (Ignetia 3,12):— అపస్మారము వలనగాని, స్వవిషయ విచారములవలనగాని కలిగిన దీనిని వాడవలయును.

ఆగ్జాలిక్ ఆసిడ్ 3, ఫాస్ఫరస్ 3 (Acid oxalic 3) (Phos. 3) :— ఇవి ప్రధానౌషధములైయున్నవి. ఇవి ముఖ్యముగా పక్షవాతముయున్నవారలకు దగ్గుత్తిక కలిగిన వీనిని రోజుకు 6 మో॥ నీయవలెను.

### 31. కోరింతదగ్గు. (Whooping Cough.)

ఇది 3 వారములు మొదలు 6 నెలలవరకు యుండవచ్చును. ఇదియొక అంటువ్యాధిగాన నిది కలిగిన వెంటనే తక్కిన పిల్లలకు ఆరోగ్యరక్షణార్థమై, డ్రోసిరా 30 (Drosera 30) ను రోజుకు 3 మో॥ నీయవలెను.

పెర్టుస్సిన్ 30 (Pertusin 30):— ఈ వ్యాధికి ప్రారంభదశయందు రోజుకు 4 మో॥ నీయవలెను. అటుల వారముదినములిచ్చి సుగుణమునుబడయనిచో మెఫిటిస్ 3,6ను



2 గం॥ల కొక మోతాదు వాడవలసినది. ఇది పిల్లికూతలు యున్నను బాగుగ పనిచేయును.

డ్రోసిర 6, 30 (Drosera 6, 30):— ఉండి వుండి వచ్చు దగ్గు, వాంతి, పచ్చనికళ్లే లేక వుమ్మి, గొంతుబొంగురుపోవుట, నొప్పి, నిశరాత్రియందు దగ్గుయెక్కువయున్న రోజుకు 6 మో॥ ల నీయవలెను.

కుప్రం మెటాలికం 6, 30; కోరాలియం రుబ్రం 6,30 (Cup. Met. 6, 30; Corallium. Rub 6, 30):— తెరలు నిమిష నిమిషమునకు వచ్చుచున్న వీనినివాడి ప్రయోజనములేనిచో, మాగ్నీషియా ఫాసు 3, 12 (Mag. Phos 3,12) ను వాడవలయును.

పైవానివలన సుగుణము లేనిచో ఇపికాకు (Ipacacu) బెల్లడోన (Belladona) హీపార్ సల్ఫ (Hepar. Sulph) పల్సటిల్లా (Puls) సల్ఫర్ (Sulph) 6–30 లను వకదానివెంట నొకదానిని ప్రతిదినమును మార్చుచుండవలెను. ఇవి కోరింత దగ్గులకు ప్రధానౌషధములై యున్నవి.

### 32. ఉబ్బసము. (Asthama.)

అర్సినిక్ ఆల్బ 3, 30 (Arsenic. Alb 3, 30):— ఉచ్ఛ్వాసనిశ్వాసములు బిగియుచు గాలిపీల్చుటకు కష్టముగా నుండి, గుండెలయందు మంట, చల్లనిచెమట, ఆవేదన, అధై

ర్యముకలిగి అర్ధరాత్రమునను, విశ్రాంతిగా నున్నప్పుడును, పగలుచల్లగా నున్నప్పుడును వర్షము కురిసినతరువాతను ఎక్కువగానున్న దీనిని ప్రతి 2 గం॥లకొక మోతాదుయిచ్చేది. దగ్గువలన బాధపడునప్పుడే నీమందు నిచ్చుట మంచిది.

బాప్టీషియా 6 (Bapt 6):— నిద్రనుండి లేచి, గాలి పీల్చుటకు కష్టముగానుండి, రొమ్మునయందు బరువుగానున్న దీనిని వాడుట మంచిది. రోగి చల్లనిగాలికి యిష్టపడుచున్న దీనిని ముఖ్యముగా వాడవలయును.

వెరాట్రంఆల్బ 30 (Verat Alb 30):— అతిచల్లని చెమటలను కలిగి అధైర్యముతోనున్న దీనిని వాడవలయును.

నక్సువామిక 30 (Nux. Vom. 30):— ఉదయం 3,4 గంటలకును, భోజనానంతరమును కలుగునట్టి దగ్గులకును నిది పనిచేయును.

సల్ఫర్ 30 (Sulph 30):— దీర్ఘకాలపు వ్యాధిగానుండి ఇతరఔషధములవలన సుగుణమును బడయనప్పుడు నీమందును రోజుకు 2 మో॥ల చొప్పున వారముదినములిచ్చి 2 రోజులాగి పరిస్థితులనుబట్టి తదితర ఔషధములను వాడిన మంచి సుగుణమును బొందగలరు.

కెలిహైడ్రియాటికం లేకఅయొటం6 (Kali Hydro 6):- ముక్కులనుండి నీరుకారుచు, గాలి పీల్చుటకు కష్టముగనున్న



దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను. ఉబ్బసముతో సహా మేహాముగాని, మేహవాతపు నొప్పులుగానియున్న దీనినివాడవలెను.

ఇపికాకు 30 (Ipecacu 30):—రొమ్మునందుబరువు, అతిత్వొందరతోగూడిన ఉచ్ఛ్వాసనిశ్వాసములు, పిల్లికూతలు శరీరము పాలిపోయియుండుట,ఆసక్తి, పడిశము, శరీరమునలుపు వర్ణముగనుండుట లేక ముఖము నలుపువర్ణముగనుండి, వికారము, వమనము వచ్చినట్లుండుట లేక వాంతియగుటయున్న ½ గం॥ కొక మోతాదు నీయవలెను. సుగుణముగానున్న కొలదిని మోతాదులను ఆలశ్యముగ నీయవలసినది.

కెలిబ్రొమెడు 6, 30 (Kali Brom 6, 30):—ఉచ్ఛ్వాసనిశ్వాసములు ధ్వనిగా వినబడుచు, పిల్లికూతలున్న దీనిని వాడవలెను.

నాట్రింసల్ఫు 3,6 (Nat. Sulph 3, 6):—వర్షాకాలమందెక్కువగు దానికిని, ఈకువ ప్రదేశములందు నివశించుటచే కలుగు దగ్గులకును, శ్లేష్మము ఆకుపచ్చగను యెక్కువగనుండి, పైత్యాధిక్యతచే కలిగినను రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాల్కేరియఫాసు 3,12 (Cal. Phos 3,12):—చంటిపిల్లలకు కలిగిన దీనిని బలముచేయుటకు రోజుకు 4 మో॥లను వాడవలయును.

లొబిలియ Q, 3 (Lobelia Q, 3):—దీనిని ప్రారంభ దశయందు వాడిన తెరలను తగ్గివచ్చునట్లుగ చేయును.

శెనిగ Q, 3 (Senega Q, 3):—ఇపికాకు (Ipecacu) అర్సీనిక్ (Arsenic.) లొబిలియా (Lobelia) వలన సుగుణము లేనిచో దీనిని వాడవలయును. మొదట పొడిదగ్గుగానుండి, తరువాత కళ్లెపడుచు, పిల్లికూతలు, రొమ్మునయందుబరువు, ఎక్కువగదగ్గు, బాధపడలేనటుల దృష్టినికనపర్చుట, హీన స్వరముకలిగి కదలికవలనను, విశ్రాంతివలనను బాధహెచ్చు చుండిన దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

N. B:- మందుకు ముందు Q (Mother Tincture) అని వ్రాసియుండు దానిని వక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు వక చుక్కను కలిపి మోతాదుగా నీయవలెను. దీనిని మాత్రలందు కలుపవచ్చునుగాని, రంగుగానుండునను యుద్దేశ్యముతో వక ½ ఔన్సు నీటియందు కలిపి త్రాగమని చెప్పితిని. లేక పటికబెల్లమును పొడిచేసి మూడువేళ్ళకు వచ్చినంత చూర్ణమును కాగితమున వేసి వక మందుచుక్క నుంచి బాగుగ కలిపి మోతాదుగా నీయవచ్చును. 1వ సత్తు వుగల మందును మాత్రలందు కలిపిన నవియంత రంగుగా కనబడక యుండవచ్చును.



బ్లాటా ఓరియంటలిస్ Q, 3 (Blatta ori. Q, 3):— ఆయాసమే ప్రధానలక్షణముగనున్న దీనిని వాడవలెను. ఏయౌషధము పనిచేయనప్పుడు, కొన్ని తత్వములలో నిది బాగుగ పనిచేసినది. ఇది ముఖ్యముగా లావుగనున్నవారలకు బాగుగ పనిచేయును. రోజుకు 4 మో॥ నీయవలసినది.

బెసిలినం 200 (Bacillinum 200):—దీనివలన శ్లేష్మము, ఆయాసము, దగ్గు తగ్గును. 15 రోజుల కొక మో॥ నీయవలెను. 2 డోసులు లేక మోతాదులలో సుగుణము లేనిచో ఈ ఔషధమును మానివేయవలెను.

హైడ్రోకియానిక్ ఆసిడ్ 3 (Acid Hydro. 3) హీపార్ సల్ఫ 6 (Hepar Sulph 6) డ్రోసిర 3 (Drosera 3) శాంబ్యూకస్ 3 (Sambucus 3) యాంటిమోనియంటార్టారికం 6 (Ant. Tar. 6) లైకొపోడియం 12 (Lycopodium 12) యాంబ్రగ్రిషియ 3 (Ambra Gri. 3) స్పాంజియ 3 (Spongia 3) లాచెసిస్ 6 (Lacheis 6) లను గుణగతములనుబట్టి వాడవలెను.

N. B:- ఉబ్బసమువలన బాధనొందువారలు స్ట్రామోనియం సిగరెట్లను (Stramonium Cigaretts) త్రాగుచుండవలెను. శీఘ్రముగ జీర్ణమగు పదార్థములనే భుజించుచు, సాయంతన మూరుగంటలకే రెండవమారు భుజింపవలెను.

అన్నముల భుజించిన రాత్రి నిద్రబోవునప్పటికి ఆహారము బాగుగ జీర్ణమగును. ఉబ్బసవ్యాధిమనుజులకు సముద్రపుగాలియు, కొండగాలియు, ఎక్కువ నుపశాంతినిచ్చును.

### 33. పక్షవాతము. (Paralysis.)

హైడ్రోఫోబినం 30 (Hydrophobinum 30) :— దెబ్బలు తగిలిన భాగములకు పక్షవాతముకలిగిన దీనిని వాడవలెను. దీనివలన సుగుణము లేనిచో అర్నికా 30 (Arnica30), కోక్యులస్ 3 ను (Cocculus 3) కోనియం 3 ను (Conium) వాడవలెను.

రుహస్‌టాక్సు 30 (Rhus Tox. 30):— నిద్రిపట్టక యుండి, జ్ఞాపకశక్తితక్కువగనుండి, ముసలివారలకు మూతికి ముఖమునకు కలిగిన దీనిని రోజుకు 4 మోతాదులు వాడవలయును.

బార్యటకార్బ 6, 30 (Baryta carb 6, 30) :— మూతికిగాని, మూత్రకోశమునకుగాని కలిగిన రోజుకు 6 మో॥లను వాడవలెను.

కాస్టికం 6, 30 (Causticum 6, 30):— పక్షపార్శ్వమునకు కలిగి స్పర్శజ్ఞానముతగ్గియుండి నొప్పియుండిన రోజుకు 6 మోతాదులను వాడవలెను.



అకోనైటు 3, 6 (Aconite 3,6) :— కాళ్ళయందు మేహవాతనొప్పులతో తిమ్మురులు బరువుకలిగి, అవయవములు చల్లగానుండి, కనదృష్టితప్పి, అతిమూత్రము, పనిపాటలయందు చురుకులేక మందముగానుండిన దీనిని రోజుకు 6 మో॥లను వాడవలయును.

బెల్లడోన 3, 6 (Belladona 3, 6):— శగరోగము వలన పుంసత్వము లేకయుండి, పక్షవాతముకలిగి అవయవములు చల్లగానుండి నొప్పియున్న దీనిని రోజుకు 6 మో॥లను వాడవలయును.

ఫాస్పరస్ 6, 30 (Phospharus 6,30) :— విస్తారముగ వ్రాయువారలకు మణికట్టుయందు కలిగినను, లేక బలహీనతవలన మణికట్టుయందుగాని, మరియేయితర భాగములకు కలిగినను దీనిని వాడవలయును.

జెల్సిమియం 6, 30 (Gelsemium 6, 30):— అవయవములు చచ్చుబడి స్పర్శజ్ఞానము లేకయుండిన దీనినివాడవలయును.

అర్సెనిక్ఆల్బ 6 (Arsenic Alb 6) :— తీపులు లేక మంటలు, తిమ్మురులు, మొద్దుబారియుండుట లేక స్పర్శజ్ఞానము తగ్గియుండుట ప్రబలముగానున్న దీనిని వాడవలయును.

మెర్క్యూరియస్ సాలబిలస్ 6, 30 (Mar. Sol. 6,30):- వక పార్శ్వమునకు కలిగి లేక క్రింద అవయవములకు కలిగి స్పర్శజ్ఞానముతగ్గి నొప్పులుండి, జబ్బుగానున్న భాగములందలి కీళ్ళచర్మము పగిలినట్లుగానున్న దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను.

## 34. నోటిపూత. (Aphthae.)

ఇది నోటియందలి అపుభ్రతచేతను, అనగా ఉదయమున పాచినిసరిగా గీసుకొనక పోవుటచేతను అజీర్ణమువలనను మలబద్ధమువలనను, ఎక్కువ మేహము వలనను, రసము మొదలగు నౌషధములను విస్తారముగాను నుపయోగించుటచేతను, ఉష్ణమధికమయి నోటిపూత కలుగును.

బొరాక్సు 6 (Borax 6) మెర్క్యూరియస్ సాలబిలిస్ 6 (Merc. Sol 6) సత్తువుగల ఔషధములు ప్రధానౌషధములై యున్నవి. రోజుకు 4 మో॥ల చొప్పున, రెండు రోజులలో మొదటి ఔషధము పనిచేయనిచో రెండవదానిని వాడవలయును.

మెర్క్యూరియస్ సాలబిలస్ 6, 30 (Mcrs. Sol, 6,30): నోటిపూతతో పుప్పిపూయుచున్న రోజుకు 4 మో॥ను వాడవలయును.



కార్బో వెజిటబిలిస్ 6,30 (Carb. Veg. 6,30):- రసము మొదలగు ఔషధములను చాలరోజుల నుపయోగించుటచే గలిగిన దీనిని వాడవలయును.

నైట్రిక్ ఆసిడ్ 6, 30 (Acid. Nit. 6,30):— సవామేహమువలన కలిగిన రోజుకు 4 మో॥ను వాడవలయును.

నాట్రంమర్ 6 (Nat. Mur 6):— యాంటిమోనియం టార్టారికం 6 (Ant. Tar. 6) ఆరం 6 (Aurum 6) సల్ఫర్ 30 (Sulph 30) లనుగూడ పరిస్థితులనుబట్టి పైవానివలన సుగుణము లేనిచో వాడవలయును.

N. B :—పటికపొంగించి, పొడిచేసి దగ్గరయుంచుకొని, 5 గ్రైనులపొడిని తేనెయందుచాది, నాలుకమీద పూయుచుండవలెను.

## 35. ముక్కునుండి రక్తముకారుట. (Bleeding from nose or Epistaxis).

అకోనైటు 3,6 (Aconite 3,6):— రక్తాధిక్యముగల వారలకు జ్వరముకలిగి, రక్తము ముక్కునుండి స్రవించుచున్న దీనిని రోజుకు 6 మో॥ నీయవలెను

బెల్లడోన 3,6 (Belladona 3,6):— ముఖము యెఱ్ఱబారియుండుట, తలనొప్పి, [illegible]రక్తాధిక్యమువలన ముక్కునుండి రక్త[illegible]స్రవించుచున [illegible] వాడవలయును.

బ్రయోనియ 6,12 (Bryonia 6,12):— కాలికముగ గాని, దీర్ఘకాలమునుండిగాని, ప్రతిదినము వుదయమున రక్తము స్రవించుచున్న దీనిని వాడవలయును.

అర్నికా 6,30 (Arnica 6,30):— తలకుగాని, ముక్కునకుగాని దెబ్బతగిలి రక్తముకారుచున్న దీనిని 20,30 నిమిషములకొక మోతాదు నీయవలెను.

మెల్లిఫోలియం 3,6 (Mellifolium 3,6) ఫెర్రం అయోడైడు 3,6 (Ferrum Iod. 3,6) ను దీనికి ప్రధానౌషధములై యున్నవి.

చైనా 3, 30 (China 3, 30):—పాండురోగమువలన గాని బలహీనతవలనగాని కలిగిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

పల్సటిల్లా 6, 30 (Puls. 6, 30):— ఋతుస్రావము బహుకొద్దిగాగాని, లేక ఆగిపోవుటవలనగాని, మూలవ్యాధి దాగియుండుటవలనగాని, ముక్కునుండి రక్తము స్రవించుచున్న దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను. దీనివల్ల సుగుణము లేనిచో హెమామిలిస్ 3, 30 (Hemamelis 3 30,):- లను పైవిధముగా వాడవలెను.

N. B. ముక్కునుండి రక్తము విస్తారముగ స్రవించుచున్న ప్రతికొద్ది కాలములకును ఔషధమునువాడుచు 2 గం



టలలో సుగుణము లేనిచో ఔషధములను మార్చుచు, హెమామెలిస్ Q (Hemamelis Q) ను ముక్కులలో రెండు చుక్కలుపిండి ఆమందునే దూదియందు తడిపి వాసన చూపించుచుండవలసినది.

36. దగ్గుటవలనను, దెబ్బతగులుటవలనను కంటినుండి రక్తము కారుట. (Petechiae in cornea.)

అర్నికా Q (Arnica Q):—10 చుక్కలను వకఔన్సు ఆవిరినీటియందు కలిపి రోజుకు 4 మార్లు కంటియందు వేయుచు, అర్నికా 6,30 (Arnica 6,30) లను రోజుకు 6 మో॥ల నీయవలెను.

37. గవదబిళ్లలు. (Parotitis or Mumps).

అకోనైటు 3,6 (Aconite 3,6):— జలుబు, జ్వరము, అవిశ్రాంతి, ఆవేదన, దాహము, గవదబిళ్ళలుయున్న దీనిని వాడవలయును.

మెర్క్యూరియస్ బిన్ అయోడైడు 3 (Merc. Bin Iod. 3):— జ్వరము, గవదబిళ్ళలు, నోటిలోపుమ్మిపూరుట యున్న దీనిని రోజుకు 6 మో॥లను వాడవలయును.

పల్సటిల్లా 3,6,30 (Puls. 3,6,30):—బీజములువాచి, గవదబిళ్ళలున్న దీనిని వాడవలయును.

బెల్లడోన 3,30 (Belladona 3,30):—కుడిభాగమున బిళ్ళలు ఉబ్బరముగను, ఎఱ్ఱగానుండి, జ్వరము, సంధియున్నను దీనిని 2 గం॥ల కొక మోతాదు నీయవలెను.

రుహస్టాక్సు 3,30 (Rhus Tox. 3,30):— ఎడమ భాగమున బిళ్ళలుబ్బరముతో ఎఱ్ఱగానుండి, వర్షాకాలపు చల్లనిగాలివలన కలిగి, జ్వరమున్నను దీనిని వాడవలయును.

హీపార్ సల్ఫు 6 (Hepar Sulph 6) సల్ఫర్ 30 (Sulphur 30) సైలీషియా 3,30 (Silicea 3,30) లనుగూడ పరిస్థితులనుబట్టి వాడవలయును.

మెర్క్యూరియస్ బిన్ అయోడైడు 3 (Merc Bin Iod. 3) :— మాత్రలను పొడిచేసి, ఆ మాత్రల భస్మము 15 గ్రైలను వక ఔన్సు వ్యాసులైనునందుకలిపి, గొదబిళ్ళల మీద పూసి కొద్దిగా పత్తిని అంటించవలయును.

38. <u>ఎండదెబ్బ లేక వడదెబ్బ.</u> (Sunstroke or Insolation).

గ్లోనోయిన్ 30 (Glonoine 30):— తల విసురుడు నడుము తలనొప్పి, జ్వరము ప్రారంభించిన కొలదికాలముననే మైకముకలిగిన 5 లేక 10 నిమిషములకొక మోతాదు నిచ్చుచుండవలెను.

నాట్రంకార్బ 6 (Nat Carb 6):—ఎండవేడిమికి ప్రతి వేసవికాలమునందు తలనొప్పులు కలుగుచుండిన రోజుకు 4 మో॥ల నీయవలెను.



బెల్లడోన 3,30 (Belladona 3,30):—గ్లోనోయిన్‌లో వ్రాసిన గుణగతములతోబాటు జ్వరముండి, కన్నులు, ముఖము దూసుకొని పోయినట్లుండిన దీని నిచ్చేది.

అకోనైటు 3,6 (Aconite 3,6), వెరాట్రం విరైడు 3 (Verat Vir. 3); జెల్సిమియం 3,12 (Gelsemium 3,12); ఓపియం 6 (Opium 6); కార్బొవెజిటబిలిస్ 30 (Carb. Veg. 30); లనుగూడ పరిస్థితులనుబట్టి వాడుటమంచిది.

N. B:—బాలురకుగాని పెద్దవారలకుగాని ఎండదెబ్బ వలన స్మృతితప్పిపడియుండిన, బెల్లడోనా (Belladona) మోస్కస్ (Moschus) లను నోటియందొకమందు చుక్కను 2 నిమిషములకొక మారు వేయుచు 10 నిమిషములలో సుగుణము కనుబడనిచో 2వ దానిని పైవిధముగావాడుచు, మధ్య మధ్య అమిల్ నైట్రేటు (Amgl Nitrate) ను వాసన చూపించుచుండవలయును జ్వరమెక్కువగానుండి సంధికలిగినను సామాన్య జ్వరమునందు N. B. లో వ్రాసిన రీతిగా శరీరమును గోరువెచ్చని నీటిచే ప్రతి ½ గం॥కు తుడుచుచు పొడి గుడ్డచే ఆరునట్లుగా తుడువవలెను. స్మృతితప్పి పడియున్నప్పుడుమట్టుకు చల్లని ప్రదేశములందు పరుండబెట్టి మంచును రబ్బరు సంచీయందుంచి తలమీదవేయుచు (Amgl Nitrate) వాసన చూపించవలయును.

## 39. నిద్రలేమి. (Sleepless-ness).

ఇగ్నేషియ 30 (Ignetia 30):— దుఃఖమువలనగాని లేక భయమువలనగాని, తత్తరపాటుతోగాని లేక వులిక్కి-పడుచుగాని లేచుచుండిన రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాఫియ 6,30 (Coffea 6,30) :—పచుల తొందరవలనను లేక సంతోషమువలనను, ఆతురతగలిగి నిద్రపట్టకయుండిన దీనిని వాడవలయును.

బెల్లడోన 6,30 (Belladona 6,30):— నిద్రించుటకు ఆసక్తిగలిగి నిద్రరాక, భయము, తలభారము, కొద్దివేడియున్న దీనిని వాడవలయును.

ఛమోమిల్లా 30 (Chamomilla 30):—చంటిపిల్లలకు పండ్లు రాబోవునప్పుడు నిదురపట్టకపోరుబెట్టి యేడ్చుచుండిన దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను. దీనివలన సుగుణములేనిచో బెల్లడోన 30 (Belladona 30) ను పై విధముగా వాడవలయును.

నక్సువామిక 6,30 (Nux-vom. 6,30):— అజీర్ణమువలనను, మలబద్ధమువలను, ఎక్కువచదువుటవలనను, అనేక ఆలోచనలవలనను నిద్రరాకయుండిన దీనిని వాడవలయును. దీనివలన సుగుణములేనిచో సల్ఫర్ 30 ను (Sulphur 30) పల్సటిల్లా 30 ను (Pulsatilla 30) రోజుకు 4 మో॥ లు వాడవలయును.



సినా 200 (Cina 200):—జంతువాతంవలన నిద్రరాకయుండిన దీనిని రోజుకు 2 మో॥లను వాడవలయును.

ఆరం 6 (Aurum) లేక నైట్రిక్ ఆసిడ్ 6,30 (Acid Nitric 6,30):—సవామేహామువలన నిద్రపట్టకయుండిన దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.

ఆకోనైటు 3,12 (Aconite 3,12):— ఆశవలనగాని లేక భయమువలనగాని నిదురపట్టకయుండి, కొద్దిగావేడిచేసియున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను.

చైనా 6,30 (China 6,30):— రక్తస్రావములనను, కుసుమవ్యాధివలనను, టీ, కాఫీ మొదలగునవి ప్రతిదినము యెక్కువగా త్రాగుటవలనను, తరుచువిరేచనముల ఔషధమును సేవించుటవలనను, బలహీనతకలిగి నిదురపట్టకయుండిన దీనిని రోజుకు 4 మో॥లు వాడేది.

ఫెరంఫాసు 3,12 (Fer. Phos 3,12):—తలకు రక్తాధిక్యమువలన నిదురపట్టకయుండిన దీనిని వాడవలెను.

కాలిఫాసు 3,12 (Kali Phos 3,12):—దీనికిది ప్రథానౌషధమైయున్నది. ఏకారణమువలన నిదురపట్టకయుండినను దీనిని వాడవచ్చును.

ఓపియం 6, 30 (Opium 6,30):— భయమువలన దుష్టకలలుగనుచు నిదురపట్టకయున్న దీనిని రోజుకు 4 మో॥ సేయవలెను.

కెలిబ్రోమేటం 30 (Kali Brom. 30); అర్సెనిక్ 6 (Ars. 6); కెలిఅయోడేటం 30 (Kali Iod. 30) లనుగూడ గుణాగతములనుబట్టి యిచ్చుట మంచిది.

## 40. బోదకాలు. (Elephantiasis.)

ఫెర్రంఫాసు 3,12 (Fer. Phos 3,12):— బోదకాలు వలన జ్వరము, కాలుపోటుయున్న దీనిని రోజుకు 6 మో॥ లను వాడవలెను.

హైడ్రోకొటాలస్ 3, 12 (Hydrocatolus 3, 12); ఎనకార్డియం ఓరియంటలిస్ 3, 6 (Anacardium ore. 3, 6) లను, వకదానివలన నొకమాసముదినములలో సుగుణము లేనిచో రెండవదానిని మార్చవలయును.

## 41. గుండెదడగాకొట్టుకొనుట Pulpitation of the Heart

నక్సువామిక 30, లాచెసెస్ 30 (Nux. Vom. 30; Lachesis 30):— పైత్యశరీరములకు గుండె దడగానుండి, అజీర్ణము, అపానవాయువులు, నరములబలహీనత, ఎక్కువగా మూత్రవిసర్జనయున్న దీనిని రోజుకు 4 మో॥లను వాడవల



యును. స్త్రీలకు అజీర్ణము కలిగి పైలక్షణములున్న పల్సటిల్లా 6,30 (Pulsatilla 6, 30); లాచెసెస్30 (Lachesis30) పైవిధముగా వాడవలెను.

జెల్సీమియం 30 (Gelsemium 30):—గుండెదడగా నుండి దృష్టి చెదరుచున్నట్లున్న దీనిని వాడవలయును.

అకోనైటు 3, 6 (Aconite 3, 6):—బలహీనతవలన కలిగి కొద్దిగా పనిచేయుచున్నను దడగానుండి, ముఖముయెఱ్ఱబారివేడిగానుండి, ఎప్పుడును దృష్టి గుండెయందేయుంచుచు ఆగునేమోయని భయపడుచున్న దీనిని రోజుకు 4మో॥ లను వాడవలయును.

N. B:- ఏవ్యాధియైనను బలహీనతవలన కలిగిన అకోనైటును (Aconite) పెద్దసత్తువ అనగా 200 సత్తువగల దానిని రోజుకు 2 మో॥లను వాడిన బాగుగపనిచేయును. వ్యాధిదీర్ఘకాలమునుండియున్నను 4, 5 రోజులలో పనిచేయనిచో ఔషధమును మానివేయవలెను. సుగుణముగానున్న, ఏఔషధమునైనను మానివేయుట మంచిది. అటుల మానివేయనిచో ఔషధమునకు సంబంధించుజబ్బులుబయలుదేరును. కాన సుగుణము కనుబడినవెంటనే ఔషధమునుమాని రోగియొక్క నమ్మకము కొఱకు కాళీసీసాయందుమందుకలపనిమాత్రలనుంచి ఆమాత్రలను X అను పేరిడి 2, 3 మో॥లను రోజుకు

యిచ్చుచుండవలెను. ఆటుల వైద్యుడు వట్టిమాత్రలనిచ్చుచుండినరోగియొక్క ఆరోగ్యమును బలపర్చుటకిచ్చుచున్నాడని తెలిసికొనవలయునేగాని, మందునకును ధనమునకునులోపించి యిచ్చుచున్నాడని యనుకొనుట పొరబాటు. గుండెజబ్బువలన బాధపడువారలు దృష్టిని గుండెయందుంచిన దడయెక్కువగనుండి, తాను మృతినొందుననే భయముగూడ కలుగవచ్చును కాన దృష్టిని గుండె యందుంచక, అలసటగల పనులను చేయుటమాని, పురాణకాలక్షేపము చేయుచు, సద్వృత్తితో నిష్కళంకుడై ప్రవర్తింపవలెను.

ఆరంమెటాలికం 6, 30 (Aur. Met. 6, 30):—ముసలి వారలకు బలహీనతవలన కలిగిన దీనిని వాడవలయును.

చైనా 6, 30 (China 6, 30), ఆసిడ్ ఫాసు 30 (Acid Phos 30); కాల్కేరియకార్బ6,12 (Cal. carb6,12): పిల్లలకుగాని, నడినయసువారలకుగాని ఏకారణమువలననయినను బలము తగ్గి నిస్సత్తువమీద దడకలిగిన మొదటి ఔషధమును రోజుకు 6 మో॥ లు వాడి ప్రయోజనము లేనిచో 2వ దానిని, 3వ దానిని రోజుకు 6 మో॥ లను వాడవలెను.

బెల్లడోన 3,6 (Belladona 3,6):— గుండెయందు నొప్పితోదడ, ముఖము ఎఱ్ఱబారియుండి తలనొప్పియున్న దీనిని వాడవలయును.



డిజిటలిస్ 30 (Digitalis 30):—గుండె ఒక్కొక సమయమందు ఉద్రేకముగ నడచుచు, మరియొకసమయమందును, పరుండునప్పుడును వేగముతగ్గియుండి, దడముఖ్యముగ అలసటగలుగుపనులు చేయుచున్నప్పుడును, ఆలోచనానంతరమును కలిగిన రోజుకు 4 మో॥ నీయవలెను.

కాక్టస్ 3 (Cactus 3):— గుండెయందు చప్పుడు దుముకుచున్నట్లుగనుండి, నడుచుచున్నప్పుడును, ఎడమచేయి మీద పరుండునప్పుడును, ఎక్కువగానున్న దీనిని వాడవలెను.

కాఫియ 30 (Coffea 30):— రాత్రులందు నిదుర పట్టకయుండి దడయున్న రోజుకు 4 మో॥ల నీయవలెను. కోపమువలన దడకలిగియున్న ఛమోమిల్లా 6 ను (Chamomilla 6), భయమువలన కలిగిన ఓపియం 6 ను (Opium 6) అకోనైటు 3,12 ను (Aconite 3,12) వాడవలయును.

స్పిజెలియ 3,30 (Spigelia 3,30):— గుండెయందు నొప్పిగానుండి, పేపున చురుకు చురుకుమనుచు పొడుచుచున్నట్లు నొప్పియున్న దీనిని వాడవలయును. దీనివలన సుగుణములేనిచో మాగ్నీషియాఫాసు 3, 12 ను (Mag. Phos 3,12) రోజుకు 6 మో॥లను వాడవలయును. వ్యాధి యెక్కువగానుండి తొందరగా సుగుణము కనుబడవలయునన్న ఒకఔన్సు వేడినీటియందు నీమాత్రలు 12_15 వరకు వేసి

కలిగిన తరువాత 10-15 నిమిషములకొక చంచా మో॥దుగా నీయవలెను.

కాల్మియలాట్ 3,30 (Kalmia Lat 3,30):—మేహ వాతనొప్పులతో దడయున్నను, చుట్టు విస్తారముగ త్రాగుట వలన దడకలిగినను దీనిని వాడవలయును ఎక్కువశ్రమవలన కలిగిన అర్నికా 6,30 (Arnica 6,30) ను వాడవలెను.

కాల్ కేరియఫాను 3, 12; కెలిఫాసు 3, 12 (Cal. Phos 3,12; Kali Phos 3, 12):— రక్తహీనతతో అజీర్ణ రోగము జనించియుండుట, విచారముగనుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు పీల్చుచున్నప్పుడు గుండెయందు నొప్పియున్న దీనిని రోజుకు 6 మో॥లను యిచ్చుచుండవలెను.

## 42. పురీషనాళము దురదగనుండుట. (Pruritus Ani.)

నులిపురుగు లుండుటవలనను, మూలవ్యాధివలనను, హృదయమునకు నల్లరక్తమును తీసికొనిపోవు రక్తనాళము లుబ్బరించి యుండుటవలనను, పేనుగజ్జి మొదలగు చర్మ వ్యాధులుండుటవలనను పురీషనాళమందు దురదగనుండును.

రేడియం బ్రోమాటం 30, 200 (Radium Bromotum 30, 200):—దీనిని యేకారణమువలని దురదకలిగినను 4రోజులకొక మోతాదు నిచ్చుచుండవలెను. నులిపురుగుల వలన దురదకలిగిన సినా (Cina) ను గాని ట్యూక్రియం (Tucreum) నుగాని రోజుకు 3 మో॥లను వాడవలయును.



## 43. ఏడికపాములు, నులిపురుగులు.

## (Hook-worms and Worms Disease.)

ఇది సామాన్యముగ తడినేలలందు, ఆకు కూరలను వేసి నప్పుడు ఆమొక్కలపైన కుక్కలు మొదలగు జంతువులు మలమూత్రవిసర్జన చేయుటవలన, నా మలమూత్రములనుండి ఆ ఆకులపైని సన్నని గ్రుడ్లు పుట్టును. ఆ యాకుకూరలను కోయునప్పుడు, ఆగుడ్లు గోరులయందు ప్రవేశించి, ఆహారముద్వారా లోనికి ప్రవేశించును. ఇట్టి అశుభ్రతవలనను రోగగ్రస్తమైన జంతువులమాంసమును సేవించుటవలనను, పాతగిలి రుచిచెడి పాసిన చేపలను కూరగ నుపయోగించుట వలనను, తీపిపదార్థములను మిక్కుటముగా నుపయోగించు టవలనను, పక్వమునకురాని ఫలాదులనుగాని, నల్లగ మాగి సొట్టపడి లోన పురుగాలుయున్న ఫలాదులనుగాని భుజించుట వలన నుద్భవించి, పురీషనాణమునందు దురద, నిద్రయందు పండ్లుకొరుకుట, నిద్రలేచి నడుచుట లేక యులికిపడుట, సంధి ముక్కుకొన దురదగనుండుట, ఒక్కొక సమయమునందు ఆకలిగనుండి మరియొకసమయమునందు ఆకలి తప్పియుండుట చిఅచిఅలాడెడు స్వభావము, నిద్రయందు మూత్రవిసర్జన నోటినుండి యెక్కువగనీరూరుచుండుట, పాలిపోయినట్లుండుట లేక కాంతి హీనతగనుండుట, కలరావ్యాధియందుండునట్లుగా

వాంతులు విరేచనములు మొదలగు లక్షణములతో కూడి యుండును.

సినా 200 (Cina 200):— కనురెప్ప లుబ్బరించి యుండుట, నిద్రలో తెలియక నడచుట, నిస్త్రాణగనుండుట, వికారముతో వమనమువచ్చినట్లుండుటగాని లేక వాంతులుగాని యగుట, ఎక్కిళ్లు, ముక్కు మొన లేక కొన దురదగనుండుట, పురీషనాళము దురద, నిద్రయందు పిడికిలి బిగబట్టుట, మూత్రము తక్కువగా విసర్జించుచు, తెల్లని పాల వర్ణముగ నుండుట, తీక్ష్ణమైన ఆకలి మొదలగు లక్షణములుండిన దీనిని వాడవలయును. రోజుకు 2 మో॥ల నిచ్చేది. దీనివలన సుగుణము లేనిచో స్టానం 6,30 (Stannum 6, 30) లను రోజుకు 4 మో॥ల నీయవలెను.

ట్యూక్రియం 1, 12 (Tucreum 1,12):— మలాశయము లేక పురీషనాళము రొక్కువగ వాచియుండుట, నిద్రలేకయుండుట, తలతిరుగుట మొదలగు లక్షణములకు దీనిని రోజుకు 4 మో॥ నీయవలెను. ఇది నులిపురుగునందు మాత్రమే చాల ప్రయోగముగ నుండును.

శాంటొనైను 1,3 ట్రిట్యురేషన్ (Santonine 1,3 Trit):—నులిపురుగులకును, ఏడికపాములకును 3,4 గ్రైనుల భస్మము నీయవలెను.



స్పిజెలియ 3,12 (Spigelia 3,12):— దీర్ఘకాలము నుండి ఏడికపాములు అప్పుడప్పుడు పడుచుండిన దీనిని రోజుకు 4 మో॥ల నిచ్చుచు, శాంటొనైను 1 (Santonine 1) భస్మమును 4 గ్రైనులను రాత్రి పరుండబోవు నప్పుడు 15 రో॥ల కొకమారిచ్చి, మరునటి దినముదయమున ఆముదము త్రాగించవలెను.

సల్ఫర్ 30 (Sulph 30):—దీర్ఘకాలమునుండి ఏడిక పాములు పడుచు పైఔషధములు పనిచేయనప్పుడు, ఈఔషధమును 2 రో॥ల కొక మోతాదు నిచ్చుచు పై ఔషధములను వాడుచుండవలెను.

ఏడికపాములు పడునప్పుడు, ఫిలిక్సుమాస్ Q, 12 (Filix Mas Q. 12) మెర్క్యూరియస్కరోసివస్ 3 (Merc. Cor 3) కుప్రం ఆసెటికం 3 (Cup. Acet 3) స్టానం 3 (Stannum 3) లనుగూడ వకదానివెంట నొకదానిని సుగుణము లేనిచో వాడవలయును

జంతువాతంవలన పాండువకలిగిన చైనా (China), ఫెర్రంమెటాలికం (Fer. Met.), ఆసిడ్ఫాసు (Acid Phos), స్టానం (Stannum), సిన (Cina), స్పిజెలియ (Spigelia), ట్యూక్రియం (Tucreum), 6-30 లను గుణగతములనుబట్టి రోజుకు 4 మో॥ లను వాడుచుండవలెను.

## 44. పిచ్చికుక్కలు, ఎలుకలు మొదలగు జంతువులు కరుచుట వలన కలుగు జబ్బులు. (Hydro-phobia).

పిచ్చికుక్కలు, ఎలుకలు మొదలగు జంతువులు కరచిన వెంటనే, వక అంగుళము పైభాగమునగట్టిగా తాడుచే కట్టి, నైట్రిక్ ఆసిడ్ (Nitric Acid.) వక చుక్కను వేయవలెను, లేక పొటాషియం పర్మాంగనేడు (Permaganade of pottash) ను కరచినచోట కొద్దిగా యుంచి, అందు కొద్దిగా నిమ్మఉప్పునుగూడవేసి రెండు నీటిచుక్కలను వేయవలెను అటులచేసినది బుసబుసపొంగును పొంగు ఆగిన వెంటనే పైకట్టునూడదీసి, నీటితో కడుగనియెడల పెద్దపుండు బడును. తరువాత కట్టునూడదీసి, హైడ్రోఫోబినం 30 ను (Hydrophobinum 30) రోజుకు 3 మో॥ల చొప్పున వారం రోజులీయవలెను. తరువాత బెల్లడోన 30 (Belladona 30) రోజుకు 2 మో॥ చొప్పున 3,4 మాసములు సేవించవలెను.

స్ట్రామోనియం 3, 12 (Stramonium 3, 12):— పిచ్చికుక్కలు, ఎలుకలు కరుచుటవలన బలహీనత కలిగి కోపముయున్న దీనిని వాడవలెను. పిచ్చి కలిగినను దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను. పిచ్చినయమగానుండి మరల మరల కనుబడుచుండిన లాచెసెస్ 6, 30 (Lachesis 6, 30) ను రోజుకు 6 మో॥ల నీయవలెను.



హైసామస్ 6, 30 (Hyos. 6, 30) బెల్లడోన 3 (Belladona 3) ఆర్సెనిక్ ఆల్బ 3, 6 (Ars. Alb. 3, 6) లను పరిస్థితులనుబట్టి వాడవలెను.

## 45. గాయములు. (Wounds.)

ఆర్నిక 3, 30 (Arnica 3, 30):— చిన్న దెబ్బలు, ఘాతములు లేక మెత్తుప్రదేశమునుండి క్రింద పడుటవలనగాని బరువు వస్తువులు మీద పడుటవలనగాని కలుగు నెప్పులకును నొప్పులతో గూడిన తత్సంబంధమగు జ్వరమునకును దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను. నడుచుటవలనను, గుఱ్ఱపు స్వారివలనను కలుగు శ్రమలకును దీనిని శ్రమనివారణిగా నుపయోగించవలెను. ఆర్నికా Q ను, 1—20 పాళ్ళగా ఆవిరి నీటియందు (Distilled Water) కలిపి సీసాలయందుంచి, చిన్న దెబ్బలకును, ఘాతములకును పైన పూయుచుండవలెను.

సక్కస్ కాలెన్డ్యులా. (Succus Calendulae):— దీనిని చేయువిధము వడిశగడ్డల (Bubo) వ్యాధియందు వ్రాసిన రీతిగా తయారుచేసి దగ్గరయుంచుకొని రంపపు పుండ్లవలె అచ్చటచ్చట తెగిన గాయములకును, తెగి రక్తము కారుచున్నట్టి గాయములకును, చీము నీరుపట్టియున్న గాయములకును, చెడువ్యాధులవలన కలుగు అంగమీద పుండు (Chancroid) నకును, దూదిని ఔషధమునందు తడిపి, పట్టీగా నుపయోగించవలెను.

హైపరికం పర్ఫొరేటం 3, 30 (Hypericum Perforatum 3, 30):- నరములు మొదలగునవి తెగి రక్తము స్రవించుచున్నను; నలగగొట్టబడిన దెబ్బలకును, సూదులు, మేకులు, చిన్న ఆటతుపాకుల గుండ్లు దిగబడిన గాయములకును, హైపరికం పర్ఫొరేటం Q (Hypericum Perf Q) ను 1-20 పాళ్ళగా వేడినీటిలో కలిపి, పుండునానీటిచే కడిగి, బోరిక్ ఆసిడ్ (Boric Acid) భస్మమును చల్లి, సరిగా కట్టుగట్టి పైఔషధమును రోజుకు 4 మో॥ ల నిచ్చుచుండవలెను. ఇది దవడ కదలక, మాటలేకయుండు, ఒకవిధమైన రుగ్మత (Lock-jaw) కు గూడ నిది బాగుగ పనిచేయును. ఈవ్యాధియందు 10, 15 నిమిషములకొక మోతానునిచ్చిన 1, 2 గం॥ లో సుగుణమును బడయగలరు.

హీపార్‌సల్ఫ 6, 30 (Hepar Pulph 6, 30):— గాయములు త్వరగా మానసట్టి స్వభావమున్నను, చీము పట్టియున్నను దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

లాచెసెస్ 3, 12 (Lachesis 3, 12):—పుండుయందుగాని, వాపుగానున్న భాగములందుగాని రక్తముచెడి, మాంసము కుళ్ళునట్టి స్వభావముగాని, లేక తినివేయుచున్నట్టి, స్వభావముగానియున్న దీనిని రోజుకు 6 మో॥ల నీయవలెను.

ఎపిస్‌మెల్లఫికా 3 (Apis. Mel. 3):— మసలకాగిన నీళ్ళు మొదలగు వానిచే కాల్పబడిన భాగములకు, బట్టల



సోడాను వేడినీటియందు కలిపి, కాల్పబడిన భాగములకా నీటిచే కడిగి, ఎకినీషియ (Echinacea) మాత్రలను నూరి, వ్యాసులైనను నందు కలిపి, ఆయాభాగములకు వ్రాసి, ఎపిస్ 3 ను (Apis) రోజుకు 4 మో॥ల నీయవలెను.

కాన్‌థరిస్ 3, 12 (Cantharis 3, 12) నిప్పువలన కాల్పబడిన భాగములకు, కాంథరిస్ Q ను (Cantharis Q) 16 చుక్కలను వకఔన్సు కొబ్బరినూనెయందు కలిపి, సీసాను కుదిపి, కాల్పబడిన భాగములపై పూయుచు, 3 గాని లేక 12 వ సత్తువుగల ఔషధమునుగాని రోజుకు 6 మో॥ల నీయవలెను.

సింఫిటం 3 (Simphytum 3):— పడుటవలన యెముకలుతొలగిన, అతుకుకొనుటకు దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

అకోనైటు 3 (Aconite 3):— గాయములవల్లగాని ఆపరేషనులవల్లగాని జ్వరముకలిగిన దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

## 46. బుడ్డ. (Hydrocele.)

రొడొడెన్‌డ్రన్ 3, 6 (Rhododendron 3, 6):— కుడిబీజము వుబ్బరించి, నొప్పికలిగి, చల్లనిగాలికి యెక్కువగుచున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను. దీనివలన సుగు

ణమును బడయనిచో, రుహాస్టాక్సు 30ను (Rhus Tox 30 పైవిధముగా వాడవలెను.

పల్సటిల్లా 30 (Puls 30):— నొప్పిలేకయుండి, ఎడమ బీజము బహునెమ్మదిగా వుబ్బరించుచుండిన రోజుకు 4 మో॥ల వాడవలెను.

సైలీషియ 3. 30 (Silicea 3, 30):—ఉబ్బరము పవర్ణము, అమావాస్యలకు, యెక్కువగనుండి, తదితరరోజుల యందు తగ్గుచుండిన రోజుకు 4 మో॥ల నీయవలెను.[సన్నగానుండి, పొడువుగానున్న, బాలురకిది బాగుగపనిచేయును.]

అర్నికా 3, 30 (Arnica 3, 30):— బరువులెత్తుటవలనను కాలు జారుటవలనను, దెబ్బ తగులుటవలనను, కలిగిన దీనిని వాడవలెను.

కాల్కేరియకార్బ 6,30 (Cal. Carb 6,30):— [ఇది లావుగానుండు పిల్లలకు బాగుగపనిచేయును.] బుడ్డచంటిపిల్లలకు కలిగిన దీనిని ప్రధానౌషధముగా వాడవలయును. దీనివలన నొకమాసము రోజులలో సుగుణము లేనిచో, బ్రయోనియ3 (Bryonia 3) రోడోడెన్డ్రన్3 (Rhododendron. 3) పల్సటిల్లా 6 (Puls. 6) సైలీషియ 6 (Silicea 6) అరంమెటాలికం 6 (Aur. Met. 6) గ్రాఫిటెస్ 6, 30 (Graphites 6,30) ఎపిస్మెల్ 3 (Apis. Mel 3) అయోడియం 6



(Iodium 6) రుహాస్టాక్సు 6 (Rhus Tox. 6) సల్ఫర్ 30 (Sulph. 30) లను వక దానివెంట నొక దానిని సుగుణము లేనిచో, వాడుటమంచిది.

ప్లంబం 6 (Plumbum 6):— విరేచనబద్ధము కలిగి బీజముజారివాచిన దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఆసిడ్సల్ఫ్యూరిక్ 3 (Acid Sulph 3):—బీజమువాచియుండి, వాంతులున్న దీనిని రోజుకు 4 మో॥ వాడవలెను.

## 47. ఇంద్రియనష్టము. (Spermtorrhoea-Emissions)

ఆసిడ్ఫాసు 3, 30 (Acid Phos 3, 30):— విస్తారము మోహామువలన సంగమమునందు ఆసక్తి తగ్గియుండుట, రతిసమయమునందు తొందరగా స్ఖలనమవుట, మనస్సు క్రుంగినట్లుండుట లేక అధైర్యముగనుండుట, జ్ఞాపకశక్తి తగ్గియుండుట, స్వప్నమందు యింద్రియస్ఖలనము బహుతరుచుగనగుచు బలహీనతకలుగజేయుట, సంభోగశక్తి పూర్తిగాగాని, చాల తక్కువగగాని తగ్గిపోవుటయున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

సెలినియం 6, 30 (Selinium 6.30):— నిద్రయందు స్ఖలనము లేక మూత్రము విడుచుచున్నప్పుడు తీగలుగా స్రవించుట, ఉదయమునలేచినప్పుడు తల తిరుగుటయున్న దీనిని వాడవలెను.

పిక్రిక్ ఆసిడ్ 30 (Acid Picric 30):— తరుచుగా బాధగానున్నా, బిగివిగానున్నా లేపనము కలుగుచు విపరీతమైన స్ఖలనముయున్న దీనిని వాడవలయును.

కాల్ కేరియా కార్బ 6 (Cal. carb 6):— రాత్రులందు శయనుటతో స్ఖలనమువుచున్న దీనిని వాడవలయును. సంభోగమునందు అతికోరికగనుండి, లేపనశక్తిలేకుండగనే స్ఖలనమువుట, ఒడలంతయు నొప్పులుగనుండుట, నిస్సత్తువయున్న దీనిని వాడవలెను.

స్టాఫిశాగ్రియ 3, 12 (Staphysagria 3, 12):—ముష్టిమైధునమువలన కలిగిన దుర్లక్షణములకిది పనిచేయును. కన్నులవద్ద నల్లని ఛారలమాదిరిగా కనుబడుట, పాలిపోయిన లేక అందవికారమైన ముఖము, ఎండిపోయిన చెక్కిళ్లు, చురుకుదనములేక మందముగనుండి విచారగ్రస్తముగ నుండుట యున్న దీనిని వాడవలయును.

లైకపోడియం 30 (Lycopodium 30):-- లేపనము లేకుండగనే అతిబలహీనము కలుగజేయునట్టి స్ఖలనము, నపుంసకత్వముయున్న దీనిని వాడవలయును.

ఆగ్నస్ కాస్టస్ 3, 30 (Agnus castus):— సంభోగమున ఆసక్తియుండియును నపుంసకత్వము, బుద్ధిమాంద్యము, శ్రద్ధ, ధ్యానము, ఆసక్తి, లక్ష్యము ... రియుండుట, నిస్సత్తువ



లేక దుర్బలత్వము, స్వభావికముగా వెళ్లిటతప్ప సంభోగశక్తి పూర్తిగా నశించుటయున్న దీనిని రోజుకు 4 మోతాదులను వాడవలయును.

కోనియంమాక్యులేటం 3, 12 (Conium Mac.3,12):— ఏవ్యాధియైనను లేకపోయినప్పటికిన్ని, వున్నదనియనుకొనుచు సదారోగభీతితోకూడిన మనోవ్యాధితోనున్న దీనిని వాడవలయును.

బెల్లిస్ పెరెనిస్ Q (Bellis Perenis Q):- ముష్టిమైధునమువలన స్ఖలనముగాని, నపుంసకత్వముగాని కలిగిన వక ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు 5 చుక్కలను కలిపి మోతాదుగ నిచ్చుచు, అటుల దినమునకు 2 మోతాదుల నీయవలెను.

బార్యటకార్బ 6 (Baryta Carb 6):—స్వప్నమందు స్ఖలనము; మనస్సు క్రుంగినట్లుండుట, దడగానుండి దుర్బలత్వముగనున్న దీనిని రోజుకు 4 మోతాదుల నీయవలయును.

థ్యూజ Q (Thuja Q):— విపరీతమైన స్ఖలనము యున్న దీనిని వాడవలయును.

న్యూఫార్ లూట్ Q (Nuphar Lut Q):— స్వప్న స్ఖలనముతో బాటు నిస్సత్తువ లేక దుర్బలత్వముయున్న దీనిని వాడవలయును.

చైనా 6, 30 China 6, 30):— కోరిక యొక్కువగా నుండి తరచుస్వప్న స్ఖలనమవుట, గర్భమునందు నొప్పి, చెవులయందు ధ్వని, ముఖముయొర్రని వర్ణముగానుండి తల తిరుగుట, తరచుగ ఆవులించుట, యెక్కువ దుర్బలత్వము యున్న దీనిని వాడవలయును,

ఫాస్ఫరస్ 6, 30 (Phospharus 6, 30):— సంభోగ సమయమునందు తొందరగా స్ఖలనమవుట సంభోగశక్తి పూర్తిగాగాని చాలతక్కువగగాని నశించియుండుట, చింత, దడ, ముష్టిమైధనమువలన యెక్కువగ యింద్రియ నష్టము, లేపనశక్తిపూర్తిగా నశించుటయున్న దీనిని రోజుకు 4 మోll ల నీయవలయును.

ప్లాటిన 6 (Platina 6):—ముష్టిమైధనమువలన చిన్నతనమునందె సంభోగాశక్తి పూర్తిగ నశించియుండుట లేపన శక్తిలేకుండగనే యింద్రియ స్ఖలనమగుటయున్న దీనిని వాడవలయును.

నక్సువామిక 6, 30 (Nux Vom. 6, 30):— సంభోగమునందు ఎక్కువఆశక్తి, నిద్రనుండి లేచునప్పుడుమాత్రమే లేపనశక్తి యెక్కువగనుండుట, ఆహారము నమితముగా భుజించుటవలన రాత్రియందు స్ఖలనము, విరేచనబద్ధము, ఆకలిమందగించుటయున్న దీనిని వాడవలయును.



కాన్థరిస్ 3 (Canth. 3):— శగరోగమువలన ఇంద్రియ స్ఖలనముగూడనగుట, మూత్రము కొంచెము కొంచెముగానగుట, సంభోగమునందు ఎక్కువ కోరిక గలిగియుండుట ముష్టిమైధునమువలన స్వప్న స్ఖలనమగుచున్న దీనిని వాడవలయును. కాన్థరిస్ 3 [Cantharis 3] మొగవారలకును ప్లాటినా 6 [Platina 6] ఆడవారలకును వాడవలయును.

సినా 200 (Cina 200):— జంతువాతంవలన స్వప్న స్ఖలన మవుచున్న దీనిని రోజుకు 1 మోll నీయవలెను.

ఆరంమెటాలికం 200 (Aurum Met. 200), గ్రాఫైటస్ 30 (Graphites 30), పల్సటిల్లా 3,30 (Puls 3,30), సల్ఫర్ 30 (Sulphur 30), స్టాఫిశాగ్రియ 6 (Staphysagria 6), జెల్సీమియం 30 (Gels 30), బార్యటకార్బ 6 (Baryta Carb 6), ఇగ్నిషియ 6 (Ignatia 6), అర్జెంటం మెటాలికం 6 (Arg. Met. 6), బ్యూఫో 200 (Bufo 200), కెలాడియం 30 (Caladium 30), కాల్ కేరియాఫాసు 3,12 (Cal, Phos 3,12), లాచెసెస్ 200 (Lachesis 200), లైకపోడియం 200 (Lycopodium 200), కోనియం 30 (Conium 30). నాట్రంమూర్ 3,30 (Nat, Mur 3,30) లను గుణగతములనుబట్టి వాడుచు, 200 సత్తువగల ఔషధమును రోజుకు 1 మోll గాని, 2 మోll గాని యిచ్చుచుండవలెను.

N. B :—జితేంద్రియత్వము అనగా ఇంద్రియ నిగ్రహము లేనిదే ఔషధములు పనిచేయవు. ఆలోచనలు పనులు మొదలగునవి నిష్కళంకముగానుండవలెను. ఆలశ్యముగా భుజించుటగాని, మిక్కుటముగా భుజించుటగాని, ఆలశ్యముగా పరుండుటగాని మొదలగు వానియందుకూడ జాగ్రత్తగ నుండవలెను. విరేచనబద్ధము కలుగచేయు పదార్థములనుగూడ మానివేయుటమంచిది. ఉదయముననే స్నానము చేయుచు, గాలిలో కసరత్తుచేసుకొనవలెను.

## 48. <u>శెగరోగము.</u> (Gonorrhoea).

సెపియ 30 (Sepia 30):— శెగరోగము తగిలినదని యనుమానము కలుగగనే రోజుకు 4 మో॥ చొప్పున 4 రో॥ వరకు యీ ఔషధమును సేవించవలయును.

అకోనైట్ 3,6 (Acon. 3,6):— జ్వరము వచ్చినట్లుండుటగాని, లేక జ్వరము వాపుయుండుటగాని సంభవించిన దీనిని 4 మో॥లను వాడవలయును.

కెనబస్‌సతీవం Q. 6 (Can. Sat. 6) :— వాపుతగ్గి యెక్కువగా మూత్రవిసర్జన, మూత్రమునుండి చీముగాని, నెత్తురుగాని పడుచు కొద్దినొప్పియున్న దీనిని వాడవలయును. [ఈ వ్యాధియందు లేపనశక్తి ప్రాముఖ్యముగనున్న దీనిని వాడవలయును].



తూయ్యాజ 6 (Thuja 6):— పసుపుపచ్చగాగాని ఆకుపచ్చగాగాని యుండి యెక్కువగా స్రవించుచున్న దీనిని వాడవలయును.

కాన్‌థరిస్ 6, 30 (Cantharis 6,30):— [చురుకు ప్రాముఖ్యముగనున్న అంగమునకు రెండు చుట్లువచ్చునట్లుగా గుడ్డను చుట్టి, తను ఓర్పుగాయుండునంతటి వేడినీటిని మాత్రమే పోయుచుండవలసినది. అటుల 5,6 మారులుచేసిన చాలును.] మూత్రము పోసికొనుచున్నప్పుడు నెత్తురుయుండినను, చురుకు ఎక్కువగాయున్న దీనిని ప్రతిగంటకొక డోసు వాడవలయును. (ఈ ఔషధమును, మూత్రమువెంట రక్తముపడుచున్న ముఖ్యముగ వాడవలయును.)

కార్బోవెజిటబిలిస్ 6 (Carb. Veg. 6):— స్రావము వాసనయున్న దీనిని వాడవలయును.

పల్సాటిల్లా 30 (Puls 30):—(ఎక్కువగ చీముయున్నప్పటికినీ కొద్ది చురుకుతో మూత్రము స్రవించుచున్న దీనిని వాడుటమంచిది.) ఇంజక్షనులు మొదలగు వానివలన రోగమడగియుండిగాని లేక యేకారణమువలననైనను రోగమణగియుండి బీజము లుబ్బరించినను పసుపువర్ణముగానున్న స్రావమునకును యిది పనిచేయును. పై వానివలన సుగుణమును బడయనిచో మెర్క్యూరియస్ సాలబిలిస్ (Mer. Sol.)

పెట్రోసెలినం (Petroselinum) కాప్సికం (Caps.) నాట్రం మురె (Nat. Mur) హిపార్ సల్ఫు (Hepar Sulpah) 6,30ను గుణగతములనుబట్టి వాడవలయును. ప్రస్తుతపు ఘనవైద్యుల ఇన్‌జక్షనులు (Injus) ఔషధమువలె రోగమునణచి పెట్టక నిశ్శేషముగను, నిర్మూలముగను కుదుర్చును. కనుక వీనిని గుణగతములనుబట్టి బహుజాగ్రత్తతో వాడిన రోగము అతిశీఘ్రముగ నివృత్తియగును.

స్త్రీలకు శెగరోగముయున్న కొపైబా 3ను (Copiba 3) సెపియ 30 ను (Sepia 30) వాడవలయును.

హైడ్రాస్టిస్ Q ను (Hydrastis Q) 15 మొదలు 20 చుక్కలు వరకు వక సోలెడు గోరువెచ్చని నీటియందు కలిపి స్త్రీలనుగాని, పురుషులకుగాని దినమున కొకమారు పిచ్చికారీ చేసుకొనవలయును.

జకరాండ గులాండి. Q (Jacaranda ·Gualandi Q) శెగరోగమువలని కంటిజబ్బు కలిగి నోటిలో పుండుయుండిన దీనిని రోజుకు 3 మోా॥లను వాడవలయును.

సాలిడాగోవర్జ Q 3 (Salidagovarja Q 3):— మూత్రపిండములందు నొప్పియుండి కొద్దికొద్దిగాగాని నల్లగాగాని మూత్రము స్రవించుచున్న రోజుకు 4 మోా॥ల నీయవలెను.



శాబాల్ శేరులేట Q 3 (Sabal Serruleta Q 3):— ముసలివారలకు కష్టివేసిననేగాని మూత్రము రాకయుండిన దీనిని వాడవలయును, సుగుణముబాగావున్న కొలదిని రోజుకు 2మో॥ల నీయవలయును. అటుల 4,3 మాసముల సేవించిన చాలును.

ఆర్నికా 30 (Arnica 30):- చేతకానటువంటివారలు కష్టివేయునపుడు లోన పొడుచుకొని పుండుపడి మూత్రము బహుకష్టముగా విసర్జించుచు, జ్వరముయున్నను దీనిని రోజను 4 మోా॥లను వాడుచుండవలెను.

విస్కంఆల్బ Q 6 (Viscum Alb Q, 6):- శగరోగము వలని ఆడవారలను కీళ్లు నొప్పులు కలిగిన రోజుకు 4 మో॥ల నీయవలయును.

థ్యూజ 6 (Thuja 6)- ఫిటోలక 6 (Phyto 6) మొగవారలకు శగరోగమువలన కీళ్ళు నొప్పులుయుండిన పై రెండిటిలో నొకదానిని వాడి సుగుణమును బడయనిచో రెండవదానిని వాడవలెను.

మెర్క్యూరియస్‌వివస్ 6 (Mer. viv. 6):— వాపు ప్రాముఖ్యముగనున్న దీనిని 5, 6 రోజులు వాడవలయును. రోజుకు 4 మో॥ల నిచ్చేది.

N. B. ఈవ్యాధి నయమగునంతవరకు, సైకిల్ ప్రయాణములు, గుఱ్ఱపుస్వారులు, విరేచనము బద్ధముకలుగజేయు పదార్థములు, మాంసము, కోడిగ్రుడ్లు, కాఫీ, చుట్టత్రాగుట లేక పొగాకునమలుట, మొదలగు దురభ్యాసపు పనులను ప్రయాణములను, ఆహారములను మానివేయుచు, ఇంటి యందే యుండవలెను. కొబ్బరికాయనీటిని మరబత్తులను ఆల్బకరాపండ్లను, నల్లని ద్రాక్షపండ్లనుమాత్రమే భుజించు చుండవలెను. సగ్గుబియ్యపుజావ మొదలగు చలువ పదార్థములనుగూడ భుజించుట మంచిది.

## 49. కొరుకుడు. (Chancraid)

మెర్క్యూరియస్‌సాలబిలిస్ 3, 30 (Mer sol. 3,30):— దీనికిది ప్రధానౌషధమైయున్నది, దీనివలన సుగుణము కనబడనిచో ఆసిడ్ నైట్రిక్ 6 (Acid Nit. 6) ను అర్సీనిక్ ఆల్బ 3, 6 (Ars. Alb. 3, 6) రోజుకు 4 మో॥లను వాడవలయును అంగముమీద పుండును పొటాషియం పర్మాంగనేడు (Pottassium Permanganade) లోషనుతో కడిగి దూదితో తడిలేకుండగ తుడిచి దానిమీద బోరిక్ ఆసిడ్ (Boric Acid) నైనను కాలొమెల్ (Calomel) నైనను చల్లికట్టును ప్రతిదినమునను కట్టుచుండవలయును.



N. B:_ కొరుకుడు కలిగిన 3 వారములలోగా వడిశగడ్డలుకూడ కలుగవచ్చును. అందువలన నైట్రిక్ ఆసిడ్ (Nitric Acid) మెర్క్యూరియస్ సాలబిలిస్ (Mer. sol.) లను వాడుచుండిన రాకుండ రక్షణగానుండును. రెండవది యీ పైరెండు మందులను కొరుకుడు వ్యాధియందు పుచ్చుకొనక అశ్రద్ధ చేసినచో, పుండు యందలి మాంసము తినివేయు స్వభావముగనుండి, ప్రాణములనుగూడ దీయవచ్చును.

## 50. వడిశగడ్డలు. (Bubo)

మెర్క్యూరియస్‌సాలబిలిస్ 3,30 (Mer. sol. 3,30):- దీనికిది ప్రధానౌషధమై యున్నది. దీనివలన సుగుణము కనబడనిచో ఆసిడ్ నైట్రిక్ 6 (Acid Nit. 6) ను వాడవలెను, ఇది రసము మొదలగు నౌషధములను వాడి నవి పనిచేయకున్న దీనిని వాడవలయును. దీనివలన 2, 3 రోజులలో సుగుణము కనుబడనిచో కార్బోయానిమలిస్ 6 (Carbo Animalis 6) ను గాని, బాడియాగ 6 (Badiaga 6 ) ను గాని వాడవలయును. దీనివలన బాగుగా తేలి పగులును. పుండు తినివేయునట్టి స్వభావముగాయున్న కెలి అయొడైడు 30 ను (Kali. Iodide 30) రోజుకు 4 మో॥లను వాడవలయును. చీముగాని నీరుగాని కారుచు యెన్నిరోజులకు మానకయున్న హీపార్ సల్ఫ 6 (Hepar Sulph 6) ను సైలీషి.యా 6, 30

(Silicea 6, 30) లను వాడుచు సక్కస్ కాలెండ్యులా (Succus Calendula) ను దూదియందుగాని, పరిశుభ్రమగు గుడ్డయందుగాని ముంచి పట్టీని పుండుమీద వేయవలయును. పట్టీ ఆరుచున్నకొలదిని బిగియును.

సక్కస్ కాలెండ్యులా చేయువిధము:—

బంతిపువ్వులు దొరుకుకాలమునందు బుట్టలతో తెప్పించి దాని తొడిమలు తీసి రోటియందువేశి మెత్తగా దంచి రసము తీసి అందు రెక్టిఫైడు స్పిరిట్టును 3: 1 గా కలిపి సీసాలయందు వుంచుకొనవలయును. ఇది గాయములకు బాగుగ పని చేయును. ఇది చీమును పట్టనీయక తొందరలో పుండును మానునట్లుగా చేయును. మేహకురుపులుకూడ పుండుపడి చీముకారుచు చాలారోజులవరకుమానకయుండినప్పుడు తగిన ఔషధమును లోపలకిచ్చుచు ఈ ఔషధ పట్టీవేసిన తొందరలో మానునట్లుగా చేయును.

## 51. కురుపులు. (Boils.)

బెల్లడోన 3, 6 (Belladona. 3, 6):— వాపునొప్పి యుండి, చీముపట్టకయుండిన దీనిని రోజుకు 4 మో॥ లను వాడవలయును. కురుపువల్ల జ్వరము కలిగినను దీనిని వాడ వచ్చును.



అర్సెనిక్ 6, 30 (Ars.6,30):— కురుపులు మంట లుగా నుండిన దీనిని వాడవలయును.

హీపార్ సల్ఫు 6,12 (Hepar. Sulph. 6,12):—కురు పులు చీముతో కూడి నొప్పియుండినను దీనిని 4 మో॥ ల చొప్పున వాడుచుండవలెను. తక్కువసత్తువగల యీమందును లోపలికి తినిన కురుపులు పగులును. 200 సత్తువనుగాని 1000సత్తువనుగాని వుపయోగించిన కురుపులు అణగిపోవును. (ప్రారంభమున దీనిని పెద్దసత్తువను వాడవలయును. అప్పుడు కురుపులు అణగిపోవును. కురుపుపెద్దదిగ నుండిన రోజుకు 6 మో॥ లను చిన్నసత్తువను వాడవలయును అప్పుడు కురు పు 1,2 రోజులలో తేలి పగులును.)

సైలీషియ 30 (Silicea 30):— కురుపునుండి చీము గాని నీరుగాని కారుచు దీర్ఘకాలమునుండి యున్నను దీనిని వాడవచ్చును. కురుపుమానకయుండు స్వభావమున్నగూడ నిది పనిచేయును. రోజుకు 4 మో॥లను వాడవలయును.

ఆర్నిక 30 (Arnica 30):— చిన్న చిన్న కురుపులు గుంపులు గుంపులుగానుండి, వకటి తరువాత నొకటి పుట్టుచు బాధగానున్న దీనిని వాడవలయును.

సల్ఫర్ 30 (Sulph. 30):— కురుపులు గుంపులు గుం పులుగాపుట్టి బాధవకచోటమాని మరియొకచోట పుట్టుచున్న దీనిని రోజుకు 4 మో॥లను వాడవలెను.

## 52. దురద. Itching of the Skin.

ఫాగోపెరం 3, 6 (Phagoperum 3, 6):—వెఱ్ఱిమొత్తి నట్లుగా శరీరమును యెప్పుడు గోకికొనుచుండిన రోజుకు 4 మో॥ల నీయవలయును.

మెజీరియం 30 (Mezerium 30):— గోకుచున్న కొలది చమ్మగానుండి, పుండుపడి నెత్తురువచ్చుచున్న దీనిని రో॥ 4 మో॥లను వాడవలయును. (ఈదురద ముఖ్యముగా తొడలకే కలుగును.)

డోలికోసు 3, 6 (Dolichos 3, 6):— దురదవలన నొప్పు మొదలగునవి గోడకువేసి రుద్దుకొనిననేగాని బాధ నివారణకాదని తలచుచు, అటుల చేయుచుండినదీనిని వాడవలెను.

సల్ఫర్ 30 (Sulph. 30):— వారమున కొక డోసు నీమందును తీసికొనుచు, లక్షణములనుబట్టి తదితర ఔషధములనుగూడ పుచ్చుకొనవలెను.

సెపియ (Sepia), కాల్కేరియ కార్బ (Cal. carb), సొరైనం (Psorinum), ఆర్సెనిక్ (Arsenic), హీపార్ సల్ఫ (Hepar Sulph), నక్సువామిక (Nux vom.), క్రోటన్ టిగిలియం (Croton Tig.), కాష్టికం (Caust.), స్టాఫిసాగ్రియ (Staphysagria), 6, 30 లను నకదానివెంట నొకదానిని సుగుణము కనుబడనిచో మార్చుచుండవలెను.



## 53. తామర. (Ring-worm.)

బెసిలినం 200 (Bacillinum 200):—వారమున కొక డోసు నిచ్చుచు, వకఔన్సు వ్యాసులైనునందు, యాసిడ్ క్రిసోఫానిక్ 7, 8 గ్రైనులను బాగుగ కలిపి, రోజుకు వకమారు పైన పూయుచుండవలెను. నాట్రంసల్ఫు 500, 1000 (Nat. Sulph. 500, 1000) నెలకొకమారు నొక మోతాదు పుచ్చుకొనవలెను.

టెల్లూరియం (Tellurium), హీపార్సల్ఫు (Hepar-Sulph), ఆసిడ్నైట్రిక్ (Acid Nit.), రుహాస్టాక్సు (Rhus. Tox), సెపియ (Sepia), గ్రాఫిటెస్ (Graphites), సల్ఫర్ (Sulph.), కెలాడియంసెగ్ (Caladium seg.) 6, 30 లను గూడ వకదానివెంట నొకదానిని సుగుణము కనబడనిచో వాడుట మంచిది.

## 54. సవాయిమేహము. (Syphilis.)

ఇదియొక అంటువ్యాధిగాన గర్భవతిగా నుండినప్పటి నుంచియు మెర్క్యూరియస్ సాలబిలిస్ 6 (Mer. sol. 6) రోజుకు 4 మోతాదులు వాడుచు, ప్రసూతియైన తరువాత బిడ్డలకును పైఔషధమును 2,3, మాసములు రోజుకు 3 మో॥ చొప్పున వాడిన పూర్తిగ నివారణ యగును. ఇది సవాయిమే

హామునకు ప్రధానౌషధముగాన పుండుగాని, వ్రణముగాని కనుపడిన ప్రథముననే దీనిని వాడవలయును. దీనివలన సుగుణము లేక పుండు అసాధ్యమని తెలిసిన మెర్క్యూరియస్ ప్రొటోఅయోడైడ్ 3, 6 ను (Mer. pro. Iod 6) వాడవలయును. కెలి అయోడైడు Q (Kali Iod. Q) ను గూడ ప్రథముననే మధ్యమధ్య వాడుచుండవలయును.

సిఫిలినం 200 (Syphilinum 200):— కాలికనీర్ఘరోగములకు దీనిని మాసమునకొక మోతాదు నిచ్చుచు 2 రోజులకు ముందును వెనుకను తదితరమందులను పూర్తిగా మానివేయవలయును.

ఫైటోలక 3, 6 (Phytolacca 3, 6):— మాంసగ్రంథులు గొంతువద్దను, చెవివద్దను, తొడలవద్దనుకలిగి, నోటిపూత, కీళ్ళునొప్పులుయున్న దీనిని వాడవలయును.

గ్రాఫైటెస్ 6 (Graphites 6):—చీము కారుచున్నటువంటి పొక్కులున్న దీనిని వాడవలయును. దీనివలన సుగుణము లేనిచో సైలీషియా 3, 30 లను (Silicea 3, 30) వాడవలయును. నీటివంటి చీముకలిగి మంటయున్న ఆర్సెనిక్ 6 (Ars. 6) ను వాడవలయును. ఎఱ్ఱని రాగివర్ణముగల పొక్కులున్న సల్ఫర్ 6 (Sulph. 6) ను వాడవలయును.

ఆరంమెటాలికం 6, 30 (Aurm. Met. 6, 30):— ఎముకలు నములుచున్నట్లు తీపుకలిగి, ముక్కుఎముక పగిలి



తినివేయునట్లుగా బొత్తబడి ఎల్లప్పుడు చింతగాను ఆశవిడుచుకొని అధైర్యముతోనున్న దీనిని వాడవలయును.

మెర్క్యూరియస్ కరోశివస్ 6 (Mer. Cor. 6):— మాంసగ్రంధులు లేచుచు పగిలి పుండ్లుబడుచుండిన దీనిని వాడవలయును.

ఆసిడ్ నైట్రిక్ 6 (Acid. Nit. 6):— రససంబంధము గు నౌషధములెక్కువగా నుపయోగించి, వాటివలన సుగుణము లేకుండిన దీని నువయోగించవలయును.

హీపార్ సల్ఫు 6, 30 (Hepar. Sulph 6, 30):—సవామేహామువలనగాని, రసము ఎక్కువగా నుపయోగించుటవలనగాని, ఎముక నొప్పులు కలిగినను చిగుళ్ళనుండి రక్తముకారుచున్నను దీనిని రోజుకు 4 మోతాదులను వాడవలయును,

మెజిరియం 6, 30 (Mezerium 6, 30):— రాత్రియందు ఎముకలు నొప్పులు ఎక్కువగానున్న దీనిని వాడవలయును.

సినబరిస్ 3 (Cinnabaris 3):— సవామేహామువలన కీళ్ళు నొప్పులుకలిగిన దీనినివాడవలయును. దీనివలన సుగుణము లేనిచో కాలిఅయోడైడు 3 30 (Kali Iod 3, 30)

ఫిటోలక 3, 6 (Phytolacca 3, 6) ను గుణగతములనుబట్టి వాడవలయును.

త్యూజ 30 (Thuja 30):— పులిపిరికాయలకును, సవాంమేహా తలనొప్పులకును నిది పనిచేయును.

55. కుసుమవ్యాధి. (Leucorrhoea or Whites.

కాల్ కేరియా కార్బ 6, 30 (Cal. carb 630):— యోనినిస్థానమునందు దురద, మంట నొప్పి, పాలవలెతెల్లని స్రావముకలిగిఅనువంశకముగాకలుగుచున్ననురోజుకు 4 మో॥లను నీయవలయును. ఇది ఉదయమున స్రావముయెక్కువగా నున్నగూడ పనిచేయును.

పల్సాటిల్లా 3, 6, 30 (Puls. 3, 6, 30):— ఇదిఅన్ని స్రావములకు పనిచేయును. పాలవలె దట్టముగా స్రవించుచు కొంచెము మంట, కుట్టుచున్నట్టినొప్పి, అజీర్ణము, వాంతి వచ్చుచున్నట్లుండుట నెలసరి తరువాత స్రావము ప్రారంభమగుచున్న దీనిని వాడవలయును.

నక్సువామిక 30 (Nux Vom. 30):— పసుపువర్ణముగానుండి నెలసరిలో ప్రారంభమగునెడల రోజుకు 4 మో॥లను వాడవలయును.



సెపియ 6, 200 (Sepia 6, 200):— ప్రసవసంబంధమగు నొప్పులు, విరోచనబద్ధకము, ఆకుపచ్చగాగాని, లేక నీటివలెగాని, వాసనతోగూడి కుసుమముకలిగి స్త్రీసన్నగాను బహుసీరసముగానున్న, దీనిని ముఖ్యముగా వాడవలెను. దీనివలన సుగుణములేనిచో చైనా 6, 30 (China 6, 30) లను రోజుకు 4 మో॥ల వాడవలయును.

యాసిడ్ ఫాస్ 30 (Acid Phos 30):— పలుచగాను పసుపువర్ణముగాను కలుగుచు, నెలసరి తరువాతప్రారంభమగుచుండిన దీనిని వాడవలయును.

యాసిడ్ నైట్రిక్ 6 (Acid Nit6):— వామేహా సంబంధమువలనను, రసమెక్కువగా నుపయోగించుటవలనను కలిగిన రోజుకు 4 మో॥ల నీయవలయును

క్రియోసోటం 6 (Kreasote, 6):— పచ్చనిస్రావము వాసనతోనుండి నెలసరి తరువాత 4, 5 రోజులకు ప్రారంభమగుచు, యోనిస్థానము పైభాగమునందలి వాపు, దురద, కుట్టుచున్నట్టి నొప్పి, నడుము నొప్పులుయున్న దీనిని వాడవలెను.

ఆర్సెనిక్ ఆల్బ 6,30 (Ars. Alb 6,30):— స్రవించుచున్నప్పుడు మంటయున్న దీనిని వాడవలయును.

మెర్క్యూరియస్ సాలబిలిస్ 30 (Mer. Sol 30):— మంట జల కలిగి రాత్రులయందు యెక్కువగుచున్న దీనిని వాడవలెను. దీనివలన సుగుణము కనుపడనిచో అల్యూమిన 30 ను (Allumina 30) వాడవలెను. ఇది దీర్ఘ కాలపు వ్యాధిగానుండినను యిది పనిచేయును. రోజుకు 4 మో॥ చొ॥న వాడుచు పైవాటివలన సుగుణము లేనప్పుడు సల్ఫర్ 30 ను 4 రోజులకొక మోతాదు నిచ్చుచు, నీయౌషధములను పరిస్థితులనుబట్టి వాడుటమంచిది.

హెలోనియాస్ Q (Hellonias Q):— ఇది అన్నివిధములగు స్రావములకును ప్రధానౌషధమైయున్నది.

గ్రాఫిటిస్ 3 (Graphitis 3), హైడ్రాస్టిస్ 3 (Hydrastis 3), సైలీషియా 6 (Selicea 6), శాబినా 6 (Sabina 6), ఫెరంమెటాలికం 6 (Fer. Met 6), కెలిబైక్రోమికం 6 (Kali Bi. 6), కార్బోవెజిటబిలిస్ 6 (Carb. Veg. 6), మెజీరియం 6 (Mezerium 6), జింకంమెటాలికం 6 (Zinc. Met. 6), యాంబ్రగ్రీషియ 6 (Ambra Gri. 6), కాస్టికం 30 (Caust. 30) లనుగూడ పరిస్థితులనుబట్టి వక దానివెంట నొకదానిని సుగుణము కనుబడనిచో వాడుటమంచిది.

### 56. మధుమేహము, అతిమూత్రము.
### ( Diabeetes Mellitus, Diabetes Inspidus).

మధుమేహము పిత్తాశయ జబ్బువలనను పెరుగు, ఆజ్యము, మద్యము, ఉదకము, బెల్లముతో చేయబడిన ద్రవ్యములు, పొగమిక్కుటముగా సేవించుటవలనను, మూత్రము తేనె వర్ణముగానుండి, విసర్జించిన స్థలమున చీమలు, ఈగలు ముసురుకొనియుండును. ఈ మూత్రము వగరుగను, తీపిగను, బంకగను వెడలుచు, ఎక్కువదప్పి, ఒడలుమంటలు, బలక్షీణము, విరేచనబద్ధము, అతిఆకలి, నాలుక ఎఱ్ఱగానుండుట, చిగుళ్ళనుండి రక్తముకారుట, ఒడలు చిన్నచిన్నపొక్కులతో నుండి ముఖ్యముగా మర్మస్థానమున దురదగలిగి యుండుట, రాచపురుపులు, కణుపుజెట్టలు మొదలగు దుర్లక్షణములతో వ్యాధికూడియుండును.



ఆసిడ్ ఫాసు 3,12 (Acid Phos 3,12):— విస్తారమైన తెల్లసిమూత్రము, నరముల బలహీనత, రాత్రియందు నడుము నొప్పి, ఒడలు శుష్కించియుండుట, ఇంద్రియనష్టము, మనస్సు నెమ్మదిలేకయుండుటయున్న దీనిని వాడవలయును.

సిజిజియంజాంబోలినం Q,3 (Spzygium Jam. Q,3):— అతిమూత్రమునందును, మధుమేహమునందును ఇది ప్రధానౌషధమైయున్నది.

నాట్రంసల్ఫ 200, నాట్రంఫాసు 200 (Nat. Sulph 200, Nat. Phos 200):— ఇవి అతిమూత్రమునందును, మధుమేహమునందును పనిచేయును. వీనిలో నొకదానిని ప్రారంభదశయందుగాని, పురాణవ్యాధిగానున్నప్పుడుగాని, తత్తితరఔషధములవలన సుగుణము లేనప్పుడు, ప్రధా

సౌషధములుగా వాడవలయును. 4,5 వారములు సేవించినచో మధువుకొద్దిగాతగ్గి, 4,5 మాసములలో పూర్తిగ నివారణయగును. మధుమేహముతోబాటు వాతము ప్రకోపించి, చిన్నకీళ్ళు వాచి ఎఱ్ఱగానుండినను ఇవి పనిచేయును. రోజుకు 2 మో॥ల నుపయోగించవలెను.

లాక్టిక్ ఆసిడ్ 3 (Acid Lactic 3):— అతిమూత్రమునకును, మధుమేహమునకును నిదిగూడ ప్రధానౌషధమని చెప్పవచ్చును.

యురానియం నైట్రికం 1, 6 (Uranium Nit 1,6):- మూత్రమునందు మధువుకలిగి, అజీర్ణము, ఎక్కువదాహము, విరేచనబద్ధము, నిద్రలేమి, మూత్రము విడిచినతరువాతమంట ముక్కువెంట తీగెలగానుండు చిక్కని పడిశము, కన్నులు పుసులచే నిండియుండుట, బలహీనతయున్న దీనిని రోజుకు 4 మో॥లను వాడవలయును.

రుహస్ ఆరోమాటిక Q (Rhus Aromatica Q):— దీనినిగూడ, అతిమూత్రమునందును మధుమేహమునందును వాడవలయును. ఒక $\frac{1}{2}$ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందు 10 చుక్కలనువేసి మోతాదుగా నీయవలెను. అటుల దినమునకు 3 మో॥ల నిచ్చిన చాలును.

సైలీషియా 3, 6 (Silicea 3, 6):— అతిమూత్రమునందు తదితరఔషధములవల్ల ప్రయోజనములేనిచో దీనిని



వాడవలెను. ఉబ్బురోగమునందు అతిమూత్రముయున్న నిది బాగుగ పనిచేయును.

అర్సెనిక్ 6, 30 (Ars. 6, 30):— మూత్రము విడుచుచున్నప్పుడు మంటయున్న దీనిని వాడవలెను.

కాంథరిస్ 6 లేక టర్బెంథినా 6 (Canth. 6 or Terbenth 6):— మోకాలియందు నీరుకలిగి, బలహీనతతో అతిమూత్రమున్న నిది పనిచేయును.

అర్జెంటం మెటాలికం 3, 30; సిల్లా 1, 3(Arg. Met. 3, 30; Scilla 1, 3):— మూత్రము విస్తారమైనదిగను, వెలవెలబోవుచున్నట్లుగనున్న వీనిలో నొకదానిని రోజుకు 4మో॥లను వాడి సుగుణము లేనిచో రెండవదానిని వాడవలెను. దెబ్బ తగులుటవలన అతిమూత్రము కలిగినను దీనిని వాడవచ్చును.

అర్నికా 3, 30 (Arnica 3, 30):—అతిమూత్రములో స్మృతితప్పి మత్తుగాపరుండి (Coma in Diabetes) యున్న దీనిని $\frac{1}{2}$ గంట కొక మోతాదు నీయవలెను.

క్రియోసోటు 6 (Kreosote 6):— మూత్రమునకు వెళ్ళవలెనని కోరిక కలిగి ఆపుకొన లేకయుండుట, వెంటవెంటనే విస్తారమైన తెల్లని లేక ఎఱ్ఱని మూత్రమును విడుచుచున్న దీనిని రోజుకు 4 మో॥ లను వాడవలయును.

N. B:— వేడిగానుండు అన్నమును, చారును, కూరలను, టీ, కాఫీ మొదలగు వాటిని సేవించక, గోరువెచ్చగానుండు ఆహారపదార్థములను సేవించవలెను. తీపిపదార్థములను పూర్తిగా విసర్జించుట మంచిది.

57. నొప్పితోకూడిన ఋతుస్రావము. (Dysmenorrhoea).

ఛమోమిల్లా 12, 30 (Chamomilla 12, 30):— నొప్పియెక్కువగానుండి, ఋతుస్రావము నలుపుగానగుచు, ఎక్కువ పైత్యాధిక్యతయున్న దీనిని వాడవలయును.

పల్సటిల్లా 30 (Puls 30):— బహుకొద్దిగాఋతుస్రావమగుచుండుట; యోనియందును, పొత్తికడుపుయందును, వీపుయందునునొప్పులుకోయుచున్నట్లుగానుండుట; చలి, అజీర్ణము, తలతిరుగుడు, నొప్పులు కీళ్ళయందుయున్నప్పటికినీ, వకచోట నుండక మరియొక్క కీలున కనుబడుట ; నొప్పులు ముఖ్యముగ తరుణవయస్కులగు స్త్రీలకుండిన దీనిని వాడవలయును.

శాబిన 30 (Sabina 30):—ప్రారంభమున నొప్పికలిగి, ఋతుస్రావమగుచున్నకొలదిని నొప్పితగ్గుచుండిన దీనిని వాడవలయును.

సిమిసిఫ్యూగ 6 (Cimicifuga 6):— ఋతుకాలముకు ముందు తలనొప్పి ; ఋతుకాలమునందు పొత్తికడుపు, నడుము ప్రసవవేదనంత నొప్పులుగాకనుబడుట; ఋతుస్రావము నల్లగను, కొద్దిగను లేకయెక్కువగను అగుచున్న దీనిని



వాడవలెను. (చిరచిరలాడెడు స్వభావముగల వారలకును, సర్వప్రపంచక దూషకత్వముగలవారలకును నిదిపనిచేయును )

బెల్లడోన 6 (Belladona 6):— నెలసరి కొకరోజు ముందుగ యోనియందును, గర్భమునందును నొప్పికలిగియుండుట, తలతిరుగుడు, నేత్రములు, ముఖము ఎఱ్ఱబారి కొద్దితలనొప్పియున్న దీనిని రోజుకు 4మో॥ వాడవలయును.

నక్సువామిక 30 (Nux-vom. 30):— మలబద్ధము, మూలవ్యాధి, అజీర్ణముకలిగి మూత్రమునకు యెక్కువమారులు వెళ్ళుచుండుట, ఋతుకాలమునందు నొప్పియున్న దీనిని రోజుకు 4 మో॥ వాడవలయును.

జెల్సిమియం 3, 12 (Gelsemium 3,12):— యోనిస్థానమునందు నొప్పివలన అటుయిటు కొట్టుకొనుట, లేక పొరలుట, యోనిస్థానమునందును, పిరుదలయందును కండెలు కట్టినట్లుగా నొప్పి గర్భమునందును, లేక దాహమునుండి మెడవరకు నొప్పికలిగి జ్వరమున్నను నిది బాగుగపనిచేయును. కొంతమంది కలోఫిలం 3,12 ను గూడ మధ్యమధ్య యిచ్చుచుందురు.

కోక్యులస్6(Cocculus 6):-బిగపట్టుచున్నట్టిగాని కుట్టుచున్నట్టిగాని నొప్పి, గుండెయందు బరువు,పూర్తిపీల్చుట కష్టముగానుండుట,నల్లగాగాని లేక తెల్లగాగాని, ఋతుస్రావము, తలనొప్పి, వికారముతోవాంతి, కడుపుఉబ్బరము, అప్పుడప్పుడు మూర్ఛ

వచ్చుచు యోనిస్థానమునందు నొప్పికలిగియున్న రోజుకు 4 మోతాదులు యివ్వవలయును, జ్వరముయున్న నిది బాగుగ పనిచేయును దీనివలన సుగుణము కనుబడనిచో క్సాంతోక్సిలం 3,6 (Xanthoxilum 3,6) ను పై విధముగా వాడవలయును.

హెలోనియాస్ 3, 6 (Helonias 3, 6):— యోనిస్థానమునందు ఎక్కువగానొప్పి, మోకాలియందును, నడుముయందును యెప్పుడునువిడువకుండ నొప్పిగనుండుట, స్రావము తీగెలవలెనుండుటయున్న దీనిని వాడవలయును.

సికేల్ కర్ 6 (Secale cor 6):— ఋతుకాలమునకు కొద్దిరోజులపూర్వముననే నల్లనివాసనగల స్రావము పెద్ద ప్రేగులయందును, గర్భమునందును, యోనిస్థానమునందును నొప్పి, శరీరమంతయు చెమటగానుండి, ముఖ్యముగా పాదములుచేతులు చెమటగలిగియుండుట, నాడియందు నీరసము మూత్రాశయమునందును, ఆసనమునందును నొప్పి, ఋతురక్తము బాగుగనగుచున్నకొలదిని నొప్పులుతగ్గుచున్న దీనిని వాడవలయును.

మాగ్నీషియా ఫాస్ 3, 6 (Mag. Phos. 3, 6):— మూత్రాశయమునందును, గర్భమునందును నొప్పి ఆగిఆగి వచ్చుచుండిన వేడినీటియందు 12 మొదలు 15 మాత్రలు వరకు వేసి కరిగినతరువాత తడవకొక చంచా మోతాదు



చొప్పున వుద్రేకమునుబట్టి ప్రతి 15, 20, 30 నిమిషములకొకమారు మోతాదుగా నీయవలయును.

వైబర్నం ఓపులస్ 3,12 (Viburnum Opulus3,12):— ఋతుసమయమునందే నొప్పి ఆగిఆగివచ్చుట, మూత్రకోశము నందుండినొప్పి గర్భమువరకు కలుగుట ఈనొప్పి షుమారు 10, 12 గంటలసేపుయున్న దీనినిరోజుకు 4 మోతాదుల చొప్పున నీయవలయును.

## 58. యెక్కువగా ఋతుస్రావమగుట.
## (Menorrhagia.)

బోరాక్సు 6 (Borax6.):— తరుచు 2, 3 సారులుగ నెలకు ఋతురక్తమగుచుండుట, స్రావముయెక్కువగ నగుచు పొత్తికడుపుశూల, వికారముయున్న రోజుకు 4 మోతాదులను వాడవలయును.

మాగ్నీషియా కార్బ 6 (Mag. Carb. 6):— రాత్రియందెక్కువగా స్రవించుచున్న దీనిని వాడవలయును.

ఆర్సినిక్ ఆల్బ 3, 6, 200 (Ars. Alb. 3, 6, 200):— కుసుమవ్యాధితో కలసి రక్తస్రావము యెక్కువగ నగుచు దీర్ఘకాలపువ్యాధిగానుండి నిస్సత్తువయున్న దీనిని వాడవలెను.

పల్సాటిల్లా 6 (Puls. 6):—గర్భవతికిగాని, ప్రసవస్త్రీకిగాని, వీపు పొత్తికడుపు, ఇతర స్థలములందును నొప్పులు కలిగి అతివిస్తారముగా రక్తస్రావముయున్నదీనిని వాడవలెను.

ఇపికాక్ 30 (Ipecacu 30):— వికారము, తలనొప్పి ముఖము వెలవెలబోవుచునుండి చల్లగ నుండుట, ఎఱ్ఱగ రక్త స్రావము అతిగా నగుట, వాంతి వచ్చినట్లుండుట, యోని యందు తీపుగాగాని, బరువుగాగాని యున్న రోజుకు 4 మో॥ల నీయవలయును. ప్రసూతి అయిన తరువాత ఈలక్షణములు కనుబడి రక్తమెక్కువగా స్రవించుచున్న నిది అద్భుతముగా పనిచేయును.

కాల్ కేరియా కార్బ 6, 30 (Cal. carb 6, 30):— ఋతు రక్తమతిగా నగుచు, కుసుమవ్యాధి యోనియందు జిల మంటయున్న దీనిని వాడవలయును.

సల్ఫర్ 30 (Sulph. 30):— రక్తము విస్తారముగా నగుచు గడ్డ కట్టుట, సలుపు, చర్మమనారోగ్యముగానుండుట యున్న రోజుకు 4 మో॥ల నీయవలయును.

చైనా 6 (China 6):—చెవియందు గుయ్యుమనుధ్వని యోనిస్థానమునందు మంట, స్రావము నల్లగాను చిక్కగాను యుండి అతిగానగుచు నిస్సత్తువయున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలయును.

ఎరిజెరన్ 3 (Erigeron 3):— మూత్రకోశము, యోనిస్థానము వాపుగానుండి, ప్రసూతి అయినవెంటనే రక్త స్రావము యెఱ్ఱగను, ఎక్కువగనుయున్న దీనిని వాడవలెను.

ఆర్నికా 6, 30 హెమామెలిస్ 3 (Arnica 6, 30; Hemamelis 3):—దెబ్బ తగులుటవలని మూత్రముకోశము



నుండి రక్తము స్రవించుచున్న దీనిని గంటకొక మోతాదు వాడవలయును.

ప్లాటినా 6 (Platina 6):—నీటివంటిగాని లేక నల్లని చిక్కటి స్రావము, పొత్తికడుపు గర్భము బిగదీయునట్లుగా నుండుట, వీపుయందు యోనిస్థానమునందును నొప్పి సంభో గము నందెక్కువ కోరికగానుండుట, మూత్రకోశము వాపు యున్న క్రోకస్ సతీవ 3 ను మార్చుచు రోజుకు 6 సార్లుగా నీయవలయును.

క్రోకస్ సతీవ 3 (Croccus Sat. 3):— తీగలవంటి నల్లనిస్రావము లేక నీటివంటి రక్తస్రావము లేక రక్తస్రావము వాసనగనుండుట, నడుచుచున్నప్పుడు స్రావమెక్కువగనగుట, శరీరము పైకి చల్లగానుండినను లోపలవేడియున్న రోజుకు 4 మో॥ నీయవలయును. క్రోకస్ సతీవ 3 (Crocus Sat. 3) ఋతుదినములందు 3 రోజులు మాత్రమే నిచ్చి, తదితర దిన ములందు చైనా 6 (China 6) ను రోజుకు 4 మో॥ లను వాడవలయును.

శాబిన 6 (Sabina 6):— మూత్రపిండములయందు వాపుకలిగి, చూపు అలికినట్లుగానుండుట, యెక్కువగ స్రావముయున్న దీనిని రోజుకు 4 మో॥ నీయవలయును. ఇది లావుగానుండు స్త్రీలకు బాగుగ పనిచేయును. ఇది గర్భ స్రావము అయిన తరువాతను, ప్రసూతి అయిన తరువాతను

యెక్కువగ రక్తము స్రవించుచున్న నిదిబాగుగ పనిచేయును. ఋతుస్రావమెక్కువగ నగుటవలన బలహీనతకలిగిన, పల్సటిల్లా 6 (Puls 6), ఫెర్రంమెటాలికం 6 (Fer. Met. 6), చైనా 6 (China 6), ఆర్సెనిక్ 6 (Ars. 6) ను వకదానివెంట నొకదానిని సుగుణము లేనిచో మార్చుచుండవలెను.

దేహామందలిరక్తము చలనముతగ్గుటచేతను, జ్వరము చేతను ఋతుస్రావమెక్కువగ నగుచున్న అకోనైటు 6 ను (Aconite 6) వాడవలయును.

కీళ్ళయందలి నెప్పులతో ఋతుస్రావమెక్కువగ నగుచున్న సిమిసిఫ్యూగ 6ను (Cimicifuga 6) వాడవలయును.

విరేచనములు, దగ్గు, డగ్గుత్తిక, ఋతుస్రావమెక్కువగ నగుటయున్న కాల్ కేరియకార్బ 6 ను (Cal. Carb 6) వాడవలయును

ఆలోచనలవలనను, యెక్కువ సంభోగేచ్ఛవలనను ఋతుస్రావమెక్కువగుచుండిన ఫాస్పరస్ 6 ను (Phos. 6) వాడవలయును.

ట్రిల్లియం 6 (Trillium 6):— కొద్దిగా నిస్సత్తువ కలిగి, అప్పుడప్పుడు యెక్కువగా ఋతుస్రావమగుచుండిన దీనిని రోజుకు 4 మో॥ లను వాడవలయును.

శెకేల్ కర 30 (Secale-cor 30):— విస్తారముగ నగుచు, నెలకు 2, 3 సార్లు ఋతురక్తమగుచుండిన దీనిని ప్రధానౌషధముగ వాడవలయును.



## 59. ఋతుస్రావము పరిమాణము తగ్గివచ్చుట.

(Scanty Menstauation.)

సెపియ 30 (Sepia 30):— కుసుమవ్యాధికలిగియుండి ఋతుస్రావము కాకుండుట, పాండురోగము, శరీరము పసుపుపచ్చని వర్ణముబారియుండుట, వాంతి, తలనొప్పి, చల్లనిగాలి భరింపలేకయుండి అలసటయున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

పల్సటిల్లా 6 (Puls. 6):— ఋతుస్రావము బహువలుచనగాను, నొప్పిగానుఅగుచు, కోయుచున్నట్లుండు నొప్పులు చలి, ఒడలు పచ్చగానుండి నిగనిగలాడుచుండుట, ఋతుకాలమునందును, ముందును, నడుమునొప్పులు కలిగి, ఋతుస్రావము పరిమాణము తగ్గియగుచున్న దీనిని వాడవలెను

అకోనైటు 3; బెల్లడోన 6 (Acon. 3 Bell. 6):—రక్తాధిక్యముచే కలిగిన దీనిని రోజుకు 4 మో॥ల చొప్పున 2 ఔషధములను వాడుచుండవలెను.

సల్ఫర్ 30 (Sulph 30):— మలబద్ధము, చర్మము అనారోగ్యముగనుండుట, ఋతుస్రావము క్రమము తప్పివచ్చుచు పరిమాణము తగ్గు, శరీరము వేడిగానుండుటయున్న దసన వాడవలయు

యున్నవి. కొందరు చైనా (China) నాల్గురోజులును, పల్సటిల్లా (Puls) నాల్గురోజులును మార్చుచు రోజుకు 4 మో॥ల చొప్పున వాడుచుందురు.

62. ఋతుస్రావము ఆగిపోవుట. (Amenorrhoea)

బెల్లడోన 3, 6 (Belladona 3, 6):— చూపు అలికినట్లుగా కనుబడుట, కనుగ్రుడ్లు నొప్పి, జ్వరముండి సంధికలిగినప్పటికిని దీనిని వాడవచ్చును. మూత్రకోశమునందును యోనిస్థానమునందును నొప్పికలిగిన దీనిని వాడవలెను.

బ్రియోనియ 6 (Bry. 6):— ముక్కునుండి రక్తము స్రవించుట, దగ్గు, రొమ్ములయందును, ప్రక్కలయందును కుట్టుచున్నట్టినొప్పి, గర్భమునందు నొప్పియున్న దీనినిరోజుకు 4 మో॥లను వాడవలెను.

శెపియ 6 (Sepia 6):— పొత్తికడుపు నొక్కుచున్నప్పుడును, నడచుచున్నప్పుడును నొప్పిగనుండుట, విచారముచే మనస్సు క్రుంగినట్లుగానుండి, ఒంటరిగానుండుట కిష్టపడుచున్న దీనిని వాడవలయును

అకోనైటు 6 (Acon 6):— జలుబువల్ల ఋతుస్రావమాగిన దీనిని వాడవలయును. దీనివలన సుగుణము లేనిచో, పల్సటిల్లా 3 ను (Puls 3) వాడవలెను.

ఇగ్నీషియ 6 (Ignetia 6): మానసిక విచారములచే ఋతుస్రావము ఆగిన దీనిని వాడవలయును.



ఫెర్రంమెటాలికం 6 (Fer. Met. 6):—శరీరము పాలిపోయి నిగనిగలాడుచుండుట, విరేచనములు కలిగి ఋతుస్రావము ఆగియున్న దీనిని వాడవలయును. దీనివలన సుగుణము లేనిచో కాల్కేరియకార్బ 30 ను (Cal. Carb 30) రోజుకు 4 మో॥ లను వాడవలయును.

ఋతుస్రావము ఆగియుండుటవలన గర్భమునందు నొప్పికలిగిన జెల్సీమియం (Gelse,), ఛమోమిల్లా (Cham.), మాగ్నీషియాఫాసు (Mag-phos) 3_12 లను, వకదానివెంట నొకదానిని సుగుణములేనిచో మార్చుచు, రోజుకు 4 మో॥ లను వాడుచుండవలయును. సిక్లమెన్ 6 (Cyclamen6.), అర్సెనిక్ 6 (Ars. 6) నాట్రంమూర్ 6 (Nat. Mur 6) హెలోనియాస్ 3,6 (Helonias 3,6), బెల్లడోన 3 (Belladon 3), లనుగూడ పరిస్థితులనుబట్టి వాడుటమంచిది.

63. ఋతుస్రావము ఆలస్యముగ వచ్చుట.
(Delayed Menstruation.)

పల్సటిల్లా 3,30 (Puls. 3,30) :—నడుముపొత్తికడుపు నొప్పి, తలతిరుగుడు లేక తలనొప్పి, అరుచి, చలి, వికారము, దడ, శరీరము పాలిపోయియుండి నెలసరి ఆలస్యముగ వచ్చుచున్న దీనిని రోజుకు 4 మో॥లను వాడవలెను. కుసుము వ్యాధితో నెలసరి ఆలస్యముగ వచ్చుచున్న సెపియ 6 ను

(Sepia 6) గాని అకోనైటు 3 (Acon 3) ను గాని రోజుకు 4 మోIIలను వాడవలయును.

బ్రయోనియ 3,30 (Bryonia 3,30):—ఋతుస్రావమునకు బదులుగాముక్కువెంట, నోటివెంట రక్తము స్రవించుచు, పొడిదగ్గు, విరేచనబద్ధము, రొమ్ములయందు కుట్టుచున్నట్టి నొప్పి, ఋతుస్రావము ఆలస్యముగ వచ్చుటయున్న దీనిని రోజుకు 4 మోII లను వాడవలయును.

సెనిసియో (Senecio Q):— ఋతుస్రావము రజస్వలానంతరమున క్రమముతప్పివచ్చుచు పరిమాణము తగ్గుచున్న దీనిని వాడవలయును. ప్రథమరజస్వలయందు కడుపునొప్పికలిగిన బెల్లడోన 6 ను (Belladona 6) వాడవలయును.

వెరాట్రంఆల్బ 3,6 (Verat. Alb 3,6):— తలనొప్పి, మూర్ఛలేక బలహీనతవలన ప్రాణముసొమ్మసిలబోయి పడియుండుట, వికారము లేక వాంతి, విరేచనములు, పాదములు, చేతులు, ముక్కుచల్లగనుండుటయున్న దీనిని గంటకొక మోతాదునీయవలెను.

సల్ఫర్ 30 (Sulph 30):— స్థనములయందునొప్పి, తలనొప్పి, అజీర్ణము, విరేచనబద్ధము, రక్తమల, శబ్దమును భరింపలేకయుండి నిశ్శబ్దముగానుండు స్థలములందుండుట కిష్టపడుచున్న దీనిని రోజుకు 4 మోIIను వాడవలయును.



సిమిసిఫ్యూగ 6 (Cimicifuga 6):—ఋతుస్రావమాలస్యముగ వచ్చుట, తలనొప్పి, నిద్రలేకయుండుట, ఎడమస్థనమునందు నొప్పియున్న దీనిని రోజుకు 4 మోIIలను వాడవలయును.

దగ్గు, విరేచనములు దగ్గుతోకయుండి, ఋతుస్రావము ఆలస్యముగ వచ్చుచుండిన బెసిలినం 200 (Becilinum 200) కాల్కేరియఫాసు 6, 12 (Cal. Phos 6, 12), అయోడియం 6 (Iodium 6)ను వాడవలయును.

పాండురోగమువల్లను బలహీనతవల్లను ఋతుస్రావము ఆలస్యముగ వచ్చుచుండిన నాట్రమ్‌మూర్ 6, 12 (Nat. Mur. 6, 12) చైనా 6 (China 6) ఫెర్రంమెటాలికం 6 (Fer. Met. 6) ను వాడవలయును.

అజీర్ణమువలన కలిగిన సల్ఫర్ 30 (Sulph. 30) నక్సువామిక 30 Nux-Vom 30) పల్సటిల్లా 6 (Puls 6) లైకపోడియం 6 (Lycopodium 6) లను వకదానివెంట నొకదానిని సుగుణములేనిచో మార్చుచుండవలెను,

## 64. అపస్మారము. (Hysteria.)

ఇది స్త్రీల రజోదోషమువలనను నరముల బలహీనతవలనను అనువంశక అపస్మారము అనగా తల్లికి మొదలగు వారికి అపస్మారముండుటవలన, వారిసంతతికిని తరుచు అట్టి జబ్బు కలుగవచ్చును. ఇట్టిదానిని అనువంశక అపస్మార

మండును. ఇట్టి ముఖ్య కారణములవలనను నీఅపస్మారము అసంఖ్యాయైన లక్షణములతో ప్రత్యక్షపడును. సామాన్యముగ సంభవించెడు లక్షణములు యేవియనగా! ఉండలేక గుండు గర్భమునుండి, ఎదురురొమ్ములలోగా తలలోనికి కదలుచున్నటుల, ఒడలుకంపముతో ఈడ్పులుగలుగజేయుచుమూర్ఛ తలనొప్పి, వాంతి, కడుపుబ్బరము, మూత్రబంధన, నోరు తెరుపుడుబడినను నీళ్ళు మ్రింగుడుబడకయుండుట, పిత్తాశయమున గర్భమున నొప్పి కలిగియుండుట, మాటాడలేకపోవుట మొదలగు లక్షణములతో కూడియుండును.

ప్లాటిన 6 30 (Platina 6, 30):— ఋతుస్రావ మెక్కువగ నగుటవలనగాని, ఆగుటవలనగాని కలిగి ఎల్లప్పుడు దుఃఖముగానున్న దీని వాడవలయును.

ఇగ్నీషియ 6,30 (Ignetia 6,30):—మానసిక విచారములవలన కలిగిన దీనిని ప్రధానౌషధముగ వాడవలయును. ఒక్కొక్కప్పుడు విచారముగను, ఒకప్పుడు ప్రకాశముగను రోగి కనుబడుచుండిన నిది బాగుగ పనిచేయును. ఉండలేక గుండు గర్భమునుండి గొంతువరకు తిరుగుచున్నట్లుగానుండుట, నీరుమ్రింగుడు బడకయుండుట, కాలుసేతులు కంపముచే కొట్టుకొనుట, తలవేడిగనుండుట, కంటివెంట నీరు విస్తారముగ కారుచుండుట, కొంతసేపు ఏడ్పు, కొంతసేపు నవ్వుయున్న దీనిని రోజుకు 4 మో॥ చొప్పున 4 మాసములు సేవించవలెను.



నొప్పితో కూడిన ఋతుస్రావమువలనగాని, ఋతుస్రావము ఆగిపోవుటవలనగాని అపస్మారముకలిగిన, పల్సటిల్లా 6ను (Puls. 6), శాబినా 6 ను (Sabina 6), సైలీషియా 6,30 లను (Silicea 6,30) కోక్యులస్ 6 ను (Cocculus 6) వక దానివెంట నొకదానిని సుగుణము లేనిచో మార్చుచుండవలెను.

ఎసఫోయిటిడా 6 (Assafoetida 6):— గర్భమునుండి గొంతువరకు ఉండ తిరుగుచున్నట్లుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కష్టతరముతో పీల్చుట, కడుపుబ్బరముయున్న దీనిని వాడవలయును.

సిమిసిఫ్యూగ 6 (Cimicifuga 6):— అవిశ్రాంతితో బాటు గర్భాశయరోగములు అనగా కుసుమ, రజోదోషము లుండి, ఎడమస్థనమునందు నొప్పియుండి, వేగముగ కోపము వచ్చు స్వభావము కలవారలకును, మనుష్యద్వేషము వేయేల! సర్వప్రపంచ దూషకత్వముగలవారలకు నిది బాగుగ పని చేయును. రోజుకు 4 మో॥లను వాడవలయును.

వెలేరియానా 3,12 (Valeriana 3,12):— అపస్మారము నందుగలుగు సంధికిని, అపస్మారము తరువాత కనుబడు యే దుర్లక్షణములకైనను నిది పనిచేయును.

కాస్టికం 6,30 (Causticum 6,30):—గర్భమునందు గాని గొంతుయందుగాని నొప్పి, అతిమూత్రము, బొంగురు గొంతుక, విచారకరమైనమనస్సుయున్న దీనిని వాడవలెను.

బెల్లడోన 6 (Belladona 6), నక్సువామిక 30 (Nux-vom 30) నక్సుమొశ్చాట3,12(Nux. Moschata3,12) హైసామస్ 6 (Hyos. 6), అరమెటాలికం 6 (Aur. Met. 6) టారెన్ట్యుల 6 (Tarentula 6), జింకంఫాసు 3 (Zinc Phos 3) లనుగూడ గుణగతములనుబట్టి వాడవలెను.

N. B:— అపస్మారమురాగనే గుంపును దూరముగ నుండునట్లుచేసి చల్లనిగాలిని తగులనీయవలెను. ముఖము మీదను మెడదుమీదను చల్లనినీటినిచల్లి, గట్టిగాబిగించి యుండు రెవిక, చొక్కాయి మొదలగు వస్త్రములను వదులు చేసి, దగ్గర కత్తి, రాళ్లు, గృహకృత్యముగు యేసామానును వుంచక, జాగ్రత్తపడుచు మోస్కస్ Q ను[Moschus Q] గాని, క్యాంఫర్ [Camphor] ను గాని వాసనచూపించుచు మోస్కస్ 3 ను (Moschus 3) గంటకొక మోతాదు చొప్పున ఆదినమంతయు వాడవలయును.

## 65. మూర్ఛరోగము. (Epilepsy)

ఒయినాన్థి క్రొకాట 3 (Oenanthe Crocata 3):- నడివయస్సువారలకు కాలికముగ కలిగిన మూర్ఛతోబాటు నోటివెంట నురుగు, తీవ్రమైన కంపము లేక ఈడ్పు యున్న దీనిని ప్రధానౌషధముగ వాడవలయును. పైగుణగతములతోబాటు వ్యాధి దీర్ఘకాలమునుండియున్న, రానబ్యూఫో 6



లేక బ్యూఫో 6 (Rana Buto 6, or Bufo 6) ను రోజుకు 4 మోతాదులను వాడవలయును.

సికూట 6 (Cicuta):— 14, 15 సం॥ లోపు ప్రాయమువారలకు కాలికముగ కలిగి, భయంకరమైన వికారము లేక ఘోరమైన వంకరతో శరీరము వంగి లేక ముడుచుకొని యుండుటయున్న దీనిని వాడవలయును. వ్యాధి దీర్ఘకాలము నుండియున్న, ఓపియం 6, 30 (Opium 6, 30) లను వాడవలయును. రోగమువలన దేహమంతయు కలుగు ఈడ్పుతో బాటు యెక్కువ నిద్రయున్న నిది బాగుగ పనిచేయును.

కెలి సియనాటం 3 (Kali. Cyanatum 3):— స్మృతి తప్పుటతోబాటు కఠినమైన కంపము, ఒడలు నల్లగానుండి ఉచ్ఛ్వాస నిశ్వాసములు కష్టముతో పీల్చుచున్న దీనిని రో॥ 4 మో॥ల నీయవలెను.

ఇగ్నేషియ 6, 30 (Ignetia 6, 30):— మనోవేదన వలనగాని, భయమువలనగాని, స్వవిషయమైన చింతవలన గాని మూర్ఛకలిగి రోగికి స్మృతితెలసియున్న దీనిని వాడవలయును

ఆసిడ్ హైడ్రో 3 (Acid. Hydro 3):—మూర్ఛవచ్చుచున్నప్పుడు కీచుమని యరచుచు లేక కేకవేయుచుగాని స్మృతితప్పిపడి, కనుపాప విస్తరింపబడి, నిలుకడగా దృష్టియుంచి చూచుచున్నటులగనుండి, నోటివెంట నురుగువచ్చుచున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

కెలిబ్రోమైడు 3 (Kali Bromide 3. Trit.):—ప్రతి దినమునగాని, దినమునకు 2, 3 సార్లుగాని మూర్ఛకలుగుచు వ్యాధికాలికముగానున్న ఈ భస్మమును మోతాదునకు 8 గ్రైనుల చొప్పున రోజుకు 3 మో॥లను వాడుచుండ వలయును. దీనివలన సుగుణము కనబడనిచో, ఆర్టెమేసియ వల్గరిస్ 1, 3 (Artemesia vulgaris 1, 3):— లను రోజుకు 4 మో॥లను వాడవలయును. దీనిని దీర్ఘకాలపు వ్యాధులకు గూడ వాడవచ్చును.

బెల్లడోన 1, 3 (Belladona 1, 3):— కన్నులు ఎఱ్ఱగను, ప్రకాశముగనుయుండి, ముఖము ఎఱ్ఱబారి కనుపాప విస్తరింపబడి నిలుకడగాచూచుచు, ఒడలంతయుగాని గర్భము నందుగాని మంట, ఉలికిపడుట, వెలుతురును చూచుట కయిష్టముగా నుండుటయున్న దీనిని వాడవలయును.

కుప్రింమెటాలికం 6 (Cup. Met. 6):— ఘోరమైన తిమ్మిరులతో రోగమునవలనదేహమందు ఈడ్పుకలిగి ముఖము నల్లగానుండి, చల్లనిచెమటయున్న దీనిని వాడవలయును.

కాల్కేరియకార్బోనిక 30 (Cal. Carb. 30):—గండమాలవ్యాధిగల రోగులకు మూర్ఛయున్న దీనిని రోజుకు 4 మో॥ వాడవలయును. (ఈ ఔషధము స్థూలశరీరమును తగ్గునట్లుగాచేయును.)

కుప్రంఆసెటికం 3 (Cup. Acet 3 Trit.):—ఎక్కువ తీవ్రమైన కంపము లేక ఈడ్పుకలిగి ముఖమునల్లబారియున్న నిది పనిచేయును.



కాలిముర్ 3,12 (Kali Mur 3,12), కాలిఫాసు 3,12 (Kali phos 3,12), కాలిసల్ఫు 3,12 (Kali Sulph 3,12), కెలిహైడ్రియాటికం 6 (Kali Hydro. 6), బ్యూఫో 6 (Bufo 6), కాల్కేరియకార్బ 30 (Cal. Carb 30), జింకంఫాసు 3 (Zinc. Phos 3), సైలీషియా3,30 (Silicea 3,30), ప్లంబం 30 (Plumbum 30), సల్ఫర్ 30 (Sulph 30) లను గూడ పరిస్థితులనుబట్టి వ్యాధిపురాణముగానున్న వీటిని వాడవలెను.

జంతువాంతం వలన కలిగిన సినా 3 (Cina 3) ట్యూక్రియం 6 (Tucreum 6) శాంటోనైను 1 (Santonine1. Trit.) లను వాడవలను.

నరముల బలహీనతవలన కలిగిన, ఆసిడ్ఫాసు 3 (Acid Phos 3), ఫాస్ఫరస్ 6 (Phos 6), చైనా 6 (China 6), ఫెర్రంమెటాలికం 6 (Fer. Met. 6) లను వాడవలయును.

భయమువలన కలిగిన, ఓపియం 30 (OPium 30) అకోనైటు 3 (Aconite 3) ను వాడవలయును.

### 66. గర్భవతికి కలుగుజబ్బులు. (Diseases of Pregnancy.)

#### (a) మూర్ఛ. (Fainting).

ఇది కలిగినవెంటనే మాడునందును ముఖమునందును చల్లని నీటిని చల్లి, క్యాంఫర్ (Camphor) ను గాని

మొస్కస్ Q (Moschus Q) ను గాని వాసన చూపించు చుండవలసినది; పాండువవలన మూర్ఛ కలిగిన, చైనా 6 (China 6) ను వాడవలయును; భయమువలన కలిగిన, ఓపియం 6 (Opium 6) ను వాడవలయును; గుండెజబ్బువలన కలిగిన, డిజిటలిస్ 6 (Digitalis 6) ను వాడవలయును; నరముల బలహీనతవలన కలిగిన ఆసిడ్ ఫాసు 6 (Acid. Phos. 6) ను వాడవలయును.

N. B. బజారులలో అమ్ము స్మెల్లింగుసాల్టు మొదలగు ఘాటుమందులను కొందరు తెలియక విస్తారము సేపు వాసన చూపించుచుండుటవలన, మందుయొక్క ఘాటు మెదడువరకు యెక్కి ముక్కునెంటరక్తము స్రవించుటయుగూడ సంభవించి నది. గాన హోమియోపతీమందులనే వాసనచూపించుచుండ వలసినది.

(b) నడుము నెప్పులు. (Pain in Back and Loins.)

బ్రయోనియ 3 (Bryonia 3); రుహస్‌టాక్సు 6 (Rhus. Tox. 6); సెపియ 30 (Sepia 30); కాల్ కేరియ కార్బ 6 (Cal. Corb. 6); కాస్టికం 6 (Caust. 6) లను ప్రధానౌషధములుగా వాడవలయును ప్రసూతి సమయము నందుయున్నటులుగా నెప్పులు నడుమున, పిరుదలనయున్న సెకేల్ కర్ 3 (Secale, Cor. 3) ను వాడవలయును. వక పిరుదన, వకపార్శ్వమున నడుము నెప్పియున్న, ఛమోమిల్లా 6



(Chamomilla 6), పల్సెటిల్లా 3 (Puls. 3), ఫాస్ఫరస్ 3 (Phos. 3), అకోనైటు 3 (Aconite 3) లను వాడవలయును.

(c) పండ్లనొప్పి. (Toothache.)

అకోనైటు 3 (Aconite 3):— పండ్లనొప్పితో జ్వర ముండిన దీనిని వాడవలయును. అజీర్ణమువలన పండ్లనొప్పి కలిగిన కాల్ కేరియఫ్లోరాట 6 (Cal. Flo. 6), మెర్క్యూరియస్ సాలబిలిస్ 6 (Mer. Sol. 6), నక్సువామిక 30 (Nux. vom. 30), ఛమోమిల్లా 12 (Chamomilla 12), యాన్‌టిమోనియంక్రూడం 6 (Ant. Crud. 6), క్రియోసోటం 12 (Kreosote. 12) లను వాడవలయును.

(d) ఉబ్బురోగము. (Dropsy.)

పాదములు మొదలగునవి వుబ్బరించియున్న, ఆర్సెనిక్ ఆల్బు 30 (Ars. Alb. 30), చైనా 6 (China. 6), ఎపిస్ మెల్లిఫికా 30 (Apis. Mel. 30) లను వకఔషధము 5,6 రోజులలో పనిచేయనిచో రెండవ దానిని మార్చవలెను.

(e) వికారము, వాంతి. (Nausea, Vomiting).

సింఫోరికార్పస్ రేసిమోజ 3,30 Symphoricarpus. Racomosa. 3,30):—వికారము లేక వాంతికలిగి, అజీర్ణము, ఆహారముమీద మంచియిష్టత కలిగి చూచిన వెంటనే తృప్తి జెందుట, విరేచనబద్ధము, పైత్యాధిక్యతవలన నోటివెంట నీరూరుటయున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

నక్సువామిక 30 (Nux-vom 30):— నురుగుగాగాని పసరుగాగాని వాంతి; వక్కొకరోజున విరేచనబద్ధము, మరియొక రోజున విరేచనములు; ఎక్కిళ్లు; ఉదయమునగాని, భోజనానంతరమునగాని, భోజనమునకు పూర్వముగాని వాంతియగుట; నోటివెంట యెక్కువగ నీరు వూరుచుండుట యున్న దీనిని రోజుకు 4 మో॥ల నీయవలెను.

ఎలెట్రిస్‌ఫారినోజ Q 6 (Aletris. Farinosa Q, 6); క్రియోజోటు 6 (Kreosote 6); శెపియ 30 (Sepia 30); ఎపామార్ఫియ 6, 30 (Apomorpia 6, 30); కెలిసాలిసిలికం 30 (Kali. Salicylicum 30) లను వకదానివలన నొకరోజులో సుగుణములేనిచో 2వ దానిని మార్చవలెను. వాంతులు వుద్రేకముగనున్న ½ గంటకొక మోతాదు నీయవలెను.

### (f) తిమ్మురులు. (Cramps.)

ఇది సాధారణముగా 4వ, 5వ మాసములందు పిరుదలకు, గర్భమునకు, నడుము వెన్నునకు, కాళ్ళకు మొదలగు వాటి కండరములకు తిమ్మురులు కలుగును.

ఛమోమిల్లా 6 (Chamomilla 6):— పిరుదలకు కాళ్ళకుకలిగిన దీనిని రోజుకు 4 మో॥లను వాడవలెను.

తలనొప్పి, తిమ్మురులు, అజీర్ణము, వికారముయున్న నక్సువామిక 6 (Nux-vom. 6) బ్రయోనియ 6 (Bry. 6) శెపియ 6 (Sepia 6) లను గుణగతములనుబట్టి వాడవలెను.



విరేచనములతో తిమ్మురులుయున్న ఐరిస్‌వర్స 6 (Iris-vers. 6), వెరాట్రంఆల్బ 6, 30 (Verat. Alb 6, 30)ను వాడవలయును.

తిమ్మురులతో పొత్తికడుపునొప్పియున్న కోలసైంథిస్ 6 (Colocynthis 6), కుప్రంమెటాలికం 6 (Cup. Met. 6) నక్సువామిక 6, 30 (Nux-vom. 6, 30) వాడవలయును. తిమ్మురులతో కడుపుబ్బరముయున్న, లైకపోడియం 6 (Lycopodium 6) ను వాడవలయును.

### (g) మూత్రకృచ్ఛము. (Dribbling of Urine.)

కెనబస్ సతీవ 3 (Cannabis Sativa 3) కాన్థరిస్ 3 (Cantharis 3.) సినా 3 (Ciha 3) బెల్లడోన 3 (Belladona 3) లను లక్షణములను బట్టి వాడవలయును. వ్యాధి వుద్రేకముగ నున్నప్పుడు 10 నిమిషములకొక మో॥ నిచ్చుచు నొక ½ గంటలో సుగుణము లేనిచో ఔషధమును మార్చుచుండవలెను.

### (h) మూత్రబంధన. (Suppression of Urine.)

రూబినీస్ క్యాంఫర్ (Rubini's Camphor) కాన్థరిస్ 6 (Cantharis 6) బెల్లడోన 3 (Belladona 3) లను లక్షణములను బట్టి వాడు[illegible]వలెను.

### (i) మలబద్ధము. (Constipation.)

కొలిన్ సో[illegible]llinsonia 3) ప్రధానౌషధమై యున్నది. నక్సువామిక 30 (Nux. Vom 30), బ్రయోనియ6

(Bryonia 6) సల్ఫర్ 30, ఓపియం 30 (Opium 30) ప్లంబం 6 (Plumbum 6) లనుగూడ, వక దానివెంట నొక దానిని సుగుణములేనిచో మార్చుచుండవలెను.

(i) అతిసారము. (Diarrhoea.)

మెర్క్యూరియస్‌సాలబిలిస్ 6 (Mer. Sol. 6), చైనా 6 (China 6), ఆసిడ్‌ఫాసు 6 (Acid. Phos. 6) సల్ఫర్ 30 (Sulph 30) పాడోఫిలం 6 (Podophyllum 6.) లను వాడుచుండవలయును. ఈ ఔషధములవలన ప్రయోజనము లేనిచో, "అతిసారము" నందు వ్రాశియుండు ఔషధములను లక్షణములనుబట్టి వాడవలయును.

(k) గుండెలయందు మంటగనుండుట. [Heart-bern.]

పల్సటిల్లా [Pulsatilla.]; కాప్సికం [Copsicum] కాల్ కేరియకార్బ (Cal-carb) 6-30 లను వాడవలయును.

[l] నిద్రలేమి. (Sleeplessness.)

కాఫియ 6 (Coffea 6) ప్రధానౌషధమైయున్నది. దీని వలన సుగుణమెలేనిచో బెల్లడోన 6 (Belladona 6) ను వాడ వలయును రాత్రి 2, 3 గం॥లనుండి నిదుర పట్టకయుండిన, సల్ఫర్ 30 (Sulph. 30) ను రోజుకు 4 మోతాలను వాడవల యును. జ్వరముతో అనిద్రయున్న ఆకోనైటు 3 (Acon 3) వాడవచ్చును. నొప్పివలనగాని, తిమ్మురులవలనగాని నిదుర పట్టకయుండిన, ఛమోమిల్లా 6 (Chamomilla 6) వెరాట్రం ఆల్బ 6 (Verat, Alb. 6) ను వాడవలయును.



[m] కోరిక. [Longings.]

కచ్చికనుగాని, మట్టినిగాని తినుటవలన జబ్బుకలిగిన కార్బో వెజిటబిలిస్ 6 (Carb veg. 6) ను వాడవలయును. సీమసున్న, విభూతి మొదలగు వానిని తినుటవలన జబ్బుకలిగిన కాల్ కేరియకార్బ 6 (Cal. carb 6) ను వాడవలయును.

(n) దడ. (palpitation of the Heart.)

డిజిటలిస్ 3 (Digitalis 3) ప్రధానౌషధమైయున్నది. దీనిని రోజుకు 2మోతా॥లకన్న యెక్కువగా వాడగూడదు. అజీర్ణవలన కలిగిన నక్సువామిక 30 Nux-vom 30 ను వాడ వలయును.

(o) మూలవ్యాధి. (Piles.)

పనిపాటలుచేయనివారికి మూలవ్యాధికలిగి బాధయుం డిన, నక్సువామిక 30 (Nux-vom, 30) ను వాడవలయును. విరేచనబద్ధముతో మూలవ్యాధియున్న కొలిన్‌సోనియ 3 (Collinsonia 3) ను వాడవలయును. మూలవ్యాధితో దడ యున్నను నిది పనిచేయును.

(p) స్తనములయందు నొప్పి. (Pain in Breasts

నొప్పిగాను, ఎఱ్ఱగాను, బరువుగాను యుండిన బెల్ల డోన 3 (Belladona 3) ను వాడవలెను. బరువుగ నుండి పుచ్చురించియున్న బ్రయోనియ 3,12 (Bryonia 3,12) ను వాడవలయును.

(q) అబద్ధపు నెప్పులు. (False Pains).

ఛమోమిల్లా (Cham.) పల్సటిల్లా (Puls.) సిమిసిఫ్యూగ (Cimicifuga) కల్లోఫిలం (Caulophyllum) 6_30 లను 10 నిమిషముల కొక మోతాదు నిచ్చుచు నొక ½ గం॥లో సుగుణము లేనిచో మరియొక ఔషధమును మార్చవలెను.

(r) రక్తస్రావము. (Haemorrhages during Pregnacy.)

పడుటవల్లను, దగుటవల్లను, ఏడ్చుటవల్లను రక్తస్రావమగుచుండిన అర్నికా 30 (Arnica 30) ను 10 నిమిషముల కొక మోతాదు నీయవలెను. నెప్పితోగూడ స్రావమగుచుండిన ట్రిల్లియం Q (Trillium Q) ను వాడవలయును.

(s) నోటనీరూరుట. (Water-brash).

మెర్క్యూరియస్ సాలబిలిస్ 6 (Merc. Sol. 6) ప్రధానౌషధమైయున్నది; నక్సువామిక 30 (Nux-vom. 30) నోటియందు పుల్లని రుచి, అతితొందరతో నోటివెంట నీరు వాంతివలెనగుట, గుండెలలో మంట, అజీర్ణము, విరేచనబద్ధముయున్న దీనిని రోజుకు 4 మో॥లను వాడవలయును. ఈగుణగతములు తగి నోటియందు పుల్లని రుచి తగ్గకయుండిన నాట్రంఫాస్ 6 (Nat. Phos. 6) నాట్రంసల్ఫ్ 6 (Nat. Sulph. 6) లను వాడవలెను.

కార్బోవెజిటబిలిస్ 30 (Carb. Veg. 30):— యోనిస్థానము బిగియుచున్నటులనొప్పి, గర్భమునందు మంట నోటివెంటపుల్లని నీరువూరుట యున్న దీనిని వాడవలయును. ఎల్లప్పును నోటివెంట నీరుకారుచున్న కాల్కేరియ కార్బ 30 (Cal. carb 30) ను రోజుకు 4 మో॥లను వాడవలెను.



67. గర్భపాతము. (Abortion.)

శాబిన 3, 30 (Sabina 3, 30):— గర్భపాతమును కాపాడుటకిది ప్రధానౌషధమైయున్నది. 3వ, 4వ మాసములందు గర్భపాతము అలవాటుయున్న, గర్భవతియైన ప్రారంభమునుండియు దీనిని రోజుకు 4 మో॥లను వాడవలెను.

సెకేల్ కర్ 3, 30 (Secale 3, 30):— అవ్యవధిగా 7వ, 8వ మాసములందు ప్రసూతియగుచుండిన, దీనిని గర్భవతియైనప్పటినుండియు రోజుకు 4 మో॥ల నిచ్చుచుండిన రక్షణగానుండును.

అర్నిక 3, 30 (Arnica 3, 30):—దెబ్బతగులుటవలన గర్భపాతమగునని తలచిన 5 లేక 10 నిమిషములకొక మోతాదు నీయవలెను. మానసిక విచారములవలనగాని లేక దుఃఖమువలనగాని గర్భపాతమగునని తోచిన ఛమోమిల్లా 6 (Cham. 6) ను 10 నిమిషములకొక మోతాదు నీయవలెను. వుండివుండివచ్చు నొప్పిగాని, పొత్తికడుపుశూలగాని కలిగి, గర్భపాతమగునని తోచిన వైబర్నంఓప్యులస్ 3, 12 (Viburnum opulus 3, 12) ను, 10 నిమిషములకొక మోతాదు నీయవలెను. యోనిస్థానమునందలి జబ్బులవలన నెప్పులును గర్భపాతమగుచుండిన, గర్భవతియైన ప్రారంభమునుండియు ఎపిసుమెల్ 6 (Apis. Mel. 6), శాబిన 6 (Sabina 6) శెకే

ల్‌కర్ 6 (Secale, Cor. 6) లను రోజుకు 4 మో॥లను గుణగతములనుబట్టి ఔషధమును మార్చుచుండవలెను.

మెర్క్యూరియస్‌కరోసివస్ 6 (Mer. cor. 6):— అను వంశకగర్భపాతము, అనగా తల్లికిగర్భపాతము కలిగెడు స్వభావముండుటవలన ఆమెపిల్లలకును; తరుచు అట్టి అలవాటు యుండవచ్చును. అట్టిదానిని అనువంశక గర్భపాతమందురు. ఇట్టి గర్భపాతముయున్న గర్భవతిగా నుండునప్పటినుంచియు రోజుకు 3 మో॥లను వాడుచుండవలయును.

బెసిలినం 30, 200 (Bacillinum 30, 200):—గర్భవతికి ఉబ్బసము, క్షయ మొదలగు జబ్బులుండుటవలన గర్భపాతమగుచుండిన గర్భవతిగానుండునప్పటినుంచియు 15 రో॥ కొక మోతాదు నీయవలెను.

ప్రసూతియైన తరువాతగాని, గర్భపాతమైన తరువాతగాని వకగంటలో మావిపడనియెడల ప్రతి 3 నిమిషములకొక మోతాదు పల్సటిల్లా 30 (Puls. 30) నుగాని, శెకేల్‌కర్ 30 (Secale. 30)ను గాని వాడిన 2, 3 మో॥లలో మావిపడును.

### 68. ప్రసూతి. (Labour or Delivery)

ఓపియం 6, 30 (Opium 6, 30) నొప్పులు వచ్చుచు ఆగిపోవుట, ముఖము నేత్రములు యెఱ్ఱబారియుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు యెక్కువగనుండి ధ్వనితో వినబడుచు, స్మృతితప్పి పడియున్న దీనిని వాడవలయును.



హైసామస్ 6 (Hyos. 6):— నొప్పులు యెక్కువగనుండి స్త్రీ యేడ్చుచుండిన దీనిని 10 నిమిషములకొక మో॥ నీయవలెను.

పల్సటిల్లా 30 (Puls. 30):— క్రమము తప్పి వచ్చు కొద్ది నొప్పులు, వికారము, పిరుదులయందు తిమ్మిరులు యున్న దీనినివాడి గుణములేనిచో శెకేల్‌కర్ 30 (Secale cor. 30) ను వాడవలయును. పై గుణగతములతో పాటు జ్వరము సంధియున్న బెల్లడోన 6 (Bell. 6) ను వాడవలెను.

క్యాంఫర్ (Camphor):— ప్రసూతియైన తరువాత గాని, కాబోవునప్పుడుగాని, ఒడలుచల్లగానుండి, నాడి నీరసించియున్న 5 నిమిషముల కొక మోతాదు నీయవలెను.

నొప్పులు చెప్పుటకు వీలులేనంత యెక్కువగనుండిన, ఛమోమిల్లా 6 (Cham. 6) కాఫియ 6 (Coffea 6) జెల్సీమియం 6 (Gelse. 6) లనుగూడ వాడవలయును.

తలకు బదులుగా ప్రతికాన్పునకు, కాలుసేతులు ముందు వచ్చుచుండిన, తల్లికి శిశువునకు ప్రాణముప్పును లేకుండ సవ్యముగు కాన్పువచ్చుటకు, గర్భవతియైనప్పటి నుండియు నీ క్రింది విధముగా వాడవలయును. రాత్రి పరుండబోవునప్పుడు నక్సువామిక 30 (Nux-vom. 30) మధ్యాహ్నమొకమోతాదు బెల్లడోన 30 (Bell. 30) ఉదయమున నొకమోతాదు పల్సటిల్లా 30 (Puls. 30) వాడుచుండిన,

అజీర్ణము, మలబద్ధము నివారణమగును, ఏకష్టము లేక యే కాన్పు సులువగును. పై విధముగ ఔషధమును 6 రో॥ సేవించుచు 4 రోజులు మాని వేయవలెను. అటుల మాని వేయనిచో పల్సటిల్లా (Puls.) యందు గర్భపాతను కలిగించు గుణముండుటవలన అపాయము చేయవచ్చును. అటుల 9 మాసములు ఆఖరువరకును సేవించిన పైనుదహరించిన యిబ్బందులకు పాల్బడకుందురు.

విస్కుంఆల్బ Q, 3 (Viscum Alb. Q, 3):— ప్రసవ వేదనచే బాధనొందుచు నొప్పులు వచ్చుచు ఆగిపోవు చున్నప్పుడు ½ ఔన్సు కాచి చల్లార్చిన నీటియందొక మందు చుక్కనువేసి మోతాదుగా నీయవలెను. అటుల 10 నిమిషముల కొక మోతాదు నిచ్చిన 6 మో॥లలో నొప్పులు బాగుగ వచ్చి 1,2 గం॥లలో సుఖప్రసవమగును.

### 69. (a) ప్రసూతియైన తరువాత వచ్చు జబ్బులు. (Complications of Delivery).

ప్రసూతియైన తరువాత మనవారలకు తరుచు కడుపునొప్పులు కలుగుచుండును. అందు నిమిత్తమై రసమును వేయుదురు. రసమువాడిన వెంటనే నోరు పట్లుపట్టిన ఆసిడ్ నైట్రిక్ 200 (Acid. Nit. 200) లను రోజుకు 2 మో॥ల చొప్పున 4 దినములు వాడవలయును. అర్నిక 3, 30 (Arnica 3,30) దీనివలన ప్రసూతియైన తరువాత కలుగు



కడుపునొప్పులు నివారణ యగుటయేగాక, శ్రమపడియున్న స్త్రీకి సుఖముగా నిద్రపట్టును. రోజుకు 4 మో॥లను వాడవలసినది. దీనివలన సుగుణములేనిచో జెల్సీమియం 6 (Gels, 6) కాఫియ 6 (Coffea 6) లను వాడవలయును.

### (b) స్రావము. (Haemorrhages).

యోనిస్థానమును మంత్రసానిచే సరిగా నొక్కించి గోరువెచ్చని నీటిచే, డూష్ నీయవలయును. వెంటనేకాళ్ల క్రింద దిండ్ల నమర్చి, తలను పల్లముయందుంచు నట్లుగాచేసి పరుండ బెట్టవలయును. శాబినా 3 (Sabina 3) ను గాని, హెమామిలిస్ 3 (Hemamelis 3) ను గాని గంటకొక మోతాదు వాడవలయును. స్రావము తగ్గిన పిమ్మట బలహీనతయున్న చైనా 6 (China 6) ను రోజుకు 4 మో॥ల నీయవలెను. తలనొప్పియున్న ఫెర్రంమెటాలికం 6 (Fer Met. 6) ను వాడవలయును.

### (c) స్మృతితప్పిపడియుండుట. (Unconsciousness.)

క్యాంఫర్ (Camphor):— స్మృతితప్పి చలువకమ్మి నాడి నీరసించియున్న దీనిని 5 నిమిషములకొక మోతాదు నీయవలెను. దీనివలన సుగుణములేనిచో అర్సెనిక్ (Arsenic. ఆసిడ్ హైడ్రో (Acid. Hydro.) కార్బొవెజిటబిలిస్ (Carb. Veg.) 6-30 లను 5 నిమిషములకొక మోతాదు వాడవలయును స్మృతితప్పి తలమీద చల్లనిచెమటయున్న దీనిని

10 ని॥కొక మోతాదు నీయవలెను. యోనిస్థానమునుండి యెక్కువగనగు స్రావమువలన స్మృతితప్పియున్న చైనా 6 ను (China 6) కార్బోవెజి 30 (Corb. veg 30) వాడవలయును. స్మృతి వెంటవెంటనే తప్పుచుండిన స్ట్రామోనియం3,30 (Stram. 3, 30) లను 10 నిమి॥కొక మోతాదు వాడవలయును. భయంవలన స్మృతతప్పుచుండిన అకోనైటు 3 ను (Acon, 3) కాఫియ 6 (Coffea 6) ను వాడవలయును. జ్వరము, దాహముకలిగి స్మృతితప్పుచుండిన అకోనైటు 3 (Acon. 3) ను వాడవలెను. తీవ్రమగునాడి, సంధి, చల్లని చెమట స్మృతితప్పుటయున్న వెరాట్రం విరెడు 3 (Ver. vir3) వాడవలయును. హైసామస్ (Hyos.) బెల్లడోన (Bell.). ఓపియం (Opium) హైడ్రోకియానిక్ ఆసిడ్ (Acid Hydro) 3-12 లను పరిస్థితులనుబట్టి వాడవలెను.

(d). అకస్మాత్తుగ చెమటఆగుట.

(Sudden stoppage of perspiration.)

డల్‌కెమీర (Dulc) ఛమోమిల్లా (Chamo.) 6-30 లను వాడవలయును.

చైనా 6 (China 6) ఆసిడ్‌ఫాసు 6 (Acid. phos 6) లను వాడవలయును. ఏకారణమువల్లనైనను నిద్రపట్టకయున్న కాఫియ (Coffea) బెల్లడోన 6-30 లను వాడవలయును.



(f) మూత్రబంధన.

(If no Urine is passed within 12 hrs.)

ప్రసూతియైన 12 గం॥ తరువాత మూత్రవిసర్జన లేక యున్న అకోనైటు 3 ను (Acon. 3) 15 నిమి॥ లకొక మో॥ నీయవలెను. 4 మో॥లలో సుగుణములేనిచో బెల్లడోన 3, 12 (Bell. 3, 12) ను $\frac{1}{2}$గంటకొక మో॥ చొప్పున 3 మో॥ లను వాడవలయును. తరువాత ఈక్విజిటం 3 (Equisetum 3) ను వాడవలయును.

(g) విరేచనబద్ధము. (Constipation.)

ప్రసూతియైన 48 గం॥ లోపుగా విరేచనముకాకయున్న కొలిన్‌సోనియ 3 (Collinsonia 3) నుగాని, వెరాట్రంఆల్బ 6 (Verat. alb. 6) ను గాని 2 గం॥లకొక మో॥ చొప్పున ఆదిన మంతయు వాడవలయును.

(h) అతిసారము. (Diarrhoea)

హైసామస్ 6 (Hyos, 6) పల్సటిల్లా 6 (Puls. 6) లను పరిస్థితులనుబట్టి వాడవలయును. రోజుకు 6మో॥ల నిచ్చేది.

(i) రక్తస్రావము. (Lochia)

ప్రసూతియైన 2, 3 వారములవరకు కొద్దికొద్దిగా రక్తము స్రవింపవలయును. అటులగాక యెక్కువ దినములు రక్తము స్రవించుచుండిన శెకేల్‌కరె 30ను (Secale 30)వాడ

వలయును, సింధూరవర్ణమైన స్రావము యెక్కువ దినములగుచుండిన శాబిన 3 (Sabina 3) ను గంటకొక మో॥ వాడవలయును. 2, 3 వారములు స్రవింపవలసిన స్రావము అతాత్తుగా ఆగిన, అకోనైటు 3 (Acon.3) ను వాడవలయును. స్రావము వాసనయున్న క్రియోసోటు3 ను(Kreosote 3)గాని కార్బొవెజి 6 (Carb. veg. 6)ను గాని వాడవలయును.

(j) పాలజ్వరము. (Milk Fever)

ఈజ్వరమున్నంతసేపును బిడ్డను చనుబాలు త్రాగనీయరాదు. ఈజ్వరము 24 గం॥ తరువాత తగ్గకయుండిన అకోనైటు 3 (Acon. 3) ను రోజుకు 4 మో॥లను వాడవలయును. జ్వరము తగ్గి స్థనములు నొప్పిగానుండి గట్టిగాయున్న బ్రయోనియ 6 (Bry- 6)ను వాడవలయును. రోజుకు 4మో॥ చొప్పున 3, 4 దినములు సేవింపవలయును.

(k) పాలు యిచ్చుచున్నప్పుడు నొప్పి. (Painful Nipples.)

పాలు యిచ్చుచున్నప్పుడు తల్లికి నొప్పిగనుండిన ఫెలాండ్రియం 3, 12 (Phelandrium 3, 12) రోజుకు 4 మో॥ వాడవలెను. స్థనములనుండిభుజములవరకు నొప్పి వుండివుండి పొడుచుచున్నట్లుగనుండిన క్రోటన్‌టిగ్ 3, 12(Cro. Tig3,12) నురోజుకు 4 మో॥లను వాడవలెను.



(l) పాలు యిచ్చిన తరువాత నీరసము.
(Lactational exhaustion.)

పాలు యిచ్చిన వెంటనే బలహీనత కలిగిన చైనా 6 (China 6)ను రోజుకు 4 మో॥లను వాడవలయును.

[m] కొద్ది పాలు. (Too little milk)

ప్రసూతియైన 20 గం॥ లోపుగా పాలుపడనియెడల యాగ్నస్ కాస్టస్ Agnus caust. ) 3 ను వాడవలయును. పాలుపడి మరల ఆగిపోయిన ఎసఫోయిటిడ 3 Assafoetida 3 ను వాడవలయును. కోపము వలన పాలు తగ్గిన ఛమోమిల్లా 6 (Cham. 6 ను వాడవలయును. భయమువలన తగ్గిన హైసామస్ 3 Hyos. 3 ను వాడవలయును. మానసిక విచారముచే తగ్గిన ఇగ్నీషియ 6 (Ignetia 6) ను వాడవలయును.

(n) పాలుయెక్కువగా స్రవించుట. (Overflow of Milk

బొరాక్సు 3 (Borax 3) కాల్ కేరియకార్బ 6 (Cal. Carb 6) చైనా 6 (China 6) ను రోజుకు 4 మో॥ల చొప్పున యేది పడునో నది వాడి తెలసుకొని, చల్లని నీటిచే స్థనములను కడుగుచుండవలయును.

సంపూర్ణము.



ఈ పుస్తకములు దొరకుచోట్లు:

౧ డాక్టరు. కె. సాంబయ్య,
L. M. S. (Homoeo.)
కొత్తపేట, తెనాలి.

[లే క]

౨ రామా అండ్ కో.,
బుక్కు-సెల్లర్సు, పబ్లిషర్సు,
ఏలూరు, (పశ్చిమగోదావరిజిల్లా)

[లే క]

౩ సీతారాం అండ్ కో.,
బుక్కు-సెల్లర్సు, పబ్లిషర్సు,
తెనాలి, (గుంటూరుజిల్లా.)

[లే క]

౪ వెంకటరాం అండ్ కో.,
బుక్కు-సెల్లర్సు, పబ్లిషర్సు,
బెజవాడ, (కృష్ణాజిల్లా)



